# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకవర్గము:

తెలికిచర్ల వెంకటరత్నం
విశ్వనాథ సత్యనారాయణ
అడివి బాపిరాజు
తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి



గ్రంథనిర్ణాయక సంఘము:

నోరి నరసింహశాస్త్రి
మల్లాది రామకృష్ణశాస్త్రి
తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి

సంపుటి ౨ ఏప్రిల్ ౧౯౩౭ సంచిక ౪






---

ప్రతిభ సంవత్సరపు చందా రూ 2. విడిసంచిక రూ 0.8.0

జూలై. అక్టోబరు. జనవరి. ఏప్రిల్ మాసాలలో ప్రకటన

---



# కీలాంజలి

స్మృతిలోకం
తలుపు తెరవకే
చితిమంటలు
పైకి పర్వునే!

గతకాలం పై
తెరను తీయకే
క్షితి నుత్పాతము
లుప్పతిల్లునే!

*

జలవాహినిలో
బుద్బుదాలమై
కలలే కని సం
తోష మొందలేమా!

తెలిమంచుల
బాష్పమౌక్తికాలే
మన గళమాలల న
లంకరించుకోమా?

*

యువజీవిత
సాహచర్యముల్
అవమానాస్పద
మన్న దెవ్వ రోహో!

పవమాన సు
గంధిలోత్సవ
మ్మెవ డావగ
లాడు ధాత్రిలో!

*

మానస ప
ద్మంపు పుప్పొడుల్
తేనియలూ వృథ
సేయబోకవే,

ప్రాణసఖుం
డున్న వా డొకం
డీనాటికి నా
సించి నీ సుఖాలే!

*

శోకాలనె నా
సువర్ణ తూలికా
లోకంలో పరి
మార్చనీయవే!

నీకై నిర్మల
మైన కానుకగా
ఈ కావ్యాంజలి
స్వీకరించుకోవే!

# దేవీ!

కలకలమేదో గుండెలు
జలదరింపజేయు రేయి!

విలవిల చలియించెడి యే
విహ్వలతయో విరబారిన
పత్రవిస్తృతత నాపై
బర్వి, పులకరించు బ్రదుకు.

నిర్వృతియో, నిస్పృహయో,
నీరవహృదయ రహస్యము,
కాలమేఘగాంభీర్యము,
నీలగగనవైశాల్యము,
ఆలస్యము సైరింపని
వేల జీవి తృషితాత్మయో
మేలుకొల్పి మెయి సోకిన
చేలాంచల సంచలనము,
దూరపుపిలుపో, మంగళ
హారతుల గుబాళింపో!

దేవీ! ఏ మధురాకుల
భావనముల పరపుదువో?
దేవీ! ఏ స్మృతిపథసం
చారణముల నెరపుదువో?

లోకాలోకమ్ముల నెగ
బ్రాకిన దే పరిమళము
ఆకుసందడుల గుసగుస
లాడిన దే సుధాగళము!

రేకు రేకులను పులకలు
సోకిన హృదయాంభోజము
చీకటుల హృదంతరమం
దే కాంచెనో ఇనోదయము!

హే గుప్తాశయకీలా!
హే దీప్తాశాజ్వాలా!

రాతిరి తెలవారె మనకు
రారమ్మని పిలిచినవో
నీ తలపులు కాతరమై
చేతులు సారించినవో!

దూర మనెడి తంతువు నీ
కేల నొడిచి నాగుండెల
చేరువగా చేదుకొంటి
ఈ రాతిరి నో దేవీ!

కర్పూరనివాళి నిచ్చి
కరవీర సుమాల గ్రుచ్చి
తెరమరుగయి నిలిచి పిలుచు
చిరరజనీహృదయరాజ్ఞి!

కలకల మేదో గుండెలు
జలదరింపజేయు రేయి
విలవిల చలియించెడి నే
విహ్వలతయో ఎద యిల్లయి!

# ఆకాశతార

దూరాన నాకాశ
పారమంటిన తార
జేర దొరకొన్నాను
పేరాసన్,

ఆర తందిచ్చునో
వారించునో నన్ను,
చేరుకోనే లేనో
ఈరేయిన్ ?

*

జలరాశి కద్దరిన్
మిలమిలా మెరిసేటి
జలజమ్ము సౌరభమె
వలచాను,

దరవికాసించునో
విరియనే విరియదో,
నిరసించి సిరిరాణి
తరలేనో ?

*

ప్రవహించు నిర్ఝరిణి
నవరోధ మొనరించి
దవదాహ మార్పు మని
దరిశాను,

పొరలి ముంచెత్తునో
కరము లందిచ్చునో,
పరిహాసమున వీడి
పరచేనో ?

*

తేలిపోయే చల్ల
గాలినే నా మురళి
నేలుకోమని సమ
ర్పించాను,

కాకలీనిస్వనమె
కల్పించునో, వంశి
కయి నంటుకే విస
ర్జించేనో ?

మల్లవరపు విశ్వేశ్వరరావు

# భట్టలోల్లట రసవాదము

మాధవరామశర్మ

భట్టలోల్లటుడు మీమాంసక మూర్ధన్యుడు. తనలో సమున్మేషము పొందిన సాహితీరసమును మీమాంసకదృష్టితో విమర్శించినాడు. రసవాదము చేసిన శాస్త్రకారుల్లో లోల్లటుడు కూడా గణింపతగ్గవాడే. మమ్మటుడు మొదలయిన ఆలంకారికులు కూడా రసమీమాంసఘట్టం వచ్చినపుడు లోల్లటుణ్ణి ముందుగా స్మరించుతున్నారు. అసలు ముందుగా రసమును చర్చలోకి దింపింది కూడా ఈమహానీయుడే నేమో అనే ఊహ కలుగుతుంది. తాను రసాన్ని ఏమార్గాన ప్రవహింపచేసినా చర్చకు అవకాశం కల్పించిన ఈలోల్లటుడికి నమోవాకం చెప్పవలసిందే. ఇతడు రసతత్వంలో ఉత్పత్తిమార్గాన్ని నిరూపించుతాడు. రసముఉత్పాద్యం అని ఇతని నిర్ణయం. ఇతని వాదసారాంశం ఈవిధంగా ఉంటుందని తెలుసుకోవటానికి అవకాశం ఉన్నది.

స్థాయిభావానికి విభావాదులతో సంయోగము కలిగితే రసము నిష్పన్నం అవుతుంది అని "విభావానుభావ వ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అనే భరతసూత్రానికి సామాన్యరూపంగా అర్థము. రత్యాదికమైనస్థాయి చిత్తవృత్తిస్వభావము. ఇటువంటిచిత్తవృత్తి ఉత్పన్నం కావటానికి విభావము కారణము. అనుభావాలు రెండు రకాలుగా ఉంటవి. రసజన్యము లయ్యే అనుభావాలను ప్రకృతంలో వివక్షించటానికి వీలులేదు. ఇక్కడ గ్రహించే అనుభావాలు రసకారణభూతాలు. కారణభావం పొందగలిగే భావాలే ఈస్థలంలో అనుభావాలుగా పరిగణిస్తారు. వ్యభిచారిభావాలు కూడా చిత్తవృత్తిస్వభావాలే. అయినా స్థాయిభావంతో సహభావులు కావు. ఈ వ్యభిచారిభావాలలో స్థాయితాసిద్ధి లేదు. అందువల్ల స్థాయిధర్మంతో ఉండే స్థాయిభావాల సమకాలంలో ఇవి అభివ్యక్తిని పొందలేవు. కాగా ఇవి వాసనారూపంతో ఉండేస్వభావం కలవి అని తెలుసుకోవాలి. సంస్కారానుబద్ధములుగా ఉండేవే ఇక్కడ పరిగ్రహించటానికి అర్హాలు. అనుభావరూపభావాలు కూడా చిత్తవృత్తిస్వరూపాలే అని ప్రాతిస్వికంగా చెప్పటం అనవసరం. విభావం పదార్థాత్మకము. లోకసిద్ధమైన వస్తుస్వభావమునుబట్టి విభావాలు స్వరూపసంపాదన చేసుకొంటవి. అనుభావాలు, వ్యభిచారిభావాలూ సంస్కారబద్ధస్వభావాలు; అంటే వాసనాస్వరూపములన్నమాట. వీటివల్ల రత్యాదిస్థాయిభావము ప్రతీతం అవుతుంది. అదే రసము. ఈమతంలో 'ప్రతీత మవుతుంది' అనే దానికి "వ్యంజనవల్ల అభివ్యక్త మవుతుంది"

అని అర్థం చెప్పటం ఉచితం కాదు. అసలు లోల్లటాది మతస్థితిలో వ్యంజనాస్వీకారం లేదు. అందువల్ల 'ప్రతీతం' అనేపదానికి విషయీకృతం అవుతుంది అని అర్థం చెప్పటం స్వరసంగా ఉంటుంది. స్థాయి భావాన్ని విభావాదులు విషయంగా చేసి కొంటవి అని పరమార్థము. విభావాలు స్థాయిభావానికి కారణాలు. అందుచేత విభావమువల్ల రత్యాదిస్థాయిభావం ఉత్పన్న మవుతుందని గ్రహించాలి. మాలతీ మాధవులపరిణయం ఉదాహరణంగా తీసుకుందాము. మాలతీగత రతిలో మాధవుడు విభావం; మాధవగత రతిలో మాలతి విభావం. విభావరూప మైనమాలతివల్ల మాధవరతి ఉత్పన్న మవుతున్న దన్న మాట ఇట్లాగే అంతటా గ్రహించాలి. ఇదివరలో ఉత్పన్నమైనస్థాయిభావాన్ని ప్రతీతిపథంలో ఉంచటానికి అనుభావాలు సమర్థము లవుతవి. అనుభావాలవల్ల స్థాయి గమ్యము అవుతుం దని సారాంశము. ఉత్పన్నప్రతీత స్థాయిభావానికి సముచిత మైన ఉపచయావస్థను సంపాదించటంలో వ్యభిచారి భావాలు ఉపయోగించుతవి. విభావాదుల సంయోగం కలగకపూర్వం స్థాయిభావము ఉపచితమై ఉండదు. పూర్వ క్షణంలో అనుద్బుద్ధసంస్కారమాత్రంగా ఉటుం దనవచ్చు. విభావాదులసంయోగం కలగగానే స్థాయి ఉల్లిఖిత మవుతుంది; ప్రతీతిమార్గంలో గోచరించుతుంది. తగి నట్లుగా ఉపచిత మవుతుంది. ఈ అవస్థలు స్థాయిభావానికి సంబంధించగానే రసము అనే వ్యపదేశము సిద్ధ మవుతుంది.

ఇట్లాంటిరసము రామాదినాయకనిష్ఠం,వస్తుగతినిబట్టి ఈవిధంగానే చెప్పాలి. సీతాది విషయకంగా కలిగే రత్యాదిస్థాయిభావము రామాదుల్లోనే ఉంటుంది. సీత రామరతిలోనివిభావం అవుతుందికాని ఇతరులరతిలో విభావంకాదు. ఆవిధంగా భావించటం అసమంజసం కాగా రసం రామాదులదే అన్నమాట. అయినప్పటికి సహృదయ సామాజికులు ఆ రసాన్ని అనుమానించు (ఊహించు) తారు. రాముడియందు సీతా విషయకరతిని సామాజికులు ఊహించి నప్పుడు ఆ అనుమితిలో కావ్యములో ఉపాత్తము లయినవిశేషాలన్నీ హేతుభావం పొందుతవి. కావ్యశబ్దాల ముఖ్యావృత్తి అంతటా రామాదులనే విషయంగా చేసుకుంటుంది. కావ్యంలో కూర్చిన శకుంతలా దుష్యన్తాదిపదాలు అభిధావృత్తిని ఆధారంగా చేసుకొని వెంటనే శకుంతలా దుష్యంతాదుల్నే చెప్పుతవి. అంతటా శబ్దశక్తి సామర్థ్యం ఆవిధంగా ఉంటుంది. శకుంతలా దుష్యంతుల పరిణయతత్వమే ప్రతిపాదిత మవుతుంది. కాబట్టి పరిపాకం పొందిన ఆ పరిణయసారం రసమై వాళ్ళకే సంబంధించినది అవుతుంది. ఈరసంలో సామాజికుడికి ఏమీ భాగం లేదు. అయినా సామాజికుడి సహృదయత అనన్యసాధా

రణం. అతడు ఇదంతా గ్రహించుతున్న ప్పటికీ అహంతను పరిత్యాగం చేసుకోడు. దీని కంతకు మార్పు సంపాదించుతాడు; భిన్నాధికరణం ఏర్పరచుతాడు. ఇదంతా పరికాశించటానికి వీలుకాని నటవ్యక్తిలో సమారోపపరిభావాన్ని కుదించుకుంటూ ఇదంతా నిశ్చయం కలుగజేసుకొని ఆస్వాదించుతాడు. అప్పుడు అతడిలో అహంత సమున్మేషం పొందుతుంది. ఈ అహంత కేవలాహంత కాదు. ఇదంతా సంవలితము. అభినయకోవిదుడైన నటుడు కమనీయంగా విభావాదులను ప్రదర్శించి తన అభినయ చాతుర్యంవల్ల సామాజికులకు నూతనజ్ఞానం సంపాదించుతాడు. అప్పుడు సామాజికులకు నటుడిలో రామాద్యభేద జ్ఞానం కలుగుతుంది. ఇంతకుపూర్వం సామాజికుడు రాముడిలో రసం ఉన్నదని గ్రహించాడు. నటవ్యక్తిలో రామాభేదజ్ఞానం కలగగానే రసవత్తాజ్ఞానం కూడా కలిగితీరుతుంది. ఈ విధంగా నటుడిలో రసం ఉన్నదనవచ్చును. నటుడు రామరూపానుసంధానం చేసుకొంటాడు. వాచిక కాయిక-సాత్త్వికాహార్యాభినయాలు అతనికి ఆ అనుసంధానంలో ఉపకారకాలు. అప్పుడు అనుగుణంగా ధీరోదాత్తాద్యవస్థలను అనుకరించగలడు. నటుడు తన శిక్షాపాటవాన్ని బట్టి ఎప్పుడు ఈవిధంగా అవుతాడో అప్పుడు నటుడిలో రామాభేదప్రత్యయం కలగటం అస్వాభావికం కాదు. ఇదంతా ఆరోపపరి భావం. అందువల్లనే నటవ్యక్తిలో వాస్తవ రసం లేదు. అక్కడిరసం ఆరోపితము. ఈ ఆరోప్యమాణరసమే భావకులకు చమత్కారమును సంపాదించుతుంది. ఆరోపం చమత్కారపాత్రము అనేవిషయము అప్రసిద్ధం కాదు. ముఖంలో చంద్రత్వారోపం చేసినప్పుడు చంద్రాభేదప్రత్యయం ఉన్నప్పుడు కలిగే ఆస్వాదము సహృదయులకు అనుభవసిద్ధమే. త్రాడును మందాంధకారంలో చూచినప్పుడు సర్పభ్రాంతి కలుగుతుంది. రజ్జువులో సత్యసర్పం లేదు. అది మిథ్యాసర్పం (ఆరోపితసర్పం) అక్కడ వాస్తవసర్పం లేకపోయినా మనుష్యుడికి భయకంపాదులు కలుగుతూ ఉండటం సకల లోకానుభవసిద్ధం. ఇదంపరికాశ ప్రాతిభాసిక మని అద్వైతులనిర్ణయం. ప్రాతిభాసికమైనా అనంతవికల్పాలకు అది అవకాశం ఇచ్చింది. పరిష్కృతంలోకూడా ఆవిధంగా సమన్వయించుకోవచ్చు. న్యాయంగానటుడు రాముడు కాడు. సీతాదివిషయకంగా ఉద్బుద్ధమైన రతి నటుడిలోలేదు. నటుడు కేవలం అభినయ నైపుణ్యం కలిగినవ్యక్తి అనటంలో పొరపాటులేదు. అయినా అతని అభినయ ప్రాభవమే అనేక ప్రతిభావాలకు అవకాశం ఇస్తుంది. నటుడు విచిత్రసృష్టి. లేని ధర్మాలను ఉన్నట్లుగా సూచిస్తాడు. నటుడిలో కూడుకొన్న భావోద్వేగాతిశయాన్ని చూచి భావకులు భావసత్త్వాన్ని భాసింప చేసుకుంటారు. నటుడి అభినయ

రహస్యాన్ని సరీగా అర్థం చేసుకొని భావించగల సహృదయుడు దేశకాలవస్తుభేదం మరచిపోతాడు. రామమయ లోకంలో విహరించుతాడు. రామ సాక్షాత్కారం కలుగచేసుకొంటాడు. అట్లాంటి సహృదయుడి తన్మయభావనలో పురోవ్యక్తి రాముడై కనపడతాడు. రామసహజభావా లన్నీ ఆవ్యక్తిలోనే గోచరించుతవి. నటుడు ప్రదర్శించినవిభావాదు లన్నీ రాముడివి అనే సహృదయభావన. ఆవిభావాదిసముల్లసితమైనస్థాయి భావకుడికి ఆ రంగవ్యక్తిలో గోచరించుతుంది. ఆవిధంగా గోచరించిన స్థాయి నిర్భరానంద సంవిదూప్రరసము. మొదట్లో నటుడు రామాదిభిన్నుడే అనే జ్ఞానం సామాజికులకు ఉంటుంది. తద్భేదజ్ఞానం ఉంటే తదభేదజ్ఞానం కలుగదు. సత్యమే. అయినా దోషప్రభావంవల్ల అక్కడ భేదం భాసించదు. ఆ యథార్థజ్ఞానాన్ని కలగచేసేది దోషము అని శాస్త్రకారులనిర్ణయం. ఇక్కడ దోషం సాదృశ్యరూపం. ఇట్లాంటిదోషంవల్ల ఏభేదం కూడా గోచరించదు అని నిష్కర్ష. అభేదంలో కూడా కొంచెం భేదం ఉంటుంది అని కొందరంటారు. ఇక్కడ ఉన్న అభేదం మట్టుకు భేదాసంకలితాభేద మని ఊహించాలి. ఘటాన్ని చూడగానే ఘటబుద్ధి ఏవిధంగా కలుగుతుందో అట్లాగే రంగవ్యక్తిని చూడగానే రామబుద్ధి కలుగుతుంది. రాముడియందు కలిగేరామబుద్ధిలో భేదసంవలనం ఉటుందని ఎవరూ అనరు. ప్రకృతంలో కూడా అట్లాంటిబుద్ధి కలుగుతుం దని నిశ్చయం కలగజేసుకొని తృప్తి పడాలి.

నటుడిలో రత్యాద్యారోపమే చమత్కారహేతువు. ఈ ఆరోపం ఇతరారోపంతో సదృశం అనుకోరాదు. ఇది అలౌకికారోపము. కాబట్టే చర్వణీయం కాగలుగుతుంది. రసవ్యపదేశం పొందుతోంది. రామాదులందు అభ్యూహితమైనప్పుడు మాత్రం లౌకికం. ఆ లౌకికానికి ఇక్కడ ప్రసక్తి లేదు. నటగతంగా భాసించే అలౌకిక స్థాయిభావమే ఇక్కడ రసము. రస మనేది రామాది నాయకగతంగా భాసించుతుంది, అనిఅంటే కొందరు కొన్ని రకాలుగా ఆపత్తి ఇచ్చారు. వాళ్ళ అభిప్రాయాన్నికూడా పాఠకులు భావించాలి. ఒక కాముకుడు ఒకకమనీయ కామినీవ్యక్తిసంబంధం కలిగిఉన్నాడు అని అంటే ఎవరికీ రసాస్వాదం కలగదు. ఆ కామినీకాముకులలో అనుకూలమైన అనురాగభావం రసస్వభావం పొందింది అని భావకులకు ప్రతీతి మాత్రం కలుగుతుంది. కొందరకు ఆవ్యక్తులవిషయం తెలియగానే ఈర్ష్య కలగవచ్చు. కొందరు దుర్బలహృదయులు అక్కడకూడా అనురాగం పొందవచ్చు. కొందరు ద్వేషం చూపించవచ్చు. సత్పురుషశ్రోత్రియు లుంటే వాళ్ళకు జుగుప్స కూడా కలగవచ్చు. అంతేకాని ఎవరికీ

ఆస్వాదంమాత్రం కలగదు. ఆవిధంగానే రసం సీతారాములకు సంబంధించిందే అని అంటే, కేవలం రసప్రతీతిమాత్రం కలుగుతుంది. ఆరసాన్ని మనం ఏవిధంగానూ ఆస్వాదించలేము. రావణాదిప్రకృతు లెవరైనా ఉంటే వాళ్ళకు భిన్నభిన్నవిరుద్ధ భావాలు కలగటానికి అవకాశం ఉన్నది. అందువల్ల రసం రామాదిగతం అనటం భావ్యం కాదు, అని ఒకపూర్వపక్ష వాదము. దీనికి అంతకూ ఒకటేసమాధానం. ఈ లోల్లటమతంలో రసం అంటే లౌకికం కాదు, పరిమితమూ కాదు. ఇది లౌకికాలౌకికము, పరిమితాపరిమితము. హంతల ఐక్య భావం ఇందులో ఉన్నది. రాముడివిషయంలో లౌకికం కావచ్చు. నటారోపవిషయంలో అలౌకికం. రాముడి విషయంలో పరిమితస్వభావంతో కనిపించినా ఆరోపాంశంలో అపరిమిత స్వభావంతో సమున్మేషం పొందుతుంది. ఆరోపజ్ఞానంలో అహంత కుదించుకొన్నది. రాముడివిషయంలో ఇదంతాప్రకాశించినా నిలకడ పొందదు. ఆరోపజ్ఞానాంశంలో అది కలిసిపోయి ఆస్వాదం సంపాదించుతుంది. భగవత్పాదులు చెప్పిన ఇతరేతరాధ్యాసను కొంతవరకు ఇక్కడ సమన్వయించుకోవాలి. పైన చెప్పినఆపత్తి రసం కేవలం లౌకికస్వభావమే అనేపక్షంలో బాధించుతుంది. ఇది లౌకికాలౌకికము. అభినయనైపుణ్యం వల్ల నర్తకుడిలో భేదంతిరోహితమై పోతుంది. ఇట్లా భేదం కప్పుపడిపోగానే స్థాయి సమారోపితం అవుతుంది. ఈ నటవ్యక్తిలో విభావాదు లున్నవి. కాబట్టి స్థాయిభావాన్ని సమారోపం చెయ్యాలి అని భావకుడు బుద్ధిపూర్వకంగా ప్రవర్తించడు. మందాంధకారంలో వక్రదండం కనపడగానే ఆరోపితమిథ్యాసర్పమే బుద్ధిలో గోచరిస్తున్నట్లు, ప్రకృతంలో ఆరోపితజ్ఞానమే బుద్ధిసంవలితం అవుతుంది. ఇట్లా సమారోపితస్థాయి ప్రతీయమానం అవుతూ చమత్కారాన్ని ఆపాదించుతూ రసపదవీసమధిరోహణం చేస్తుంది.

“విభావానుభావ వ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః” అనే భరతసూత్రంలో పై అర్థాన్నే భావకులు గ్రహించాలి. స్థాయిభావానికి విభావాదిసంయోగం కలిగితే రసము నిష్పన్న మవుతుంది, అని సామాన్యంగా అర్థము. సూత్రంలో స్థాయిపదం లేదు. అయినా అర్థసౌందర్యాన్ని బట్టి స్థాయిపదాన్ని అక్కడ సంబంధింపచేసుకోవాలి. ఈమతంలో సంయోగనిష్పత్తి పదాలకు అర్థవిశేషం ఉన్నది. విభావాలకు స్థాయిభావానికి ఉన్నసంయోగము (సంబంధము) ఉత్పాద్యోత్పాదక భావరూపము. దీన్నే జన్యజనకభావ మనీ, కార్యకారణభావ మనీ అనవచ్చు. విభావాలు ఉత్పాదకాలు (జనకాలు, కారణాలు.) స్థాయి ఉత్పాద్యం (జన్యము - కార్యము.) అనుభావాలకు స్థాయికి ఉన్న

సంబంధము గమ్యగమకభావము. వ్యభిచారి భావాలకు స్థాయికి ఉన్నసంబంధము పోష్యపోషకభావం. ఈవిధంగా ఉన్న ఉత్పాద్యోత్పాదక భావ సంబంధము - గమ్యగమకభావసంబంధము - పోష్యపోషక భావసంబంధము అనేసంబంధ త్రయమువల్ల రసము జన్యమై గమ్యమై పుష్టమై గోచరిస్తుంది. రసము ఇట్లా మూడు విధాలుగా మొదట్లో భాసించినా తరువాత భావకప్రతీతిపథంలో భాసించగానే ఏకస్వభావం పొంది ఆనందమును సంపాదించేరసము అవుతుంది. శబ్దమువల్ల అర్థము గోచర మయ్యేటప్పుడు మధ్య అభిధావ్యాపారముకన్న వేరొక వ్యాపారం అక్కర లేదనీ, ఎంత అర్థాన్నైనా అదే సమర్పణం చేస్తుందనీ, ముఖ్యార్థంకంటె వేరొకఅర్థాన్ని అక్కడ కల్పనం చేయటం అసమంజస మనీ మీమాంసకులఅభిప్రాయం. రాముడుఅంటే రాముడు అనేఅర్థం. అంతేకాని రామత్వనిర్ముక్త కాముకుడు అని ఏవేవో అర్థాలు చెప్పటం భావ్యం కాదు. శాకుంతలంవల్ల శకుంతలా దుష్యంతుల అనురాగం ముఖ్యంగా గోచరించుతోంది. శిక్షాపాటవముఉన్న నటుడు సమర్థంగా దాన్ని అభినయించినపుడు స్వభావసౌందర్యానుగుణంగా అతనియందు రామబుద్ధికలగటం అసహజంకాదు. బాగా సముల్లాసం పొందినరసం ఆరంగవ్యక్తిలోనే గోచర మవుతుంది. దీన్ని గోచరం చేసుకునే సామాజకుడు ఆస్వాదించి ఆనందం పొందుతాడు. సామాజికాస్వాదంలో ఆరోపితత్వానారోపితత్వాలు భాసించవు. ఈవాదాన్ని అనవసరంగా పెంచి తంత్రాంతర ప్రావీణ్యం చూపించుతూ పాఠకసహృదయులను క్లేశపెట్టటం భావ్యంకాదు. దండి మొదలయిన ప్రాచీనాలంకారికులకుకూడా ఈలోల్లటవాదం సమ్మతంగానే ఉన్నట్లు మనం అనుకోవచ్చు.



2

# సంధ్యార్చన

ఆకు లేని మొండికొమ్మ
మూల్గుచుండె ఘూక మొకటి,
రక్తధార, ఎరుపుగాలి
డోలలో ప్రపంచ మూగె.

తారుమబ్బు చెరగులోకి
జారిపోయి సూర్యమూర్తి
విసరె జలాపాతమట్లు
ధగద్ధగత్ స్తంభరోచి.

హోరు మనుచు అంతరార్తిఁ
గడలి వేయిరొదల నరచె
కుదురులోకి కదలి 'సరుకు'
కదుపు బ్రిదుకుఁ గదపి కుదిపె.

కళోన్మత్తు అందె సొదల
నటస్వామి గొంతు రొదల
ఈదినాంత రక్తపూజ
కొంటి యెద కలంగిపోయె.

# మోహినీ!

ఒకమహోన్నత భావ
మెక నిత్యనవభావ
మెపుడు నాకనులముం
దెవుడు తాండవ మాడు
సుడిగాలిగా కళో
జ్వాల కీలిగా.

ఆహారి వలయాన
నిలిచి ఓ మోహినీ,
ఒకలేత నవ్వుతో
ఒకతేనె పాటతో
కదలిపోయే బొమలు
వణికిపోయే పెదవు

లహా జీవితమ్మును
తుడుచు చున్నాయీ;
నిలువు నిలువున వణి
కించు చున్నాయీ.

తెరవలేనే గొంతు,
పాడలేనే పాట;
ఈ ఆకలుల చూపు
లా పాట ? లీ వణుకు
లేనా కళార్చనలు?
నీడనా ఈ నేన
కవిని ? ఈస్థితి యేమి

*

*

చెట్టుబోదియ నాని నిలిచీ
లోయలోపలి లోతు చూచీ
పైకి వెలికేకన్ను లెత్తితి.

ఆడు అలకల నొత్తుకొనుచూ
ఎగయు కుచ్చెళ్ళదుముకొనుచూ
కొమ్మ నిలిచిన ఒక్కకన్యక
నవ్వు నవ్వింది.

రవ్వపలుకులవలెన జవ్వన
మాశలను తళతళల రువ్వెను,
తెగిన మంటలు జారినట్లే
అర్ధహాసము వేయి వేణవు
లూరసి పిలుపుల మొరసిపోయెను.

ఇంతకాలము నిండె నిలిచీ
తలపుసుడిలో కదిలిపోతిని
నెత్తురంటే వెరచు భువికే
లా గులాబీమంటముద్దులు !

రామచంద్ర అప్పారావు

# చెలీ!

"సంపత్"

నాహృదయమ్ము నానుకొని నాచెవిలో నదియేని తీయగా
న్నూహల బిచ్చలింప మధురోక్తుల బల్కుము నాయెడందలో
దోహదమంది మస్వములు తుందిల జీవితపాత్రి బొంగి మి
ధ్యాహిమవన్నగోన్నత నితంబములం బడి సంచరింపగన్

లలితములైనముగ్ధ మహిళాస్మిత కౌముదులందు దోచు ని
ర్మలసుఖలాలనామధురిమల్ కరుణార్ద్రిము లెందు చేడియల్
కలకలనవ్వినన్ పువులకారులు పొల్తురు పాలనవ్వులన్
జిలికినమీగడల్ కనుల జీరిన వెన్నెల లెంతయోగ్యముల్

ఈమృదుమాలతీలత వహించిన పూవుల నవ్వుపోలె నా
లో మధురోహాలేవో కదలున్ తుద కన్నియు రాలిపోవు నా
ప్రేమకు పాదుగట్టి మరలింపుము నీరము లింతలోన నీ
వే ముదువన్ దలిర్చి ప్రసవించును నాహృదయమ్ము నెచ్చెలీ!

ప్రిదిలిననీలవేణి సవరించెదు నీ యలవోకలో చెలీ
కదియుచు నప్పళించు నయగారపు కాంతుల కంజలింతు, చి
న్నది, కొమరారులేతది, మనమ్మున నాటున దొక్కనవ్వుతో
నుదిత మనోనురాగచయముల్ వెలిగింపుము ముస్కలాడెదన్

ఏహృదయమ్ము నాకొరకు నెత్తునొ తీయని జాలిచూపు లు
త్సాహతరంగముల్ మలచి శాంతిలుచున్నవి నాయెడంద నీ
వే హితమైన ఈహృదయవీణను మెల్లగ గూర్పవేని కా
తూహాల కౌముదీమసృణతోరణముల్ తెగిపోవునే చెలీ!

# మొదటి బహుమానం

(లేడీస్ కల్చర్ క్లబ్) 1938 - [illegible]

### చింతా దీక్షితులు

౧

ధనుర్మాసంలో రాత్రిమూడోజామున లేచి నగరసంకీర్తనం చేయవలసిం దని స్వాముల వారు సెలవిచ్చారు. తత్ పూర్వమే భోజ నాదికముకూడా ముగించవలసి ఉంటుంది సుమా అని మళ్లీ జ్ఞాపకం చేశారు.

దానిమీద రుచిపుట్టడంకోస మని యింకా కొన్ని విషయాలు సెల విచ్చారు. హిమా లయప్రాంతాల్లో ఉన్నవారంతా రాత్రి వేళ లేచి భోజనాదికం పూర్తిచేసుకొని వెచ్చనిఉన్నిబట్టలు వేసుకొని ఇంటిడాబాల మీది కెక్కి సూర్యోదయంకోసం నిరీక్షిస్తూ ఉంటారుట. సూర్యుని ఎర్రటి బింబం తూర్పున దృగ్గోచరము కావడం తోనే వా రెక్కడాలేనిఉత్సాహం పడ తారుట.

ఆప్రాంతాలవారే మరికొందరు శివరూపాలు ధరించి శంఖా లూదుతూ "శివోహాం" "శివోహాం" అని ఉచ్చైస్స్వరాలతో పలుకుతూ నగరసంకీర్తనం చేస్తారుట.

ఆవిధముగానే తెలుగువా రందరూ నగర సంకీర్తనం చేస్తే చూడవలె నని స్వాముల వారి కోరిక - కోరికలు జయించిన స్వాముల వారి కోరిక! ఆవిధంగా నైనా ప్రాచీన ధర్మం తలయెత్తుతుం దేమో నని వారిఆశ కాబోలు.

"పోనీ, ఎవరింట్లో వారు ఎవరిమట్టుకు వారు 'నగరసంకీర్తనం' చేసుకోకూడదా! ఈకాలంలో ఈప్రజలను కట్టుకురావడం సులభం కాదేమో". అన్నాను జంకుతూ. స్వాములవారి హృదయం విశాల మైనది. కాబట్టి ఆలాగ చేసినా మంచిదే నని వప్పుకున్నారు.

ఇంతకీ ఈ'నగరసంకీర్తనం'యొక్క పరమార్థ మేమి టన్నా రంటే——శివుడు విష్ణువును మేలుకొల్పాలిట: అనగా జ్ఞానశక్తి క్రియా శక్తిని మేలుకొల్పాలిట—— భర్త భార్యను మేలుకొల్పాలిట.

ఈచివరమాట విని నేను నవ్వాను. స్వాముల వారు నానవ్వుభావముగ్రహించి అన్నారు గదా - గార్హస్థ్యధర్మ మేమి టంటే, భర్త భార్యను మేల్కొల్పడమే; అంతే గాని భార్య ముందుగా లేచి భర్తకోసం కాఫీ కాచి కనిపెట్టుకు ఉండడం కాదు - నిద్రపోతూఉన్న భర్తను భార్య చూడ్డం తటస్థించిందంటే ఆవిడకు బ్రహ్మలోక

ప్రాప్తి అవుతుంది. ఈ రహస్యం ఇప్పటి గృహస్థులు మరిచిపోయారు.

ఇంకోవిషయంకూడా స్వాములవారు సెలవిచ్చారు. హిమాలయ ప్రాంతాల్లో యతులకు భిక్ష తెల్లవారకముందే పెడతారట. తెల్లవారిన తర్వాత సన్యాసులకు భిక్ష దుర్లభం. ఇది కాశ్మీరదేశంలో వారి అనుభవాన్ని బట్టి చెప్పినమాట.

భోజనాదికముతో దేహానికి తృప్తి కలిగించినతరువాత మనస్సుకుకూడా ఆహ్లాదం కలిగించడానికి డాబాలమీద చిన్నపిల్లలు చేరి సూర్యోదయం కోసం నిరీక్షించడం చాలాగొప్పవిషయం. శ్రీసూర్యనారాయణమూర్తి బింబదర్శనము మానవహృదయములోని సౌందర్యపిపాసను తృప్తిపరుస్తుంది. అంతే కాకుండా భక్తిని మొలకలెత్తిస్తుంది; జ్ఞానము నిస్తుంది.

స్వాములవారిమాటలు మనస్సులో పెట్టుకొని నేను మాయింట్లోనే 'నగరసంకీర్తనం' చేస్తే ఎంతబాగుంటుందో అని ఉబలాటపడ్డాను. శివరూపం ధరించడం—అంటే వంటినిండా విభూతి పూసుకొని రుద్రాక్షలు మెడలో వేసుకొని, త్రినేత్రానికి బదులు కుంకుంబొట్టు పెట్టుకొని — తోలుచీరలూ, శూలాయుధమూ, డమరుకమూ అక్కరలే దనుకొంటాను —శంఖం చేత్తో పుచ్చుకొని "శివోహం" అనుకొంటూ శంఖాన్ని పూరిస్తే ఎంతో బాగుంటుంది. కాని—

౨

కొన్ని నెలలకిందటనే మాఊళ్లో ఉన్న మహిళామణు లందరూ చేరి ఒకక్లబ్బు ఏర్పాటు చేసుకొన్నారు. స్త్రీల పురోభివృద్ధికోసం నిరంతరమూ పాటుబడుతున్న గవర్నమెంటు ఉన్నతోద్యోగస్థుల పట్టుదలా శ్రమా ఇందుకు కావలసినధనమును సంపాదించిపెట్టినవి. ఈధనముతో స్త్రీల క్లబ్బుకోసం భవనమూ, కూర్చోటానికి కుర్చీలు, బల్లలూ, ఇంట్లో ఆడుకొనేఆటల సరంజామా బయట ఆడుకొనే ఆటలకు కావలసిన పరికరాలు, వార్తాపత్రికలు ఇంగ్లీషు గ్రంథాలయబీరువాలు — అన్నీ ఏర్పాటు అయినవి.

ఇక సభ్యురాండ్ర సంగతి — పెద్దఉద్యోగస్థుల భార్యలూ, అధమపక్షం సైకిలైనా తొక్క గలిగినవాళ్ళూ, తత్తుల్యులైన యితరధనికుల భార్యలూ, ఇంట్లో పని పాటలు చేయవలసిన అవసరం లేనివాళ్ళూ ఇలాటి శ్రీమతు లందరూ నెలచందాలు చెల్లించి క్లబ్బులో చేరారు. ఇంగ్లీషు రాని వాళ్ళు సభ్యురాండ్రుగా ఉండకూడదనే నియమంలేదుగాని—అందులో చేరినవారికందరికీ ఇంగ్లీషు వచ్చును. ఇంగ్లీషు మాత్రమే వచ్చు నన్నా ఇబ్బంది లేదు. అందులో చాలామందికి తెలుగు మాత్ర

భాష కాబట్టి తెలుగు రాదని చెప్ప చెల్లదు గాని — అక్కడ, ఆక్లబ్బులో కృషికి కావలసిన పత్రికలు గాని, గ్రంథాదులు గాని లేవు. అంతేకాకుండా ఆ క్లబ్బులో తెలుగు మాట్లాడడం న్యూనతగా భావిస్తారు.

ముఖ్య నియమ మేమి టంటే అక్కడి సభ్యత్వం స్త్రీలకుమాత్రమే. పోతుటీగ లోపలికి పోవడానికి లేదు

అది "లేడీస్ కల్చర్ క్లబ్"-అంటే విజ్ఞానధనులైన మహిళామణుల సంఘ మన్న మాట. కల్చర్ అంటే బహుగ్రంథావలోకనము, లోకసంచారము, సజ్జనసాంగత్యాదులవల్ల కలిగే అంతఃకరణ సంస్కారము. ఈకల్చర్ ఈకాలంలో ఒక్కఇంగ్లీషు చదువుకొన్న స్త్రీపురుషులవద్దనే ఉన్నది. దీనిబాహ్యలక్షణాలు ఈనాటివి కొన్ని చెప్పవలసి వస్తే—టెన్నీసు ఆడడమూ, స్వెటర్లు వేసుకోవడమూ, సిగరెట్లు పీల్చడమూ, నిరంతరమూ ఇంగ్లీషులో సంభాషణ సాగించడమూ, చవకరకం యింగ్లీషు నవలలు పఠించడమూ, రోజురోజుకూ కొత్తకొత్త ఫాషన్ల ననుసరించి జుట్టు కట్టులను మార్చుకోవడమూ — చెప్పవలె. అంతర్లక్షణాలు, తన దేశానికి సంబంధించిన వేషభాషాదులను ఏవగించుకోవడము.

నిజము చెప్పవలసివస్తే అంగిరీజులపరిభుత్వం వల్ల మనకు దాపరించిన యితరమేళ్లతో పాటు ఈకల్చర్ ఒకటి.

అసలు చెప్ప దలుచుకొన్నవిషయం ఏమిటంటే —ఈక్లబ్బులో, నాభార్య సభ్యురా లైంది. యమ్మే ప్యాసైనయువతీవతంసమును భార్యగా చేకొనగలిగేభాగ్య మెందరికి పట్టుతుంది! మేముభయులమూ ఇంట్లో ఇంగ్లీషున మాట్లాడుకొంటూ, ఇంగ్లీషు దుస్తులు వేసుకొంటూ, ఇంగ్లీషుపత్రికలు చదువుకొంటూ, —ఇల్లు ఇల్లంతా కల్చర్మయము చేశాము కొన్నాళ్లు, పెళ్లయిన కొత్తలో. మాకు పుట్టేపిల్లలుకూడా పుట్టపుట్టడంతోనే ఇంగ్లీషు ఏడ్పు ఏడుస్తూ, ఇంగ్లీషునవ్వులు నవ్వుతూ కల్చర్తోనే పుడతారని అనుకొన్నాము; కాని వాళ్ళు చీమిడిముక్కులు వగైరాలతోనే తయారైనా రని చెప్పడానికి చాలా విచారంగా ఉన్నది. వాళ్ళని కాన్వెంటు స్కూలులో అప్పజెప్పాము. కొత్తలో రుచ్యంగా ఉన్న మాప్రణయము క్రమక్రమంగా వళ్ళు గడచినకొద్దీ వెలవెల్లాడడం మొదలుపెట్టింది. నేను ఒకమాస్టరు పూర్వాచారపరాయణుణ్ణి అయినాను. నాభార్యమాత్రం కల్చర్డులేడీగానే ఉండిపోయింది. అందువల్లనే క్లబ్బులో సభ్యురా లైనదికూడా.

ఇందువల్ల మాఉభయులకూ అన్యోన్యం చెడిం దని చెప్ప వీలులేదు కాని మతభేదం మాత్రం కలిగింది. నేను పూజలూ పురస్కారాలు చేస్తా నంటే నాభార్య మా యింట్లో టీపార్టీల కేర్పాటు చేస్తుంది. నేను గోడలకు దేవుళ్లవిగ్రహాలు తగిలిస్తే

అవి తీసివేసి చవకరకం అట్టబొమ్మలూ, సినీమా స్త్రీపురుష స్టార్లబొమ్మలూ ఆమె తగిలిస్తుంది. నేను పిల్లలకు బొట్టు పెడితే చెరిపివేసి సబ్బుతో వాళ్ళ మొహాలు కడిగి తెల్లనుద్దగుండ పూస్తుంది. లక్షణంగా మొహానికి పసుపు రాచుకో మ్మని ఒక మాటు నేను చెప్పినప్పుడు మాయిద్దరికి విరోపామహాసంగ్రామ మంతపని జరిగింది. ఫేసుపౌడరు బదులు తనూ పిల్లలూ స్వచ్ఛమైన ఐశ్వర్యప్రదమైన విభూతి పూసుకో రాదా అని ఒకనాడు హాస్యానికి నే ననే సరికి నాకు రెండురోజులు ఇంట్లో భోజనం దుర్లభం అయింది.

ఇలాటి నాభార్యకు ఒకనాడు హఠాత్తుగా నామీదా, నాపూర్వాచార పరాయణ త్వముమీదా అభిమానం క లి గిం ది. కారణం ఎంత ఆలోచించినా తెలియలేదు. కొంతవయస్సు దాటిన తరువాత బుద్ధి పరిణతమై మంచిమార్గములు పట్టవచ్చు గదా? నాభార్యకు అలాటి మార్పు కలిగి ఉండవచ్చు ననుకొన్నాను.

స్వాములవారు సెలవిచ్చిన ప్రకారం నగరసంకీర్తనం జరపడానికి నిశ్చయించు కొన్నట్లు నాభార్యతో చెప్పాను. నేను శివరూపం ధరించి, శంఖము ఊదుతూ, శివోహం అంటూ, ఇంట్లో నగరసంకీర్తనం చేయదలిచాను కాబట్టి, తాను నాసహధర్మచారిణి కాబట్టి, నాతోపాటు తానున్నూ పార్వతీరూపం ధరించవలసిందని కోరాను.

ఆమాట అనడంతోనే నాభార్యకు కోపం వచ్చింది. తా నెప్పుడూ అటువంటివేషాలు వేసి ఎరగ ననీ--సకృత్తుగా క్లబ్బులో నాటకంవేషాలువేసేది కాని, ఆసమయంలో అది జ్ఞాపకం చేస్తే దెప్పిపొడిచానని అంటుం దని ఊరుకొన్నాను— తనను తృణీకరించడము న్యాయము కాదనీ తనతల్లిదండ్రు లీమాట విన్నట్లయితే ఇట్టి అల్లుడువంటిదుర్యోగము తమకు ప్రాప్తించినందుకు విచారిస్తారనీ, ఏమేమో చెప్పింది.

పార్వతివేషం వేయడ మంటే విభూతి పూసుకో నక్కరలే దన్నాను; కొంచెం పసుపు మొహానికి రాచుకొంటే చాలు నన్నాను; కుంకుంబొట్టు పెట్టుకుంటే బాగుంటుందన్నాను - అంటూంటే భయపడ్డట్టు నటిస్తూ, అమ్మో పాములుకూడా మెళ్లో వేసుకో మంటారు కాబోలు నంది. కుంకుంబొట్టు పెట్టుకోవడం పాముల్ని మెళ్లో వేసుకోవడంతో సమానంగా భావించినందుకు విచారించాను. పాములు నేనూ వేసుకోను, నువ్వూ వేసుకో నక్కరలే దన్నాను.

పోనీ రబ్బరుపాములు తెచ్చిపెడుదునా అంది.

నాకు కోపంవచ్చింది. పెడమొహం పెట్టాను. నాకోపం చల్లార్చడాని కన్నట్లు తాను పార్వతివేషం వెయ్యడానికి వప్పుకొంది.

వప్పుకొన్నరోజు మొదలుకొని నన్ను వేధించడం మొదలెట్టింది. ఏచీర కట్టుకుంటే

బాగుంటుందనీ, చేతులూ మెడా లేని రవి కలు తొడుక్కోవచ్చునా అనీ, తల్లో సూదులు పెట్టుకోవచ్చునా అనీ, జడ వేసుకొంటే బాగుంటుందా, ముడివేసుకొంటే బాగుంటుందా అనీ, జోళ్ళు తొడుక్కోవచ్చునా అనీ—ఈ విధంగా! అయినా ఎంతో ఉత్సాహంగా పార్వతీవేషం వెయ్యడానికి ఉబలాటపడుతున్నట్టుగా కనిపించింది. రవివర్మ వ్రాసిన పార్వతిబొమ్మ చూపి అటువంటివేషం వేసుకోరాదా అంటే కొంత సందేహించి, అనాగరిక మంటూ సణుగుకొని కొంతసేపటికి వప్పుకుంది.

ఆమె నామతములోనికి దిగినందుకూ, పార్వతి వేషం వేయడానికి సమ్మతించినందుకూ ఎంతో సంతోషించాను. నిజంగా నాభార్య కల్‌చర్డు లేడీ అని అప్పుడు విశ్వసించాను.

## 3

ధనుర్మాసంలో ఒకనాడు తెల్లవారకుండా లేచి చన్నీళ్లస్నానం చేశాను. తుడుచుకొని వంటినిండా విభూతి పూసుకొన్నాను. భార్య నాకోస మని తెచ్చినపెద్దపులి బగ్గేలబట్ట కట్టుకొన్నాను. నొసట కుంకుంబొట్టు పెట్టుకొన్నాను. గదిలో పీట వేసుకొని కూచోబోతూంటే ఆమె వచ్చింది. నాజుట్టు పైకి ఎగదీసి ముడివేసింది. దానిలో డాకురేకు చంద్రుణ్ణి దోపింది. వద్దు మొర్రో అంటూంటే వినక రెండుచేతులకీ రెండురబ్బరు పాముల్ని కట్టిపెట్టింది దారంతో. ఎక్కడ సంపాదించిందో ఎముకలహారం ఒకటి నామెల్లో వేసింది. బుడబుడక్కలవాడిదగ్గర తాను కొన్న డమరుకము నావేళ్ళకు కట్టింది. ఎక్కడ సంపాదించిందో పులిచర్మం తీసుకువచ్చి పీటమీద వేసి దానిమీద కూర్చో మంది. పక్కనే శంఖం పెట్టి ఉండుండి ఊద మంది.

రబ్బరుపాములూ, ఎముకలపేర్లూ నాకక్కర లేదని దెబ్బలాడాను. రుద్రాక్షమాల వేసుకోని మ్మన్నాను. విన్నది కాదు. కోపం వచ్చి తీసివేయబోయాను. అప్పుడు నవ్వుతూ నాదగ్గిరకి వచ్చి చెక్కిళ్ళు దువ్వి పెదవులమీద ముద్దుపెట్టుకొంది. వెంటనే పక్కగదిలోకి వెళ్ళి చేతులూ ముఖం పెదవులూ సబ్బుతో కడుక్కోవడం నేను కని పెట్టాను. గదిలోనుంచి తిరిగివచ్చి పెట్రొమాక్సులైటు నా కెదురుగా కట్టింది - కాంతి పూర్తిగా నామీద పడేలాగ.

నాకు అంత వినయంగా ఉత్సాహంతో సహాయం చేసినందుకున్నూ, నన్ను ముద్దు పెట్టుకొన్నందుకున్నూ నే నెంతో ఆనందం చెందాను. త్వరగా పార్వతివేషం వేసుకుర మ్మన్నాను.

ఆమె నా కెదురుగా నిలబడి నిదానించి చూచి మెచ్చుకొన్నట్లు తలతిప్పి నవ్వుతూ ఏదీ శంఖం ఊదం డంది. నేను శివోహం

శివోహం అని కేకవేసి శంఖం వూదాను. ఆమె చప్పట్లు కొట్టి, బాగు, స్ప్లెండిడ్, కాపిటల్ అంది.

పార్వతివేషం వేసుకొని వస్తానని చెప్పి, పచ్చచీర కట్టుకొంటే బాగుండదా అని సలహా అడిగి ఏదో బహుమానం సంగతి గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

"నగరసంకీర్తనం" ప్రారంభించా నన్న మాటే! భార్యకూడా చప్పున వేషం వేసుకు వస్తే ఇద్దరమూ కూర్చుని నగరసంకీర్తనం ప్రశస్తంగా చేయవచ్చు ననుకొన్నాను. అరగం టయింది.

ఆమె రాలేదు. స్నానం చెయ్యాలి, పసుపు రాసుకోవాలి, చీర ధరించాలి, ఆభరణాలు పెట్టుకోవాలి, తల్లో పువ్వులు పెట్టుకోవాలి—ఏ వేవో గొడవ లన్నీ యీ ఆడాళ్ళకి. ఆమెను తొందరచెయ్యడాని కని శివోహం గట్టిగా ఉచ్చరిస్తూ, ఉండుండి శంఖం ఊదడం మొదలుపెట్టాను. గంట యింది నాభార్య రాలేదు. ఎంత చదువుకొన్నా, ఎంత కల్చరున్నా యీఆడవాళ్లు ఆడవాళ్లే - కాసంత పార్వతివేషం వేసుకు రావడానికే ఇంతాలస్యమా? —మళ్లీ నా భార్యను పిలవడానికని శివోహం అనిగట్టిగా కేకవేసి శంఖం ఊదుతున్నాను. పూర్తి కాకముందే ప్రవేశించింది ఆమె! నే నాశ్చర్యపడ్డాను. నాభార్య వేషం వేసుకో లేదు. గంట దాటినా వేషం వేసుకో లేరింది గాదా అని అడగబోతూంటే ఒకరివెనుక ఒకరు అయిదుగురు ఆడవాళ్లు నాగదిలో ప్రవేశించారు. నాకు సిగ్గేసింది. నాకంటె వాళ్లుఎక్కువసిగ్గుపడుతూన్నట్లుచూచాను. అయిదుగురూ నాకేసి పరకాయించి చూచారు. "దీని పే రేమిటి" అన్న ది ఒకామె. ఈవిడికి నేను కనిపించడం లేదు కాబోలు — "దీని" అని అమహత్తు ప్రయోగిస్తోం దేమిటి చెప్మా, ఇది కల్చరు లక్షణమా అనుకొన్నాను. నాభార్య "ఇది శివరూపం. ఈయన నాప్రియభర్త అని మీతో చెప్పడానికి నా కెంతో సంతోషంగా ఉన్నది" అన్నది యింగ్లీషులో.

ఆ సాధ్వీమణులు అయిదుగురూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. నాదగ్గిరికి కొద్ది కొద్దిగా వచ్చి పరీక్ష మొదలుపెట్టారు. దీపకాంతిలో తళతళా మెరిసిపోయే డాకు రేకుచంద్రుణ్ణి చూచి మెచ్చుకొన్నారు. వంటినిండా ఉన్న విభూతిని ఫేసుపౌడ రేమో నని అనుమానించి నన్నవమానపరిచారు. మెళ్లో ఎముకలపేరు చూచి భయపడి వెనక్కు ఉలిక్కిపడి వెళ్లారు. "హారిడ్" అని ఒకఇల్లాలు మూర్ఛపోయేటంతపని చేసింది. దగ్గిరికి రాకుండా దూరాన్నించే నాచేతుల నున్న పాముల్ని చూచి పారిపోబోకు, రబ్బరుపాములే నని నాభార్య చెప్పితే పూర్తిగా నమ్మక, నిజము తెలుసుకొనే ఉద్దేశంతో ఒకయిల్లాలు గొడుగుతో నాజబ్బమీద పాముకింద

పాడిచింది. లేచి వాళ్ళను తరిమివేద్దామా అన్నంతకోపం వచ్చింది గాని నాభార్య నవ్వుముఖం, నాకేసి తిరిగి గాలిలో నన్ను ముద్దెట్టుకొంటూన్నట్లు అభినయించే నా భార్యానవ్వుముఖం, చూచి ఊరుకొన్నాను. "ఇది-ఈ - ఈ - మనిషి.. క్షమించండి- ఈయన మీభర్తా!" అని ఒకావిడ నా భార్యను సానుభూతితో అడిగింది. అయిదు గురు శ్రీమతులూ నాభార్య దౌర్భాగ్యా నికి జాలి చూపుతూ నిలబడిపోయినారు. నాభార్య మాత్రం సగర్వంగా నవ్వుతూ నిలబడింది. ఇంక పాకం ముదరనిస్తే ఈ విధంగానే నన్ను అవమానపరుస్తారని నిశ్చ యించుకొని ఎలాగ వీళ్ళని తరుముడమా అని ఆలోచించి, ఒక్కమాటు ఆవేశపూర్వ కంగా డమరుకం వాయించి, "శివోహం" "శివోహం" అని కేకవేసి, శంఖం—వెనక భీముడు కురుక్షేత్ర యుద్ధరంగంలో ఊది నట్లు —ఊదాను. శంఖం ఊదితే శత్రు రాజులస్త్రీలకు— ముఖ్యంగా గర్భిణులకు ప్రమాదం సంభవించేదిట పూర్వం. ఊద డంతోనే అయిదుగురూ చెల్లాచెదరై పో యారు. దరిమిలాను వాళ్ళ కేమయినా ప్రమాదం కలిగిందేమో తెలియలేదు. నాభార్య వాళ్ళవెంట వెళ్ళిపోయింది.

పదినిముషాలకి దూరాన్నించి ఒకమోటా రుకారు మొరిగి పారిపోతూన్నచప్పుడు వినిపించింది. నాభార్య యింట్లో ఉన్న దేమో నని చూచాను. లేదు. వాళ్ళతో తానూ కారెక్కి వెళ్ళిపోయింది.

ఇదంతా నాకర్థంకాలేదు. పార్వతీవేషం వేసుకొని నాభార్యను రమ్మని పంపితే ఈఅయిదుగురుస్త్రీలనీ ఎందుకు తీసుకువచ్చి నట్లు? పురుషుడని సందేహం లేకుండా వాళ్ళంతా నన్నలాగ పరీక్షచెయ్యడ మేమిటి? నాభార్య వాళ్ళతో కారెక్కి లేచి పోవడ మేమిటి? భక్తిశ్రద్ధలతో చేయవల సిన "నగరసంకీర్తనం" ఈవిధంగా పరిణ మించింది.

స్వాములవారితో నానగరసంకీర్తన చరిత్ర ఏముఖం పెట్టుకొని చెప్పగలను?

నాభార్య యింటికివచ్చాక ఏమి చెప్తు తుందో అడిగి తీరుతాను. తప్పకుండా న న్నవమానపరచడానికే ఈవిధంగా కుట్ర పన్నిఉంటుంది. దీనికిశిక్ష ఏమిటా అనిఆలో చన మొదలుపెట్టాను. అక్కసుతో నిండిన నామనస్సు అనేకఉపాయాలు చెప్పింది. ఇంటికి వచ్చాక నాభార్యపీక నులిమివెయ్య వచ్చు; లేదా ఇంట్లో దూలానికి ఉరితియ్య వచ్చు; లేదా ఒకగదిలో తాళంవేసి తిండి పెట్టకుండా మాడ్చివేయవచ్చు — ఇంకా ఎన్నెన్నో ఊహాలు తోచాయి.

## ౪

కొన్నిగంటలైనతర్వాత నాభార్య యింటికి వచ్చింది. నేను వేషం మార్చివేసి మా మూలుబట్టలు కట్టుకొని కూర్చున్నాను.

వచ్చీరావడంతోనే ఆమె నన్ను కౌగలించుకొని ఊపిరి సలపకుండా ముద్దెట్టుకోవడం మొదలుపెట్టింది; ఇంగ్లీషున నన్ను లాలించడం మొదలు పెట్టింది. తనకంటి పాపనట నేను—నేను పీచ్ అనేపండునట—తన ప్రియ మైనభర్తనట—తన మొహం మీద మొటిమనట—తనడార్లింగునట—తనచీరనట—తన రవికనట—ప్రతీమాట మధ్యనీ నామీసాలు లాగుతూ నా పెదవుల మీద ముద్దుపెట్టుకొనేది.

నాభార్యకు మతిపోయిందేమో నను కొన్నాను—హిస్టీరియా లక్షణాలు సంక్రమించాయేమో నని సందేహించాను—కాని అవేమీ కావు. తనకి పట్టరానంత సంతోషం నావల్ల కలిగిందట. క్లబ్బులో తన కగ్రస్థానం నావల్ల లభించిందట—నావల్ల తన కేదో బహుమానం వచ్చిందట...

స్వభార్య యీవిధంగా భర్తయెడల ప్రవర్తిస్తూంటే—ఎంత ఉరిటీయ దలుచుకొన్నా భర్త అన్నవాడు భార్యపట్ల సుముఖుడు గాక మానతాడా? నేను సుముఖుడను అవడానికి అభ్యంతరం ఏమిటి? సుముఖుణ్ణి అయ్యాను. అవడానికి ఇంకో కారణం ఉంది. అదిఏమిటంటే-ఆమె నన్ను లాలించిలాలించి, పైట సవరించుకొంటూ బయటికి వెళ్ళి పక్కగదిలో తాను వచ్చేటప్పుడు తీసుకొని వచ్చి దాచిపెట్టిన అట్టపెట్టెలు నాలుగు, రెండుచేతులతో పట్టుకు ప్రవేశించి వాటిని బల్లమీద పెట్టింది. అవి తనకూ నాకూ వచ్చిన బహుమానాలట. వాసన నూనె, పౌడరూ, అత్తరువూ, దువ్వెనా మొదలైన వస్తువు లున్న తళతళా మెరిసిపోయే "టాయిలెట్ సెట్టు" తనకు వచ్చిన బహుమానమట.

క్షవరానికి పనికివచ్చే "షేవింగ్ సెట్టు" నాకు వచ్చిన బహుమానమట.

పైటకు గుచ్చుకొనే నగిషీ బంగారు "బ్రూచి" తనకువచ్చిన బహుమానమట. అయిదుఅంగుళముల ఎత్తుగల వెండి నట రాజవిగ్రహం నాకు వచ్చిన బహుమానమట.

షేవింగుసెట్టును చూస్తే వళ్లుమండినా నటరాజవిగ్రహాన్ని చూచి పరవశుడనై బంగారు "బ్రూచి" తీసి నాభార్యపైటకు గుచ్చి నాఆనందాన్ని వెలిబుచ్చాను.

ఇంతకీ ఈబహుమానా లేమిటి? ఎందుకు? తను క్లబ్బులో మెంబరు కాబట్టిబహుమానాలు పొందవచ్చును గానిఏమీ సంబంధం లేని నా కెందు కీబహుమానాలు? ఇదంతా ఏదోకుట్ర అనుకొని నాభార్యను సమాధానం చెప్పమన్నాను. మా యింటి కాస్త్రీలు ఎందుకు వచ్చారో చెప్పమన్నాను.

వచ్చినబహుమానాలు పుచ్చుకొని ఊరుకోక ఎందు కీ కుశ్శంకలు అని నన్ను మభ్యపెట్టడానికి ప్రయత్నించింది నాభార్య. నేను

సాగనియ్యలేదు. చెప్పితే కోప్పడ నని మాటయిస్తే చెప్పుతా నంది. నేను వాగ్దానం చెయ్యానన్నాను. నటరాజవిగ్రహం ఎంతబాగుందో చూడండి అంది. సమాధానం చెప్పితీరా లన్నాను. మీరే కాదు, మీబోటివాళ్లు చాలామంది ఉన్నా రంది. వాళ్లకు బహుమానాలు రాలే దంది. అనుమాన మెక్కువై సమాధానం చెప్పితీరా లన్నాను.

ఆమె చివరికి చెప్పినసంగతులు:

ఒకనాడు లేడీస్ కల్చర్ క్లబ్బులో సభ్యురాండ్రంతా సభ జరిపారు. వినోదంగా కాలక్షేపం చెయ్యడమే క్లబ్బుయొక్క ఆశయము. ఈసభ కూడా వినోదార్థమే. కొన్ని విషయాలు చర్చించుకొన్న మీదట వినోద విషయం చర్చకు వచ్చింది. ప్రతిసంవత్సరము సభ్యురాండ్రలో ఒక్కరికి ఇచ్చే బహుమానం ఈయేడు ఏవిధంగా ఇయ్యడమని చర్చించారు.

పరుగులపందెములు పెట్టితే బాగుంటుందన్నారు కొందరు. ఈతపందెం మంచిదన్నారు కొందరు. ఎవరు అందరి కన్నా అందమైనడ్రెస్సు వేసుకొంటారో వారి కా బహుమానం ఇయ్యకూడదా అంది ఒక యింగ్లండు వెళ్ళివచ్చినస్త్రీ, సిగిరెట్టు కాలుస్తూ. డబ్బుసర్దుబాటుకాని సభ్యురాండ్రు పనికిరాదన్నారు.

జడల కని కొందరు, ముడుల కని కొందరు, ఆభరణాల కని కొందరు పారితోషిక మివ్వవచ్చు నని పరిపరివిధాల చెప్పారు. పోనీ సంతానాన్నిబట్టి యివ్వకూడదా అని పక్కఆమెతో అంది ఒకబహుసంతానవతి. ఈవిధంగాచర్చజరుగుతూఉండగా ఒకావిడ ఒకప్రొపోజల్ చేసిందట. (ఆవిడపేరు నా భార్య చెప్పలేదు. నాభార్యయేమో నని నాఅనుమానం). ఆమాట వినడంతోనే అందరూ నిర్వాక్కులైనారు. కొంతసేపటికి అం[illegible] తేరుకొన్నారు. బహుసంతానవతి వినాగా అందరూ ప్రొపోజల్ బాగుందంటేబాగుందన్నారు. ఏకగ్రీవంగా అంగీకరించారు.

మగాడికివలెనే ఆడదానికికూడా వ్యక్తిస్వాతంత్ర్యం వుండాలి. ఇంతవరకూ మగవాడు ఆడదాన్ని బానిసగా చూస్తున్నాడు. ఇప్పుడు మగవాడికి బుద్ధి చెప్పవలసిన బాధ్యత ఆడదానిమీద వుంది. ఈబుద్ధి చెప్పడం అనేకవిధాల చెయ్యవచ్చును. కొట్టిగాని, తిట్టిగాని, సాధించిగాని, ఏడ్పించిగాని, తిండి పెట్టకగాని, చాకిరీ చేయించుకొనిగాని, కూడా తిప్పుకునిగాని— ఏవిధంగానైనా చెయ్యవచ్చును. ఆనాడు ఆసభలో నిర్ణయము చేసినవిషయము ఏమి టంటే ఇష్టమున్నసభ్యురాండ్రందరూ తమతమ భర్తల్ని దద్దమ్మలను (ఫూల్సును) చెయ్యడానికిప్రయత్నించాలి. ఎవరు ఈవిషయంలో ఎక్కువనేర్పు చూపుతారో వారికి ఈయేటి బహుమానం. ఈబహుమానానికి అర్హత భార్యాభర్త లిద్దరికీ ఉంటుందిగాబట్టి ఈ

యేటి బహుమానం భార్యాభర్త లిద్దరికీ ఉపయోగించేవిధంగా ఉండడానికి తీర్మా నించారు.

తీర్మాన మైనతరువాత సభ్యురాండ్రిలో అయిదుగురిని నిర్ణాయకురాండ్రుగా ఉండ డానికి నిర్ణయించారు. వీరు ప్రతిసభ్యురాలి యింటికీ వెళ్లడమూ, ఆమెభర్తను చూడ డమూ,ఏవిధంగా అతడు ఫూలుఅయ్యాడో గ్రహించడము, చివరకు బహుమాన మెవరి కిచ్చేదీ నిర్ణయించడము. వారము రోజులు సభ్యురాండ్రకు తీరిక లేదు. అందరూ ఆలోచనల్లో మునిగారు. అనేక సంఘటన లాలోచించారు. ఎవరిమట్టుకు వారే తమరహస్యాన్ని ఇతరులకు చెప్ప కుండా గుట్టుగా పెట్టుకొన్నారు. గడువు నాటికి అందరూ సిద్ధంగా వున్నారు. నిర్ణా యకురాం!డు అందరినీ చూచివచ్చి బహు మానం నాభార్య కివ్వడానికి నిశ్చయిం చారు.

నాకు కోపం మండిపోతోంది. నాతోపాటు చాలామంది దురదృష్టవంతు లున్నారు గదా అని కోపము దిగమింగాను. మిగిలిన వాళ్లు తమభర్తలను ఏవిధంగా చేశా రని నాభార్య నడిగాను.

ఎప్పుడూ దొరలడ్రెస్సు వేసుకొనే ఒక ఉద్యోగస్థుడిచే పంచ కట్టించింది ఒకావిడ బలవంతాన.

ఇంకోఆవిడ తాను నవల చదువుకొంటూ సిగరెట్టుకాలుస్తూ కూర్చుని తనభర్తచేత వంటయింట్లో కాఫీ పెట్టిస్తోంది.

ఇంకోఆవిడ తనభర్తను ఏదో మభ్యపెట్టి, అతనికి చీరకట్టి, రవిక తొడిగి, గాజులుపెట్టి ఆడవేషం వేయించింది. తాను ఇజారు తొడిగి, చొక్కా వేసుకొని మొగవేషం వేసింది. ఇద్దరూకూర్చుని మాట్లాడుకుం టుండగా జడ్జీలు వెళ్ళారుట.

"వాళ్ళ కెందు కిచ్చారు కారూ బహు మానం?" అన్నాను. "ఇవ్వవలసిందే. కాని ఆడవేషం వేసిన ఆమగపురుషుడు పరాయి స్త్రీలు వచ్చారని మండిపడి వాళ్లను కొట్టే టంతపని చేశాడు. భార్యాభర్త లిద్దరికీ ఆరోజునుంచీ విరోధం. జడ్జీలు పారిపోయి వాళ్లకు బహుమానం లేకుండా చేశారు.

ఇంకోయిల్లాలు అటకమీాది కెక్కి కొ_స్త ఆవకాయకుండ దింపమని చెప్పి తడిలం గోస్త్రం కట్టించి, భర్త తీరా అటక ఎక్కాక నిచ్చెన తీసివేసి జడ్జీలు వచ్చేదాకా ధుమ ధుమలాడుతూ చెందుకొంటూ ఉండేలాగ చేసింది.

నాకు ఈఆడవాళ్లచేష్టలు వింటూన్నకొద్దీ అరికాలుమంట నెత్తి కెక్కింది. ఇక చాల్లే అని నాభార్యను దండించడానికి మొదలు పెట్టాను.

"నాతప్పే ముంది ఇందులో? మీారే ఈవేషం వేస్తా నన్నారుగదూ! చచ్చిచెడి మీాకోసం డమరుకం, చంద్రుడూ, పాము

లూ, హారాలూ తెచ్చిపెట్టి నందుకా ఈఆగ్రహం! మొగాళ్లకి కృతజ్ఞత అంటూ ఉండదు కాబోలు! మీకు సహాయం చేసి నందుకేనా యింత చేస్తున్నారు? మిమ్మల్ని నేను శివవేషం వెయ్యమన్నానా? మిమ్మల్ని అటక ఎక్కించి నిచ్చెన తీశానా? మీచేత చీర కట్టించి, రవిక తొడిగించానా? వాళ్లే నయం పాపం, భార్యలేమి చేసినా కిక్కురు మనకుండా ఊరుకొంటారు ఇంతకీ మీరు వేషం వేసుకోవడ మేమిటి? తప్పునామీద పెట్టడ మేమిటి!"

"మరి వాళ్లని — ఆ — ఆ — పశు —— గయ్యా............ఆస్త్రీలను ఎందుకు మనింటికి తీసుకొచ్చావు?" అన్నాను పళ్లు గొరుకుతూ. "తీసుకువచ్చా కాబట్టే బహుమానం వచ్చింది. లేకపోతే మీవేషాలు చూచి మీమొహాలు చూచి సంతోషించేవా ళ్లెవళ్లూ? చాల్లెండి! నాతో మాట్లాడకండి" అని నాభార్య విసిరికొడుతూ లేచి పోయింది -నన్ను కృతఘ్ను డని నిందిస్తూ.

నిజమే! తప్పు నాభార్య దెలా గవుతుంది ? నన్ను ఈరూపం ధరించ మన్నవాళ్ల దవుతుంది తప్పు. అవును ఆస్వాములవారే యిందుకు కారణం.

* *

కొన్నాళ్లకు స్వాములవారిదర్శనలాభం కలిగింది. నమస్కరించాను.

"చేశావా నగరసంకీర్తనం" అన్నారు స్వామి.

"చిత్తం. సద్యఃఫలం కూడా కలిగింది" అన్నాను. "నేను చెప్పలేదూ!" అన్నారు స్వాములవారు — ఆసద్యఃఫల మేమిటో అడక్కుండా.

# ఆ సంజ

బొడ్డు బాపిరాజు

పాయలు పాయలై ప్రిదలివడ్డ పయోదవినీలకైశిక
చ్ఛాయల మీదుగా నొదిగి జారెడి సంజమెరుంగు వ్రేల్మిడిన్
దాయగజూచు నోపడుచుదాన! యెదం బదిలమ్ము సేసి యే
తీయనివేళనో స్మృతి గదింతు నొకానొక గీతికీహాయల్

మంచున మాగియున్న వరిమళ్ళ పిసాళవు తావి తెమ్మెరల్
ముంచెడి సంజలో జనుపపువ్వులు బంగరు మువ్వలై గుబా
ళించగ కోసి కొప్పుసవరించి తనంతన గొంతులోన గుం
ఫించెడి పాటతో వయసుపిల్ల! సుతారము చూపుచుంటివే!

కను నవరంజిసంజ మెరుగారు విహాయసవీధి నల్లన
ల్లన జను నీలమబ్బు శకలమ్ము తెరంగును, నిండుపూలతో
గొనబుల నీను చేని నలుకోన పచారులు సేయు నీ వసం
దును, నొకదానితో నొకటి తూగు బెడంగును రెండు కన్నులున్

మరవునకురాని ఆసంజమెరుగు, సంజ
మెరుగునకుగూడ మెరుగు నీమేని యారగు,
కన్ను లాప్రొద్దులనె గీనుకొన్న వెడద
తళుకు తడియారనట్టి రంగులను గలిపి

# వసంతం

శివరామం

పసిపసిడిప్రొద్దు పెదవిపై ముసరె గాలి,
కన్నెకోయిల గొంతులో కదలె పాట,
పడుచుమల్లె గుండెనుండి ప్రాకె తావి,
తెలుగురాణి కొల్వుకు వచ్చి నిలిచినంత.

కారుమబ్బులే లేవు, చీకటులె కావు,
చలు లడచబోవు, ఏ చెడ్డకలలు రావు,
వేడివేడిగా వెలు గెదో విరిసినంత,
తెలుగురాణి బంగరుగద్దె నిలిచినంత.

చివురుచివురులై పులకరించినది మోడు,
ననలుననలుతో చిరుత నవ్వినది తీవ,
తేంట్లుతేంట్లుగా గొంతు నెత్తినది రెమ్మ,
తెలుగురాణి చల్లనిచూపు నిలిచినంత.

లేదు మ్రాని కాకులపాటు, లేదు తీగ
కడదుపాటు, మొగ్గకు లేదు విడనిపాటు,
క్రొత్తగా ఏదొ శక్తి రేకెత్తి నంత,
తెలుగురాణి రాచరికమ్ము నిలిచినంత.

# అంజలి

## వెనుమూర్తి వెంకటరత్నము

ఇటు లోకదానివెంబడి లయించెడు నింకొకరోజు కాలసం
ఘటనల మంచిచెడ్డలవికారత నెప్పుడువోలెనే తమం
తటు తము వచ్చి జీవులకథాగమనంబులు మార్చిపోవు, నె
ప్పటికి లభించునో వికలభావములేనిప్రశాంతి నాయెదన్!

జీవన మెల్ల తృష్ణవిరచించిననాటక మయ్యె నాకు, మో
హావృతమైన యీబ్రతుకు నందియు నే నని సంచరించునీ
జీవుడు కాలపుంగతి నశించెడు నన్నతలం పొకండె వా
పోవగ జేయు నన్ను తలపోయను సృష్టినిజప్రకారముల్.

నాచెలికాడు, ఆశలు పెనంగిన లేతయెడందవాడు, స్మే
రోచితమందమందమధురోక్తులు, ఏ మయినాడొ? యేయపూ
ర్వాచలసానువుల్ వెదకులాడిన కానగరాడు, కాలవు
న్వీచుల నంతరించె విధి వ్రేసినవాగురచే నిబద్ధుడై.

ఓ యమృతస్వరూపకరుణోదధి! చంచలుడైననా కుపా
ధ్యాయుడవై మృతిన్ వలపులాడిగ గోరుబలమ్ము నిమ్ము! జీ
వాయతనమ్ములో పిఱికినై గతికానని దుస్తిరాశలన్
నాయనుభూతజీవికకు నాశన మయ్యె సుఖాంశురేణువుల్.

# వేదులవారి దీపావళి

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి**

నవ్యసాహిత్య సంసార ప్రసక్తిలో వేలు మడచి లెక్కపెట్టవలసివస్తే, చట్టున సుబ్బారాయత్రియం, సత్యనారాయణ ద్వయం, కృష్ణద్వయం, ఇతి శ్రీ శ్రీ గా, సాహిత్య స్పృహయాళువు ప్రతివాడున్ను లెక్కపెడతాడు.

ఆ శ్రేణిలో ఒకరగు వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు తామప్పుడప్పుడు వ్రాసిన ఖండకావ్యాలనన్నిటిని చేర్చి దీపావళియను సంపుటముగా ప్రకటించి వారికావ్యకలాపాన్ని ఏకత్ర చూడముచ్చటపడేవారికోరిక తీర్చేరు.

తక్కిన గుణదోషవిచారణ అట్లావుంచితే సాహితీసమితి తెనుగుసారస్వతమునకు కొత్త బలమూ కొత్తకాంతీ ఇచ్చినమాటనిజము. సత్యనారాయణశాస్త్రిగారు సాహితీసమితి సభ్యులు.

శాస్త్రిగారు ఎప్పుడో శతావధానాలు జేసి శతావధాని అనిపించుకున్నారట అది సత్యకవితాస్వరూపమును విస్మరించి కవితా భాసపుపనులకు గర్వించే పిదపకాలము కావచ్చును. నేడు శాస్త్రిగారిని శతావధాని యంటే నొచ్చుకోవచ్చు. గాజుపెంకులను కరకరనమిలేవాళ్ళను శతావధానాలు చేసే వాళ్ళను ఈనాటిసహృదయులు చూడలేరు.

ఈయన కొన్నినాటకాదులను వ్రాసి ప్రచురించినారు. కాని అవి చాలావరకు పాగబండి సారస్వతములో చేరిపోయినవి.

దీపావళి రచించిన ఉత్తమకవికి సత్యకవితా సాక్షాత్కార మైంది. నాటితో సత్యనారాయణ శాస్త్రిగారిలోని శతావధాని తల వంచుకొని సెలవు పుచ్చుకున్నాడు. నాటి నుండి నవ్యసాహిత్యవేదులమీద దీపావళి వెలిగింది.

హరీంద్రనాథ చట్టోపాధ్యాయివంటి భావుకుడు ఈయన దీపావళి అనే కావ్యమును విని ఉప్పొంగిపోయినాడట. అట్టి ప్రత్యేకాభిమానానికి పాత్రమైన ఆ కావ్యనామమే యీ సంపుటాని కంతటికి పేరుమోసింది. కాదంటే కావ్యావళినే దీపావళి అన్నారనుకొందాము.

దీపావళి కావ్యశ్రేణిలో ఖండకావ్యము. ప్రధానేతివృత్తంలో నాయికానాయకాదుల చాటుననే తన సుఖదుఃఖ రాగవిరాగాదులను ముద్రించుకొని కవి తానై తలయెత్తడానికి వీలులేని మహాకావ్య రచన కంటె ఖండకావ్య రచన, కవిభావతీవ్రతకు, రససిద్ధికి "అసివారుగా ఏగునట్టిబయలు" కనుకనే తెలుగుశతకాలు, సంస్కృతలహరులూ శతులూ రసపూర్ణ పాత్రములైనాయి.

తరచు ఖండకావ్యాలలో కవే నాయకుడై తన రసదిగ్ధములైన అనుభవాలను సూటిగా చెప్పుతాడు. కాని కవి పదేపదే భావ వివశుడై పలుకుతూన్నప్పు డొక్కొక్క చోట రసభావములు వాచ్యములై వెగటు కలిగిస్తాయి. భావుకు డెంతరసైకతానుడైనా అతివేలరసావేశము ననుభవించలేక అతి భుక్తమధురరసాదులను వలె అసహ్యించు కుంటాడు.

ఆత్మనాయకమైన కావ్యమును సహృదయు నకు వెగటు ఘటించకుండా నడిపించడం చాలాకష్టం. కనుకనే కాళిదాసు మేఘ సందేశానికి చిన్నకధను సాయంగా తీసుకొని కావ్యమును రసవంతంగా నడిపించేడు.

నవ్య సాహిత్య వీధిలో ఖండకావ్యం నే డగ్రస్థానమువహించింది. యువకవులు చాల మంది ఖండకావ్యాలను ఆత్మనాయకములు గనే వ్రాస్తున్నారు.

దీపావళి ఆత్మనాయకమైన ఖండకావ్యము. కవిశృంగారి. ప్రియుడై ప్రేయసియై, రక్తుడై విరక్తుడై, సంయోగియై వియోగియై వివిధ కావ్యాలను వివిధ శృతులలో తన్మయము గా పలికినాడు. కావ్యము మొత్తంమీద రసమయంగావున్నది.

ఇందులో 'జయగీతి' 'కాగడా' 'కాంక్ష' వంటి కావ్యాలు కొన్ని తప్పిస్తే తక్కినవన్ని సం యోగ వియోగ రూపమైన శృంగార కా వ్యాలు.

దీపావళిలోని ప్రేమభావవర్ణన ఆస్వాద్యము గనే నడిచింది గాని, కొన్నిచోట్ల కవి సామ ర్థ్యమెంతవరకు కప్పినా రసభావములు వా చ్యములుగా నుండి పునఃపునరావృత్త ప్రేమ భావోల్బణములో కావ్యానంతత కథంచిత్సంపాద్యంగా వున్నది.

సత్యనారాయణశాస్త్రిగారు ప్రాచీనులలో ప్రాచీనుడు, నవీనులలో నవీనుడు.

ప్రాచీనత తెలిపే కావ్యాలు - ఆషాఢ మేఘం, ప్రేమ, సంధ్యాన్వేషణము, రాధ, అభిసారిక మొదలైనవి.

నవీనతను తెలిపే కావ్యాలు - జయగీతి, కాగడా, కాంక్ష, పూర్ణిమ, సుధాకరా వంటివి.

ఈయన కవితలో నవ్యసాహిత్య ప్రత్యేక లక్షణమైన సమాధిగుణము కనబడుతుంది. క్రొత్తకవులు తీసుకొనే వింతఅనుగమాలు కావ్యమంతటాకనబడ్తాయి- 'రెక్కలురాని హృదయము' 'రేయివిప్పిన నీలిరెక్కలనీడ' 'ప్రేమ పులకితానంద పథము' 'చలింప నిశాంధకారముల్' 'మధురవేదన' వంటి వెన్నో వున్నవి.

దీపావళి ఆపాదావతంసము చదివినప్పుడు కవి నిసర్గముగా పలికిన యీమాటలు మన హృదయాలలో మారుమోగుతాయి.

"వలచి నిను విసిగించినందులకు ఫలము
అమరణ మేను ప్రేమగాయకుడ నగుదు
..........................

హృదయమున్నంతవరకు నా ప్రేమకాంతు
ల్బిలికియున్నంతవర కేడ్చి బ్రతుకుచుందు
..........................
సాగింతు నా ప్రేమసాగరయాత్ర
తేలుటో మునుగుటో తేలునందాక
..........................
నాయెద కీప్రపంచమనినన్ మృగతృష్ణల
ఇంద్రజాలమైపోయెను"

ఏ ఆశాభంగమో, అవ్యక్తవేదనయో, చెప్ప లేని అశాంతియో యీయనహృదయాన్ని రగిల్చి యిన్నికావ్యములను వెలిగించినట్లు ఇందులోని ప్రతిపలుకు చురుకుగా సోకి నప్పుడు స్ఫురిస్తుంది. కనుక యీయన శుద్ధ కరుణకవియైనాడు.

ఈపుస్తకము చదువుతోన్నప్పుడు యింకొక కరుణకవి కృష్ణశాస్త్రిగారు ముఖ్యముగా జ్ఞాపకమువస్తారు. అనేకకారణాలవల్ల వీరి ద్దరినీ తరువాత కురక్రవులు కొంద రనుక రించి తమ కావ్యాలను వికృతంచేసు కున్నారు.

"దీపావళి"లో ఉత్కృష్టములైన కరుణ కావ్యాలు (1) దీపావళి (2) ప్రవాసి (3) నిరీ క్షణము (4) ముక్తావళి (5) ప్రభూ (6) పూవు (7) కన్నీటిపాటలు మొద లైనవి.

ఇందు 'దీపావళి'లో కవిభావప్లుతి లయాంత శిఖ చిట్టముకట్టింది. ప్రపంచాన్నంతటినీ ప్రతిఘటించి ధిక్కరించి కవి చేసుకున్న ప్రత్యేక సృష్టిలో అందరూ మహోత్సవ ముగా నెంచే పండుగు తన మహాత్వ్యమున కెంత అల్పాల్పమో నిర్ణయించడంలో యీ కవిఉన్నతి బోధకు వస్తుంది.

"లోన జ్వలియించుచున్న మహానలమున
కొక స్ఫులింగమె కాద యీ యుత్సవాగ్ని
దినములు పరస్పర ప్రతిధ్వనులు గాగ
ఇరువదై దేండ్ల బ్రతుకు నాకిట్టి గడచె.
మ్రొక్కినకొలంది కాలితో త్రొక్కివేయు
ఈ కఠినలోకమెల్ల బహిష్కృతమ్ము".

'ప్రవాసి'లో వియోగిక్షుబ్ధ హృదయము లోని వేదనవిసురు కవితాతం అని తారక స్థాయిలో మోగించింది.

'వెచ్చని నాయెడంద చెయ్యివెట్టి కలంచిన యట్లు సూదులన్ గుచ్చిన యట్లు కత్తి మొన గోసినయట్టులు' అనే పద్యం భవ భూతి 'శీసేవప్రతిబింబితేవ'ను స్ఫురింప జేస్తున్నది.

'నిరీక్షణములో' వాసకసజ్జికానాయిక మ ధుర దృశ్యమును బొమ్మగీచి చూపినారు. ఇందుకు 'రావనుకొందుగాని' 'అలికిడి యేదియైన వినినంత' వంటిపద్యాలు లక్ష్య ములు.

'ముక్తావళిలో' రచయిత కరుణార్ద్ర ప్రేమ ప్రపత్తి హృద్యముగా నుండి కవిపలుకు టందాన్ని వ్యక్తంచేస్తున్నది.

"నావలె శుష్క జీవనమునన్"

"ఈ సుకుమారమాల" వంటి పద్యాలు బహుశః చదువదగ్గవి.

"పూవు"లో రాగవిధుర ప్రేయసీ వస్తు ధ్వని మిక్కిలి స్వాదు.

"ప్రభూ"లో అద్భుతమైన జీవితధ్వని కవి బ్రతుకు బాటలలో నడచి అతని ఉక్తిమాధుర్యపుటియుక్తకు మానదండముగా ఉంది.

తక్కిన కావ్యాలలో నన్ను బహుధా సమాకర్షించినవి "ఆషాఢ మేఘము" "సుధాకర" "పూర్ణిమ" "పెంపుడు నెమలి" "ఆశాగానము" మొదలైనవి.

"ఆషాఢ మేఘము"లో కాళిదాసు కవి నాటి యొకానొక యక్షువేద నాఖ్యాయికి జ్ఞప్తి వారి కారుణార్ద్రమైన మెత్తని హృదయాలమీద కపిక్కొట్టిన ధనముద్రి ఎన్నటికీ చెరగనిది. ఇందులోని భావశిల్పము పలుకు పొందిక "పరాంకోటి" నందుకున్నవి. దీనిలో పాఠకులు కొన్ని శతాబ్దముల వెనుకకు మరలి మేఘసందేశపు బాలుపట్టి కాళిదాస కవీంద్రుని నాటి శృంగార సంపత్తిని చూరగొనే మధురిమ ఉంది.

సుధాకరావంటి సుందర కావ్యమునకు తెనుగువారు గర్వపడకతప్పదు. అందలి అచుంబిత భావసంపత్తి నవీనసాహిత్య ప్రత్యేకపు సొంతసొత్తుగా చెప్పబోతే ఎవ్వరు అడ్డరాదు. పారిజాతాపహరణపు వెన్నెలకంటె ఇందులో నవంనవశిల్పమున్నది. రంగనాథ రామాయణపు చంద్రునికంటె యీసుధాకరుడు చక్కదనాలహంస. బిల్హణీయపు ఇందు సందర్శనముకంటె ఇందు చూచే జగన్మోహన దృశ్యము పరిపరివిధాల మనస్సును వీడదు.

ఇక కవి అక్కడక్కడ చూపిన కావ్యాలంకార విచ్ఛిత్తి చూడదగ్గది—

"అప్సరోంగనాస్తోమ సితాపగుంఠనతతుల్
సుమి ఈ తెలిమబ్బు దొంతరల్"

"విప్పిరేమొ నిశాకాంత వెల్లగొడుగు"

అనే ఉత్ప్రేక్షలు.

"సురచాపమట్లు మంజుల గానమట్లు
అంతలో మటుమాయమైపోయినాడె"

...  ...  ...

"అలరునకు బోలె నా హృదయమ్మునకును
జన్మమున కొక్కటే వికాసమ్ము నకయ."

అనే ఉపమానములు హృదయంగమాలుగా వున్నవి.

దీపావళిలోనిశయ్య తెనుగులో పువ్వులు పరచినట్లు 'సంస్కృతంబు పచరించిన పట్టున' మెరపుతీగెలను కమ్మెచ్చునలాగినట్లు సొంపముగా సాగింది.

"తొలిమబ్బు కనుసైగ దోచి—
దరిజేరబోవు బెగ్గురుకన్నెవోలె".

...  ...  ...

"ప్రావృడంబర శ్రీ చికురాయమాణ జల
భృత్పటలీ చటులాంధ మాతమిన్"

ఈకవి వృత్తాల రుచి పెంపుతలచు నన్నయాదులను స్పృశిస్తుంది.

దీపావళిలోని కొన్ని గేయాలలో నాకు పరువము కన్పించలేదు. పద్యాలలోని విశిష్టత పాటలలో లేదు. ఒకటి రెండుమాత్రము సహ్యాములుగా నున్నాయి.

ఉత్తమ కవికి ప్రతిభ, ఉపజ్ఞ, వ్యుత్పత్తి ఉండాలి.

ఈకవికి వీటిలోపం లేదు; కాని ప్రతిభ దృష్ట్యా ఉపజ్ఞ వెనుకగా ఒదుగుతుంది. ఈలోపాన్ని ప్రతిభ చాలావరకు కప్పివేస్తున్నది.

ఇందలి కరుణకావ్యాలు చదువుతున్నప్పుడు కృష్ణశాస్త్రిగారి ధోరణులు విధిగా జ్ఞాపకం వస్తున్నాయి.

ఈయన అశాంతిలో కృష్ణశాస్త్రిగారి సంపూర్ణదర్శనం దొరుకుతుంది.

"బాష్పశోణితలహరుల —
ఏవిసుగు వేసటలు లేక త్రావినాను"
(దీపావళి)

... ... ...

"నల్ల ద్రాక్షితిమున్న దోసిళ్ళకొలది"
(ప్రవాసం, ఊర్వశి)

"చైత్రశుభప్రభాతవం*శీకలగాన మిాశిశిర
జీవనమం దిక లేని లేదా?"
(దీపావళి)

"చివురింపదా చైత్రి శుభోత్సవవిభాత
కళ్యాణము ఈ దరిద్రహేమంతమున"
(ప్రవాసం, ఊర్వశి)

* అశీం—

Oh wind! if winter comes,
Can spring be far behind?

అనే షెల్లీ మాటనుండి పైరెండున్ను దిగుమతియై యుంటవని మా అనుమానము.

"భస్మమొనరింతు దీని నాభగ్నహృదయ
శకలముల చేర్చుకొనిన కాష్ఠమ్మునందు"
(దీపావళి)

"కంటగురిసిన కార్చిచ్చు మంటమ్రోళ్ళ
కాలి నుసియై నశించె వాంఛాలవాలె".
(ప్రవాసం, ఊర్వశి)

"మందహాసరేఖాకమనీయ
కాంతికళికల్ పయిపోకినయంత"
(దీపావళి)

"మనోజ్ఞహాసరే ఖాకమనీయ
కాంతిసుధ కాల్వలు గట్టగలేదుగాని"
(ప్రవాసం, ఊర్వశి)

"బ్రతుకెల్ల కన్నుగా వెదుకాడుకొందు"
(దీపావళి)

"బ్రతుకు బ్రతుకెల్ల నొక్క నేత్రముగ గాచి"
(ప్రవాసం, ఊర్వశి)

ఇట్టి వింకా చూపవచ్చును.

"చీకటులపాలేన యీ కలువబ్రదుకంత"
(దీపావళి)

"ఎన్నెలల సొగసంత ఏటి పాలేనటర"
(నండూరి)

అక్కడక్కడ పరకవిచ్ఛాయ లున్నంత మాత్రాన కవితాచౌర్యము అనడానికి వాక్కు లేదు. కాని ఆకవుల ప్రభావము ప్రకృతకవిలో ఎంతవరకు ఉన్నదో అనే అంశము దీనివల్ల స్పష్టముగా తెలుస్తుంది. ఈకవివ్యుత్పత్తి నిశితమైనది. అనేకవిధాల సంస్కృతులను ఈయన మెలకువతో నిర్వహించినారు.

వివిక్తపథము, రిరంస, హేనాకము, ద్యావాపృథివీపరీతము, పూవనో, వసుమతీజమనో, కదుష్ణచుంబన శ్రీనవకమ్ము వంటి ప్రయోగములుజేసిన కవివ్యుత్పత్తిమేర నిజానికి అనల్పముగానే తోస్తుంది కాని—
క్వాచిత్కముగా కొన్నిచ్యుతసంస్కృతులు అనర్థవ్యక్తులూ కనిపించకపోవడం లేదు.

కాంక్షలో "బిబ్బోకము" అనుమాట అన్వర్థంగా ప్రయుక్తంకాలేదు.
"మనాక్ప్రియకథాలాపే బిబ్బోకోఽనాదర క్రియా" — (ప్రతా.)

కేవల స్త్రీశృంగారవిలాసమన్నా యిక్కడ కుదరదు. ప్రణయమూర్తి అనేకావ్యములో వాడిన ప్రణయశబ్దానికి శాస్త్రీయమైన అర్థస్ఫూర్తి లభించడములేదు.

'నవనవప్రేమపుష్పాలకానంతపథము'
'ప్రణయహృదయానురాగవిభ్రమము'
'బాధాతివేలహృదయ వేదనాజాలము'

వంటి సమాసాలకు తృప్తికరమైన విగ్రహాలు చెక్కడానికి వీలుకనబడదు.

'ఛాయరో చిరుదయవీధి'
'ఉషసీ' 'రగులై'

'పాదపవ్యాపిత' 'తెరువుకేసి'వంటివి చ్యుతసంస్కృతులుగా కనిపిస్తున్నవి.

ఇట్టిదోషాలు పూర్వకావ్యాల్లోనూ అధునిక కావ్యాల్లోను ఉంటూనేవున్నవి. ఇవి కావ్యోత్కర్షకు భంజకములుగావు. వీటి సంఖ్య ఎక్కువైతేమాత్రం అపకర్ష రాక తప్పదు.

ఇక చెప్పవలసిన తుదిమాట—
సత్యనారాయణశాస్త్రిగారి దీపావళి నవ్యకావ్యవీధికి వింతవెలుగు తెచ్చే కావ్యం తప్పక అగును.

హృదయం ఉన్న ప్రతిభావుకుడు రాసిక్యం గల ప్రతిసరసుడు తెనుగుదేశంలో కావ్యగౌరవమున్నంతవరకు దీనినాదరించగలడు.

# దయ్యాల పెళ్లి ....

**దేవరాజు కృష్ణశర్మ**

## ౧

అర్ధరాతిరి, అడివిమార్గము
ఆవులించిన అంధలోకము
చుట్టుపక్కల శూన్యదృక్కుల
బావురంటూ బారజాచింది.

*

పిరికిగుండెల పీల్చి తీసిన
నల్ల నెత్తురు తలకుబోసుక,
కారుమబ్బుల కాటుకెట్టి
కటిక చీకటి గండ్రదుప్పటి
కాసిపోసింది.

మొద్దుగుండెల మొండిచీకటి
రంగు రెవికను... దిద్ది
తొడిగింది.

దుఃఖగాథలు, దురితబోధలు
కడుపునిండుగ గర్భభారము
కదలజాలక కదలజాలక
కాళరాతిరి కాలుజాచింది.

ఝల్లుమని అడవెల్ల ఝలబరించింది.
చెట్టుపుట్టలు, కొండకోనలు
చింతచెట్లూ, చివరకొమ్మయు
పొర్లుపొర్లుగ పులకరించాయి.

## ౨

దయ్యాలు భూతాలు ప్రేతపిశాచాలు
ధగధగల తళతళలు
భగభగల పెళపెళలు
ధంధంలధణధణలు
శాకినిలు ఢాకినిలు కామినిలు భైరవులు
కల్లోలకాంతులూ కలగలపురోచులూ
వజ్రాల బెళుకులూ వరహాలమూటలూ
రత్నాలరవళులూ రాయంచనడకలూ
ఉరుములో మెరుపులో హుంకరించాయి
మేఘాలమార్గాన మిటకరించాయి
బ్రహ్మరక్షసి తండ్రి భ్రూణహత్యల తల్లి
బాలరక్షసి పెండ్లి భేతాళి వియ్యంబు
ఎన్నెమ్మ పున్నెమ్మ పిన్నిముత్యాలమ్మ
ఎన్నో వేషా లేసి ఎదురు వెళ్లారు
తక్కుతూ తారుతూ తరలివెళ్లారు.

మిడిగుడ్ల చాలులూ
నడినెత్తి చూపులూ
కోరముత్తుల కొక్కిరింతలు
దుప్పిచెవులా దులబరింపులు
కొండ శిఖరం గొప్ప దేహాల్
బానకడుపులు బండకాళులు
నడచినా సురుగుళ్లు తిరుగూ
పరుగులో నుడిగాలి మళుపూ

3_93

మడిమముందుకు వేళ్లు వెనుకకు
పరుగుపరుగున బారదూరం.

3

హెహేభాయి హహోహోభాయి
హెహేభాయి హహోహోభాయి
వెనుకముందుల చూడబోకోయి
ఓపెళ్లికొడుకా
పెళ్లికూతురు పగలనవ్వేనోయి
అహోహం ఒహోహం
అహోభాయి ఒహోభాయి

అందాలపల్లకి ఆహామేఘాలపై
గజ్జల్లగుర్రిమే కోరుకున్నావా
ఓపడుచుపిల్లా
పూర్వవాసనమహిమ పొంగిపోయేవా
ఓ పెళ్లిపడుచూ
ఉహూహూం ఒహోహూం
హేహేహం అహేహేం

మనకు లొంగనివాడు
మహిలేనివాడు
మనలమెచ్చినవాడు మరియాదవాడు
మనసులో నరకంబు
నరకసౌఖ్యంబు
మనసుమార్గం తెలిసి
మనలగుప్పెట నిలిపి

పెదవులో ఎదకోయుకోతలో
చూపులో నిశితంపుబాధలో
నవ్వులూ పువ్వులూ నాల్గుకాయలుకాయ
సౌఖ్యాన చరియించు సాధువెవ్వడులేని

ధరణిపై మనకింక స్వేచ్ఛగా
ఊరేగుదము పెళ్లి
ఊరెల్ల ఊర్పుగా
ఓ పెళ్లికొడుకా
ఊరేగవోయి ! మనసు
ఉయాత్రిత లూగగా
పారతంత్ర్యపు ప్రజలు
దారిద్ర్యకూపాన దుఃఖవాహినిలోన
బుడకల్లు పెట్టగా
ఊరేగవోయి ! మనసు
ఉహాత్రిత లూగగా

*

పల్లకీ లేచింది ప్రాణి లేచింది
పల్లకీ బోయీలు పాటపాడారు
అడవిలో నిలువెల్ల హడిలిపోయింది
తప్పెట్లు తాళాలు డోలు రంధోళ్లూను
ఢుంఢియ్యా ఢుంఢియ్యా తూగిపోతున్నాయి

౪

ఉత్తరానా మర్రిచెట్టు
ఉరిమి చూచింది
కొరవిదయ్యం శ్రమణభిక్షువు
గొల్లుమన్నారు
వల్లకాటిలో దుమ్ము దుమ్ముగ
ధూళి రేగింది

తుమ్మచెట్టూ తూలివిరిగెను
బొబ్బరింతలు పొక్కిపోయెను
ఎండుమంటలు నాట్యమాడగ
నక్కలూ తోడేళ్లు ఎగిరిపై

జీవితేచ్ఛలు సుఖము దుఃఖము
తోడుతోడుగ చితిని పేర్చగ
మాయమైనది మాయదేహం

రోజుతూ ఈమంట
పొక్కుతూ ఈధూళి
ఎన్నేళ్లు గడిచినా ఏదారిపోయినా
తమదగ్గరకు
కడసారిమార్గమని
చాటి చెప్పినవి

*

మండుచున్నా సోదకోఅవితో
మండల న్యాసంబుచేసే
మనిషి, కంకాళీ !
చేతివేళ్లుల చిన్నప్రకేళి
చిటిలు మన్నాది.
ఓశ్రిమణభిక్షూ !
లేచి రావోయి !

మంత్రమూ తంత్రమూ మాటమరిచేవా
పెళ్లికీ పెద్దలూ ఎవరులేరోయి.

శింశుపా చెట్టుపై బిగురువోసే దెవరు
చీకటీమ్రానుపై చిగురు నిలిపే దెవరు
నల్లకానుగ చెట్టు ఎరుపు చేసే దెవరు
ఇల్లువాకిళ్లన్ని ఎగ్రనీమయముగా
నెత్తురూ - కాళాపి
బొమికలూ - ముగ్గుగా
తీరుగా అలికి తీర్చిం దెవరు
నల్లనీ దిక్కులా ఎరుపు నిల్పిన దెవరు
రండోయి! భూతాలు లేచి రారండి !
రండి! పేరంటాళ్లు రండి రారండి.

౫

లోకమంతా వల్లకాడూ
మండుతున్నది మంచిమార్గం
బొగ్గుగా మారింది న్యాయం
ధర్మమంతా గాలిలో
ధూళిలో తేలిపోయింది.

# ఉదాహరణం 1938· ఏప్రెల్ ప్రతి?

**కు కు గం టి సీ తా రా మ య్య**

౧

రామారావు అనర్సు గ్రాడ్యుయేటు. దాదాపు పదేండ్లు అనేక ఉల్టాసీదాలు తిని తుదకు 4 యేండ్ల క్రిందట స్థాయైన ఉద్యోగంలో చేరాడు. ఇప్పుడిప్పుడే వెనుకటి చిక్కులు వదలిపోతున్నాయి. ఈయన భార్య సీతమ్మ గొప్పయింటి ఆడబడుచు. వీరిద్దరు చాలా అన్యోన్యంగా వుంటారనీ ఆదర్శదంపతులనీ వాళ్ళ నెరిగిన వాళ్ళంతా అనుకుంటూ వుంటారు. వీళ్లకి సంతానం నష్టమై నష్టమై చివర కొక్క ఆడపిల్ల బ్రతికింది. శారదను చాలా కట్టుగా పెంచాలని తల్లి ఉద్దేశ్యం; ఆమెకు సంగీత సాహిత్యాల్లో మంచి ప్రవేశం కలగజేసి విద్యావతిని చెయ్యాలని తండ్రి ఉద్దేశ్యం; రెండూ మంచివే. పిల్లమాత్రం చిన్నప్పటినుంచి కొంచెం బిరుసుపాకం అనిపిస్తుంది. రామారావుకు నెలకు రు 250 లు జీతం. ఒక్కపిల్ల కాబట్టి యేలోపం లేకుండా సాధ్యమైనంత వరకు కలవాళ్ల బిడ్డల్లే పెంచుతున్నట్లు లోకం అనుకుంటారు - రకరకాలలంగాలు, రంగురంగులవోణీలు! బళ్లోకి బండీమీద వెళ్లటం! నెలకు పదిరూపాయిలిచ్చి సంగీతం, మరో పదిరూపాయలిచ్చి ప్రైవేటు! ఇట్లా లోకానికి చూట్టానికీసంసారం ముచ్చటగా ఉంది. తల్లిదండ్రులకింకేం కావాలి? మంచి సంబంధంచూసి ఒకయ్యచేతుల్లో పెడితే వాళ్ల జన్మ తరిస్తుందని చూచినవాళ్లంతా అనుకుంటూ వుంటారు.

౨

లోకంలోవాళ్లేమనుకున్నా భార్యాభర్తల అన్యోన్యం వాళ్లకేం తెలుస్తుంది? మనస్సులు కలిసిన అన్యోన్యాన్ని గొప్ప దనచ్చు; అట్లా కానిది మేడికాయవంటిది భార్య మంచి దని భర్త, భర్త మంచివాడని భార్య చెప్పుకోడం చాలాఅరుదు. భర్త యెంతవిద్యావంతుడైనా గుణవంతుడైనా భార్యకు నచ్చడు; భర్తకు భార్యాకూడా అంతే! చూడు అచ్చమ్మ మొగుడు ఎంత మంచివాడో! జీతం రాగానే ఆమెకు "నీయిష్టం వచ్చినట్లు చేసుకో" మని 10 రూపాయలిస్తాడట! అనేమాటలు సామాన్యంగా వినబడుతూనే ఉంటాయి. వీళ్లవిషయంలోమాత్రం ఇట్లా చెప్పుకున్నట్లు లేదు. ఎన్నడూ వాళ్లు తగాదా పడ్డట్టు ఎవ్వరూ అనుకోలేదు. కాని వాళ్లయింట్లోసంగతి యెవరికి తెలుసు పాపం! సీతమ్మ కాన్పులు ఎక్కువగా కనడంచేత శరీరం దుర్బలమై పోయింది. కనపడడానికి బూరుగవృక్షమల్లె వుంటుంది కాని దబ్బెత్తుసత్తువ లేదు.

ఇప్పుడు సీతమ్మకు పని అంతగా లేదు. ఇంట్లో ముగ్గురు-పిల్లతో కూడా. పనిచేసే మనుషి ఉంది. మొగుడు కచేరీకి, పిల్లబళ్లోకి వెళ్లారా సాయంకాలందాకా యేం పనుంది? ప్రత్యేకం ఆవిడప నేమి టంటే రెండు మాట్లు కాఫీ, రెండుమాట్లు అన్నంతయారు చెయ్యడం; పిల్లకి జడ, నీళ్లు, నాలుగుదినాల కోమారు తలంటు. దుర్బలంచేత ఆమెకు చాలా కష్టంగా వుంది. పనిచేసేమనిషి చీకటితో రాకపోయినా పాలవాడు కొంచె మాలస్యంగా వచ్చినా ఆమె ఆందోళన యింతింతని చెప్పటానికి వీలు లేదు. ఆవేళ కాళ్లకింద నిప్పు లున్నట్టే!

## ౩

"నేను చెబుతూంటే మీకు చెవున పట్ట లేదుగాని పిల్లను బళ్ళోకి పంపటంవల్లఏమీ లాభం లేదు"

రామారావు ఊరుకున్నాడు.

"నానోరు పడిపోవలసిందే గాని నామాట యెవరు వింటారు?"

రామారావు ఏమీ మాట్లాడ లేదు.

"బెల్లంగొట్టినరాయి! ఏంలాభం"

"అయితే! ఏమంటావు?"

"ఏమంటానా? నాశాస్త్రిద్ధ మంటాను"

ఇం కేం మాట్లాడుతాడు రామారావు!

## ౪

శారద బళ్లోకి వెళ్ళినప్పుడుతప్ప ఇంట్లో వున్నంతసేపూ తల్లిచేత పూజే:

"పమిట అట్లా వేసుకున్నావేం?"

"కంచ మెవరెత్తుతాడు నీతాత"

"హార్మోనియంముట్టుకోకు అమ్మా! ఆడుకో"

"అదుగో పోతున్నావు! ఎక్కడికి? వస్తున్నా ఉండు!"

"మరీ పసిపిల్ల వై పోతున్నావు; తలమీద చెయ్యి పెట్టనియ్యవు! ఎట్లా వదులుతుందీ నూనె?"

"నేను జడ వెయ్యను పో! మీనాన్నచేత వేయించుకో!"

"మింగేవుగా! ఇక పో వూరిమీదికి"

ఇట్లా యెన్నో చెప్పటానికి వీలులేదు. ఈమె ఎంత కట్టడి చేస్తున్నదో శారద అంత మొండిచరుస్తున్నది. పెండ్లాముకు కోపము వస్తుం దని పిల్లనే కూకలేస్తుంటాడు రామారావు.

## ౫

రామారావుకు సాయంకాలను స్నేహితులతో షికారు వెళ్ళటం అలవాటు. ఒకనాడు ఇంటికి ఆలస్యంగా వచ్చాడు. ముసుకు పెట్టుకుని పడుకుని ఉంది సీతమ్మ. వచ్చేప్పటికి ఇల్లు నిశ్శబ్దంగా వుండా ఆదినం మునిగిందన్నమాటే! వచ్చాడు, కాళ్ళు కడుకొన్నాడు, పట్టుపంచ కట్టాడు, అన్నంపెట్ట

మన్నాడు. "ఏం! అన్నానికిప్పుడు తొందర?"

"పొరపాటు! రేపటినుంచి పెందలాడే వస్తాలే!"

"రేపు రేపు! 30 యేండ్లయింది! నే చచ్చిందాకా ఇంతే!"

"నేం చస్తే మీకేం! సాయంకాలంనుంచీ గుండెనొప్పి వచ్చి చస్తున్నాను! చూసే వాళ్ళా! తల్చేవాళ్ళా! మీరు నన్నిట్లా చంపండి. ఇంట్లో పదేండ్లపిల్ల ఉందీ అంటే యేంసుఖం లేదు! ఎందరో చచ్చా రంటారు గాని నాకు చావు రాదుకదా!" అంటూ ఘొల్లుఘొల్లున యేడవడం మొదలుపెట్టింది సీతమ్మ.

౬

రామారావు పిల్లెల్లే చప్పుడు చెయ్యకుండా వున్నాడు. ఆదినం 10 గంటలైంది పడుకునేటప్పటికి. ఇట్లా దినం వకటిచొప్పున ఇల్లంటే భయమై పోయింది రామారావుకు. బైటికి పోయి యెక్కువకాలం గడపటానికి భయం.

రామారావుభార్య మాట్లాడటం చాలా తక్కువ. ఇంట్లోకేమైనా కావాలె నంటే మాట్లాడటంతప్పఇష్టాగోష్టి పోయిపడియేండ్లైంది.

"ఓ! ఇదిగో యిట్లారా."

"ఏం మునిగింది! అంత సహోద్యోగ్యతకు"

"కాదే! చూశావా! వెంకటాద్రిమయ్య గారికి జ్వరం వస్తున్నదట!"

"అయితే నన్నేం చెయ్యమంటారు?"

"పాపం! వంటరివాడు! పథ్యం పంపుదాం!"

"సరేలెండి! ఏదో నెత్తిమీదకి తెచ్చిపెట్టా రనుకున్నా, అంతమెల్లగా పిలుస్తూంటే!"

"ఇంత చారుమెతుకే గదూ?"

"చారుగీరు ఎవరు పెడతారు? పొద్దుట్నించి కాళ్లు తీసుకుపోతున్నాయి? నాచేత కాదు. మీయిష్టం."

"కుంపట్లో నిప్పుందా? మిష్టిచారేగా! నే పెడతాలే!"

"ఎంత పంతమండీ! ఇంట్లోవాళ్లకీ పరాయి వాళ్లకీ నే దొరికానా?"

"కోప్పడకు! పోనీలే!"

"ఆఖరుకు మాట నాకొస్తుంది. మీరు పరోపకారం చేసేవాళ్ళు; నేను వొద్దనే దాన్ని! అంతేలెండి!"

౭

పక్కింటి సుబ్బమ్మొచ్చింది ఒకరోజున. రామారావు ఇంట్లోనే వున్నాడు.

"ఏమండీ సీతమ్మగారూ! భోజనాలైనయ్యా?"

"లేదమ్మా"

"ఏం! ఈపాటికప్పుడే అయిపోవలసినదేనే"

"అవునుగాని యివ్వాళ కొంచెం ఆలస్యమైంది. మీరు భోంచేశారా?"

"మావారు ఎక్కడకో పోయినారు. వారు

వచ్చేటప్పటికి ఆలస్య మౌతుందని నన్ను భోంచెయ్య మన్నారు. నాకైంది"

"ఏమోనమ్మా! మొగాళ్ళను వదిలి నేను భోంచెయ్యలేను"

"పాణం పోతున్నా కనిపెట్టుకోటమే?"

"తప్పు కాదుటమ్మా?"

"నే నుండలేనమ్మా అట్లా కనిపెట్టుకుని"

"మావారుకూడా అంటారు గాని నే నెన్నడు అట్లా చెయ్యలేదు; చెయ్యలేను. నాకు అన్నం తిన్న ట్టుండదు."

* *

మర్నాడు సుబ్బమ్మ సీతమ్మ అన్నం తింటూండగా వచ్చింది.

"ఏమండీ! ఈపిచ్చి పోలేదూ మీకు?"

"ఏమి టండీ అది?'

"ఎంగిలివి స్తట్లో ఎట్లా తింటారండి? మా వా రది చాలా అనారోగ్య మంటా రే!"

"మాకాలానికీ మీకాలానికీ భేదంలేదండీ? మీరుచిన్నవాళ్లు, ఏమైనా చేస్తారు! మీ రట్లాచేస్తా రని మే మెట్లా చెయ్యము?"

"అనారోగ్యం కాదండీ?"

"ఏ మైనా సరే, తినాలిసిం దే"

సుబ్బమ్మ మొగుడు రైల్వేగుమాస్తా. మొగుడికి 50రూపాయలజీతం అయి తేనేం! ఈకాలపుపిల్ల. అందుచేత కొంచెం నీటెక్కువ. నవనాగరకపుఅలవాట్లు. సీ త మ్మ క వ్వి గిట్టవు. పై పెచ్చు శారద సుబ్బమ్మనుచూసి నేర్చుకుంటుం దేమో అని భయం. శారద సుబ్బమ్మగారింటి కప్పుడప్పుడు పోతూండేది. వాళ్ళయింట్లో గొడవ ఒకమాదిరి. డబ్బు లేకపోయినా టాకీకి వెళ్లాలిసిందే! దినానికో తెల్లచీర కట్టాలసిందే! ఈమధ్య కళ్లజోడుకూడా మొదలెట్టింది. ఆడవాళ్ల మీటింగని, చందాలని, విందులని యింటికాలస్యంగా వస్తూవుండడం-ఆమె మొగుడు విసుక్కోడం-అనేకమాట్లు శారద చూసింది. పైగా ఇంటి కెవరైనా మొగాళ్ళు వస్తే వాళ్లతో నవ్వులూ పకపకలూను. ఈసంగతి ఆయన కిష్టం లేదు. మొగు డింటికి వచ్చేటప్పటికి సామాన్యంగా పెత్తనానికి పోయి ఉంటుంది సుబ్బమ్మ. ఆయన యింటింటికీ తిరిగి పెళ్లా మెవరింట్లో వున్నది తెలుసుకోవడం, పిల్చుకురావడం! ఇటీవల వాళ్లకు మనస్సులు కలిసి లేవని చుట్టుపట్ల పుకారూ ఇ దంతా కూడా శారదకు తెలుసు ఇట్లాగే చుట్టుపక్కయిళ్లలో ప్రతిదానిలో ఒకసమస్య వుంది.

రా

ఒకనాడు రామారావుకు రాత్రి 12 గంటలకు మెళుకువ వచ్చింది. పిల్ల గుర్రెట్టి నిద్రపోతున్న ది.

"ఇదిగో నిద్రపోతున్నావా?" అన్నాడు భార్యతో. జవాబు లేదు.

"మెళుకువ రాలేదా?"

సీతమ్మ పడుకున్న పక్క పొర్లింది.

"చాల్లెండి! ఇప్పుడే కునుకు పట్టింది. గుండెల్లో నొప్పొచ్చి బతుకుతా ననే అనుకోలేదు.........అబ్బ! ఊరుకుందురూ!"

ఇట్లాగే పాపం సీతమ్మ పగల్లాగో తిరిగి తిరిగి రాత్రి పడుకుందా అంటే వాళ్ళు తెలియదు. ఒక్కొక్కరోజు గొడ్డుమూలు గుతున్నట్టు మూలుగుతూంటుంది. అట్లా లేనిదినం యే మూడు నెల్ల కొక్కటో దొరుకుతుంది రామారావుకు! అంతే చాలులే అని సంతోషిస్తూంటాడు.

౬

వీళ్ల యింటిపక్కన నెలకు వెయ్యిరూపాయల ఉద్యోగస్తు డున్నాడు. ఆయన పెండ్లాం దాదాపు రోజూ మోటారులో వెళ్లి బజారునుంచి యేదో కొనుక్కొస్తూ ఉంటుంది. అంతేగాక గిన్నమ్మి కంచం కంచ మమ్మి గిన్నె చేయిస్తూ వుంటుంది. అంత యెక్కువగా ఖర్చు పెడదామని సీతమ్మకు లేదుగాని అట్లావుంటే బాగుండు నని మాత్రం వుంది. అప్పుడప్పుడు అట్లాగే కొంటూంటుంది. రామారావు బజారుకివెళ్లి ఏమన్నా కొన్నరోజున సీతమ్మ కొంచెం సంతోషంగా వుంటుంది. కాని ఖర్చుమాట ఎత్తేటప్పటికి మళ్లీ వెనుకటి చిత్తవృత్తి ప్రకోపిస్తుంది! మొత్తంమీద యెప్పుడోతప్ప సీతమ్మ సణుగుతూనో, తిట్టుతూనో, సాధిస్తూనో, విసుక్కుంటూనో, కొప్పడుతూనో, ఏడుస్తూనో వుండడమే! ఎప్పుడూ సంసారంతో అసంతృప్తి! కోరికలు తీర్చలేని మొగుడు! చెప్పినమాట వినని కూతురు! చుట్టూ అంతా చీకటి! ఇలా వుంది సీతమ్మబ్రతుకు.

ఇక రామారావుకి ఇంట్లో సౌఖ్యం లేదు. సంసారానికి డబ్బుచాలదు! చాల దన్నా కూడదు! మాటా మంచీ లేదు! నోరు తెరిస్తే తప్పు! ఇల్లంటేభయం! మనసులోమాట మనస్సులోనే! పరాయి వాళ్ళతో వెళ్ళ బెప్పుకునేస్వభావంకాదు! ఏమన్నా చెప్పుకుంటే చుట్టుపక్కవాళ్ళంతా ఆదర్శక సంసారమను కుంటున్నారే! దానికి భంగం! అవమానం! ఏండ్లు గడిచిపోతున్నాయి. స్థితిగతులు చిత్తవృత్తులు మారలేదు! సీతమ్మకింకా వోపిక తగ్గుతున్నది. విసు కెక్కు వవుతున్నది. రామారావుకు శ్రమ తప్పలేదు; చీవాట్లూ తప్పలేదు. జీతంలేని జీతగాడని యీాయ ననుకుంటున్నాడు. జీతంలేని పనికత్తె నని సీత మ్మనుకుంటున్నది. గుంభన మాత్రం చెడలేదు. చుట్టుప్రక్కలవాళ్ళు మామూలుప్రకారమే అనుకుంటున్నారు. రామారావొకప్పు డనుకుంటూంటాడు: "మా సంసారమే యిట్లాగా? అన్నీయింతేనా?" మొత్తంమీద ప్రతి సంసారానికి ఒకక్కలోటున్నట్టే వింటున్నాడు. అదో తృప్తి మనస్సుకు! అన్నింటికంటె తనభార్య యిట్లా చేసిందని లోకులు చెప్పుకోపోవడం అంతకంటె తృప్తి! దారెంబడి వెళుతూంటే "ఆయనపెళ్ళామే........." అని వేలెట్టి

చూపించుకోకపోవడం ఈకాలంలో చాలా గొప్పవిషయం.

## ౧౦

పిల్ల పెండ్లినిగురించి భార్యాభర్తలకు భిన్నాభిప్రాయాలు. "ఒకప్పుడు మామనస్సులు కలిశేడ్చినాయా" అని రామారావు మోడి వేసుకున్నాడు. సీతమ్మమాత్రం ఏ సందునో దేనిమీద పెట్టో దెప్పుతూనే వుంటుంది.

"ఎవరింటికైనా వెళ్ళితే నోట్లో ఉమ్మేస్తారు"

"వాళ్ళసొమ్ము తిన్నామనా?"

"మనసొమ్ము మనం తింటూంటేనే యితరులచేత చీవాట్లు"

"ఎక్కడికి వెళ్ళకపోతే సరి"

"ఎప్పుడూ ఈయింట్లోనే పాతుకోమంటారు; మీకేం!

"ఇప్పు డెక్కడి కెళ్లాలె?"

"మీసంగతి కాదు కాబట్టి మీకు మరుపు. మామేనత్తకోడలు పెద్దమనిషైందని మొన్న ఉత్తరం మీరు చూడలేదూ?"

రామారావేం మాట్లాడలేదు.

"నేను వెళతా నంటున్నా కదూ! ఇక మాటరాదు"

రామారావు నిరుత్తరుడైనాడు.

"నే నేమైనా సరే వెళ్లాలసిందే! ఎల్లుండి బయలుదేరుతున్నాను. పిల్లా మీరూ ఉండండి"

"అట్లాగే వుంటాం వెళ్లు."

"అంతే గాని త్వరలో పిల్ల నొకరి కిచ్చి మొక్కుతీర్చుకుందా మని లేదు. వెళ్ళమంటారు మీకేం? ఎక్కడికి వెళ్లేది? ఇక వక్కచోటే వుంది వెళ్లటానికి!"

* *

"వెంకమ్మగారమ్మాయికి సంబంధం ఇట్టే కుదిరింది"

"అట్లాగా!"

"ప్రయత్నం చేస్తేగా! మీరుమాత్రం చేతులు కట్టుకూర్చోండి!"

"ఏం చెయ్యమంటావు! అయితే!"

"ఏం లేదు. పిల్ల పెద్దదవుతే ఊరిబైట గుడిసె వేసుకోవలసిందే!"

"ఎందుచేత?"

"మన్నెవళ్లు రానిస్తారు?"

"వెధవలైనారు రానియ్యకపోతే! నేను పోనే పోను, ఎవరిండ్లకూ"

"అంతా వ్యతికరణం"

"ఈవిషయంలో మాత్రం యెక్కువగా నాతో చెప్పకు!"

"ఏం సంసారం! పాడుసంసారం!"

## ౧౧

శారద బడిమాని యింటిదగ్గిరే చదువుకోటం మొదలెట్టింది. రామారావీవిష

యంలోమాత్రం కాఠిన్యం వహించాడు. మిగిలిన అన్ని విషయాల్లో నోరుమూయిం చినసీతమ్మకు పిల్లపెళ్లిసంగతిలో మాత్రం మొగుడ్ని లొంగదీయటం చేతగాలేదు. విసుగు పిల్లమీద కోపంగా పరిణమించి మునపటికంటె శారదకు కోత యెక్కువైంది. రామారావుకూడా దినానికి అష్టోత్తరశత నామపూజ! రానురాను రామారావూ సీతమ్మా మాట్లాడడమే మానేశారు; మాట్లాడక తప్పక పోతే అన్యాపదేశం.

"ఎల్లమ్మా! బియ్యం తీసుకురావాలని చెప్పు." రామారా వెదటనే వున్నాడు. బజారు కెళ్లి బియ్యం తెచ్చాడు.

* *

"మడికట్టుకోవచ్చు. వంటైంది"
రామారావు మడి కట్టుకుని భోంచేశాడు.

* *

"వాకిట్లో మంచం ఇంట్లో కెట్లా వస్తుంది?"
రామారావుమంచం లోపల తెచ్చి పెట్టాడు.

* *

"వాకిట్లో వెన్న కేక వినబడుతున్నది, ఎట్లా యిస్తారో! నాలుగురూపాయలది తీసు కుంటే బాగుండును."

రామారావు పిలిచి వెన్న కొన్నాడు.

* *

"అమ్మాయీ ఈపదిరూపాయలు అమ్మ కిచ్చి యింట్లో వాడుకోమను."

"అమ్మా!"

"ఏం! అమ్మకాదు అడివి!"

"నాన్న పదిరూపాయలు నీ కిమ్మన్నారు."

"ఆచెక్కమీద తగలెయ్యి"

* *

ఒకప్పుడు రామారావుకు మడిబట్ట వుండేది కాదు. పట్టుబట్ట కట్టుకొని అన్నంతినేవాడు. ఒక్కొక్కదినం నీళ్ళు చల్లారిపోయేవి. అలాగే స్నానం చేసేవాడు. 'నెయ్యేనా అడగడా' అని సీతమ్మ లోపలినుంచి రాక పోతే ఉత్తన్నమే తిని పొయ్యేవాడు. ఈ ప్రకారం జరుగుతున్నది. ఒకదినం ఆమె పినతండ్రికూతురు రొచ్చింది. సాయంత్రం రామారా వింటికొచ్చేటప్పటి కింట్లోవుంది. కుశలప్రశ్నలువేశాడు రామారావు. భోజ నాలవుతున్నాయి. భోజనాల ముందరా తర్వాతాకూడా అక్కబావల ప్రవర్తన ఆమెకు ఏమీ అర్థంకాలేదు. రాత్రి అక్క చెల్లెండ్లిద్దరు ఒక్కచోట పడుకున్నారు.

"అక్కయ్యా! బావా నీవూ అట్లా వున్నా రేమే?"

"ఏం! ఎట్లా వున్నాము?"

"వెనకటి అన్యోన్యం కనపడటం లేదు."

"అమ్మాయీ! పెద్దవాళ్ళయినతర్వాత చిన్నప్పటల్లే యెల్లప్పుడూ నవ్వుతూ పేలుతూ వుంటారుటే?"

"మనస్తాపాలు లేవు కద?"

"మనస్తాపాలూ లేవు గినస్తాపాలూ లేవు"

"పిల్ల పెండ్లి ఏమనుకుంటున్నారు?"

"వెతుకుతున్నాం. దైవఘటన వుండాలె కదా?"

"చూచారా యేమైనా సంబంధాలు?"

"చూస్తున్నారు, చేతనైనంతమట్టుకు. లగ్న ఘడియరావద్దూ? మనతొందర రెందుకు పనికొస్తుంది?"

మర్నాడుసాయంత్రం ఆమె వెళ్లిపోయింది. విశేష మేమీ అంతగా కనపడక పోవటం చేతనూ ఆమె చిన్నది కాబట్టి పెద్దవాళ్లకు తాను సలహా చెప్పటం గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిన ట్టనుకుంటారేమోనని నేభయం చేతా ఆమె నోరెత్త లేదు.

౧౨

పిల్ల ఎదుగుతున్నది. పిల్లను చూచినప్పు డల్లా సీతమ్మకు గుడ్లనీళ్లొస్తున్నాయి. పిల్లకు పెళ్లి కావడంకంటె లోకాని కెక్కువగా వెరుస్తున్నాది సీతమ్మ. స్వవిషయంలో లోకానికి ప్రసక్తి లేదని మనశ్శాంతి కలగ జేసుకునే పరిజ్ఞానం లేదు ఆమెకు. పిల్ల పెద్ద దౌతున్నకొద్ది యిద్దరికి మనస్సులు మరీ మరీ దూర మైపోతున్నాయి. భర్తతో గట్టిగా ప్రసంగిద్దామా అస లిద్దరికి తెగి పోతుం దేమో, సంసారంగుంభన చెడుతుం దేమో అనిభయం. నలుగురినోళ్లల్లో పడ టమేగా! రామారావుకుమాత్రం పిల్ల పెండ్లిచింత లేదు. ఏ మైతే అ దౌతుం దని ముడేసు క్కూచున్నాడు. ఇట్లా వుండగా ఒకనాడు పిల్లను కదల్చి చూతా మనుకుంది సీతమ్మ; కాని ధైర్యం చాలడం లేదు. క్రమంగా శారదకు జ్ఞానం వస్తు న్నది. వెనకటిమకురుతనం పోతున్నట్టు కన బడుతున్నది. ఇంట్లో అమ్మకు కొంచెం చేదోడుగా పనిపాట చేస్తున్నది. ఇల్లిల్లు తిరగటం కొంచెం తగ్గుతున్నది. పెద్దదా న్నౌతున్నాను. వేషభాషల్లో జాగ్రత్తగా వుండా లని మనస్సులో కలిగినట్టు సూచ నలు కనబడుతున్నాయి. చదువులోనూ సం గీతంలోనూ బాగా యెక్కొస్తూంది. తాళ యుక్తంగా పాడటం అలవాటైంది. ఎవ రైనా చూస్తే ఆమెను తప్పకవివాహం చేసుకుందామనిపించేట్టుంది. ఈమె యీడు వాళ్ళందరికి చుట్టుపట్ల పెండ్లిండ్లైపోయి నాయి. ఇక ఈమె ఒక్కతేమిగిలింది. తండ్రి దినమూ ఒక్కగంటసేపు చదువు చెప్పటం అలవాటు చేశాడు. సీతమ్మ ప్రైవేటు మా ష్టర్ను తీసెయ్యమని పోరు పెట్టేటప్పటికి తీసెయ్యాల సొచ్చింది. దినమూ వార్తా పత్రిక చదవటం నియామకం చేశాడు. అందుచే తామెకు లోకజ్ఞానం బాగా అభి వృద్ధిఅయింది. హైందవ నాగరకతలోవున్న నిగ్గు యేదో తెలుసుకున్నది. ఇటీవలకొన్నా ళ్ళనుంచి ఆమె తల్లితో ఘర్షణకే రావటం లేదు. తల్లికి సహాయం చేయనికాలంలో చదువు సంగీతం కుట్టు తప్ప యితరవ్యా వర్తి లేదు. ఎప్పుడైనా తండ్రితో కారమ్సు ఆడేది. ఇట్లా కొన్నాళ్ళు గడిచాయి. ఒక

సారి వాళ్ళయింటి తలుపులు మూడురోజులు మూసినట్టు లోకం చెప్పుకున్నారు. అప్పటినుంచి సీతమ్మ వాకిట్లోకి రావడమే మానింది. శారద పెద్దమనిషి అయినట్టు గుసగుసలు మొదలెట్టాయి.

ఇట్లా కొద్దిదినాలు గడిచినతర్వాత సీతమ్మ పట్టలేక ఒకనాడు "అమ్మాయీ" అని పిలిచింది.

రామారావు ఇంట్లో లేడు. సాయంకాలం మూడుగంట లైంది.

"వస్తున్నా" అని శారద లోపలికి వచ్చింది.

"నే నోవిషయం చెప్తాను, కోపం లేదు కద అమ్మాయీ!" అన్నది సీతమ్మ.

"ఏమీ లేదు. ఏమిటో చెప్పు."

సీతమ్మకళ్ళనీళ్ళు కార్చటం మొదలుపెట్టింది.

"ఎందు కమ్మా? అట్లా అకారణంగా ఏడ వడం?"

సీతమ్మ కింకా యేడుపాగ లేదు. ఏడుస్తూనే, "ఈడేరిన కూతురిని చూస్తూంటే ఏడుపు గాక ఏమౌతుంది? మీనాన్నతో ఏమైనా ముచ్చటిద్దామా అంటే గుండెలు గుబగుబలాడుతాయి. ఈవున్న గోడుకూడా చెడుతుం దనిభయం. నీవు బుద్ధిమంతురాల వైనావను కుంటున్నాను. నామాట వింటానను తల్లీ!" అంటూ యెదురుగా కూచున్న శారద చెయ్యి పట్టుకున్నది. శారద తలవంచుకొని "వినాలసినవిషయ మైతే తప్పక వింటాను" అన్నది.

"నీవు వివాహం మాడుతానని నా చేతిలో చేయి వేస్తే ఇక నేను కళ్ళ నీరు కార్చ నప్పు డను"

శారద మాట్లాడ లేదు.

"ఆడవాళ్లు వివాహం లేకుండా వుండటం చూశావా?"

"మన బ్రాహ్మల్లో మాత్రం చూళ్లేదు"

"ఎవళ్లల్లోనో వుండడం మన కెందుకు?"

"నెలదినాలకిందట నాన్న ఒకమా రీవిషయం నన్నడిగారు"

ఈమాట వినేటప్పటికి సీతమ్మకు కొంచెం ధైర్యము వచ్చింది. భర్తకూడా యీవిధమైన ఆందోళన పడుతున్నా డని తోచింది.

"నాన్న కేం చెప్పావు?"

"ఆలోచించి చెప్తా నన్నా."

"మరి ఆలోచించావా?"

"ఎంత ఆలోచించినా ఒక్కటిమాత్రం బాధిస్తున్నది నన్ను."

"నీమనస్సులో సందేహాలు తీరాలనీ నువ్వు వివాహమాడి మమ్మల్ని నలుగురిలో పడ య్యాలనేగా మాకుతూహలం!"

"అమ్మా! నీకు కోపం రాదు కద!"

"కోప మెందుకు తల్లీ?"

"గట్టిగా రా దంటే నే చెప్తా"

"ఇంకా యెట్లా చెప్ప నమ్మా"

"భయమేస్తూంది చెప్పటానికి. నిన్ను చెప్ప

టానికి గాని అగౌరవపర్చటానికిగాని నే నీసంగతి అనటంలేదని నాకు అభయహస్త మిస్తే!—"

"చెప్పు, నే నేమీ అనుకోనులే!"

"మి మ్మల్నిద్దరిని యింట్లో చూస్తూంటే నిజంగా నాకు పెళ్ళంటే భయ మేస్తూంది. నన్ను ను ప్వేమనుకున్నా సరే! ఇదే పెండ్లికీ దాంపత్యానికీ పరిణామ మైతే నాకు పెళ్లి యీజన్మలో కాదు గదా జన్మాంతరంలో కూడా వద్దు..."

సీతమ్మ మొగాన నెత్తురు లేదు. నిశ్చేష్ట రాలవుతుందా అన్నంత రక్తహీనమై పోయింది.

# నా రా ణి

**ఆమంచర్ల రామ మూర్తి**

సాంధ్యరాగపు సోయగమ్ములు
సంగ్రహించిన చెలియ లిద్దరు
మక్కువను నను జేర రాగా
మనసు చలియించె

పండువెన్నెలలోన వాయువు
పరుగులెత్తించెను గృహాంగణ
భూమి నాప్యాయముగ బహువిధ
పుష్పసౌరభమున్.

సాగరధ్వనిలోన తోచెను
సరిమెరుంగని నూత్నభావము
మారుతంబే యేరి తెచ్చెనో
మధుర గానంబున్!

భంగములపై నాట్య మాడెడి
ప్రణయగీతిక మహిమ మేమో
కతలు చెప్పెడి తీపి గొంతున
కన్నె నను బిలిచె

"మనసు పుట్టిన దాట లాడగ
మధురమౌ నీవేళ మిత్రమ!
చీట్లపేక యిదే" అటంచును
చెలియ పిలువంగా—

సకియకన్నుల కాంతిపుంజము
సరిగ దూగెడి పాలగచ్చున
సరియె యనుచును వారి జేరితి—
సమయమహిమమెమొ!

పంచి యిచ్చుచు నామె మెల్లన
పలికె కంకణక్వాణశ్రుతిలో
మృదుమనోహర మధురవాక్కులు
మేళవింపంగా—

"నల్లరా ణొక టిందు కల దీ
నాటి కదియే ముఖ్య పాత్రము.
మిగుల కుండగ నీకరంబున
మెలగ వలయు సఖా!"

"నా కరంబున మిగులుచో నది
నల్లరాణిగ నన్ను బిలువుము;
నిన్ను బిలుతును నల్లరాజుగ
నీకడనె మిగులన్."

ఆట లాడితి మేము మువ్వుర
మౌమనోహర సమయమందున
శరన్మోహన ధవళ రాకా
సాంద్రచంద్రికలన్

ఉబికి యిముడక ఊర్ధ్వగతిలో
ఉత్సుకము లగు హృదయములతో
మందగతులను పొరలిపాడెడి
మధుర గీతికలన్

కోమలాంగిని గాంచి ధీరత
గోలు పోవగ దగదను మ్మని
ఎరుక చెవిలో గుసగుసలుగా
నెందుటాకు రొదల్

వలపు వాహిని జిక్కిపోయిత
వలదు తలపగ తటము జేరగ
వ్యర్థయత్నం బనుచు నగియెడి
వరుణ జయఘోషన్

పరులమాటలు పాటిసేయకు
ప్రణయరహితము బ్రతుకు వ్యర్థము
వలపుజాడల నివియె గను మను
పవనజాలములన్

ఎన్నిసారులో ఆట లాడియు
ఇంతు లిరువురె ఓడి పోవగ
నిండు గరువముతోడ మెల్లన
నేను సుందరిని

చూచి నవ్వితి ఆమెయును నగి
చూడుమిదె నినుజేతు రాజుగ
నాదుప్రజ్ఞ కనుంగొనుమనియె
నర్మ గర్భముగా

పలుకులాడెను కన్నుగీటెను
ప్రణయవీక్షణ సహోదరితో
రామ లిరువురు కలిసిపోయిరి
రాజు నను జేయన్

పంచి యిచ్చుచు పడతి మెల్లన
పలికె నేదో మేము మువ్వురము
చాలవిధముల ప్రేమచర్చలు
సలుప సాగితిమి
"అది పవిత్రప్రేమ యెది యా
ధ్యాత్మిక మ్మగు అంతె కానీ
ఏది దేహమ్మునకు లోబడు
హేయ మగు నదియే!

గ్రంథపఠనమునందు నేర్చిన
కవులవాక్కులు వల్లెవేయగ
మగువ పలికెను మనసు చెదిపెడి
మందహాసముతోన్

అనువు నెరుగక ప్రేమకొరకు వి
యత్పథమ్మున సంచరించకు
చేతనైతే ప్రేమ చవిగను
చెలియ పెదవులలో

కన్య లనుటకు ప్రేమ మనగనె
కారణమ్ముల నడుగబోనకు
ప్రణయరూపలు కళారూపలు
ప్రమదలే నోయీ!

మానసిక మాధ్యాత్మికమ్మను
మాటవిరుపులు చేతకాకే!
దైహికము కాదేని ప్రేమము
తరుణు లెందులకో?

వారి సుందర మంజు దేహపు
వంపు లెరుగక వ్రాయ గలరా
సిద్ధహస్తులు సైత మంతటి
చిత్రపటములను ?

వారె సుకుమారంపు గనులని
వనజభవు డొక తృటిని గైకొన
సురభిళం బగు పారిజాతపు
సూనమయ్యెగదా!
వారియానన విపుల సంపద
వారిజమ్ములు నేర్చికొనియెను
వారి నూతన బహుళకాంతుల
వలచినది ప్రకృతి

సౌఖ్య సంపద సన్నగిల్లును
సాగిపోవదు కాలచక్రము
ప్రాణికోటికి పాలుపోవదు
పడతులే లనకు

జీవితం బొక బుద్బుదం బని
చెప్పుమాటలు నమ్మవల దిక
జీవితములో పడయు ప్రేమను:
జీవి శాశ్వతుడు''

మందమారుత వీచికలలో
మగువ పల్కులె గానమాయెను
ఆగృహాంగణ వేది అనుతా
గాలయ మ్మయ్యెన్

చెదరిపోయెను నామనోధృతి
చెలియ పెదవుల కదలికలలో
పవడముల శోణంపుకాంతులు
పట్టదలచు గతిన్

యువతు లిద్ద రటంచు మరచితి
ఒడ లెరుంగని వివశతను నే
పెట్టుకొంటిని ముద్దు చెంగటి
చిన్న కన్నియను

అరుణకాంతుల మెరసిపోయిన
దళివనయన ద్వంద్వ మాయమ
భామలు ముడివడ మబ్బు జేరెను
పూర్ణ చంద్రుండు

కరగివారెను నాశరీరము!
కాని మెట్లో వణకుచేతుల
తత్కరంబుల పట్టి యాయమ
దయను వేడితిని

క్షణికమే యగు రమణికోపము
కమ్రహృదయము రాగపూర్ణము
నెరపు గొలిపిన ధూమయోనులు
విచ్చిపోయినవి

చిన్నినవ్వున తేలిపోయెను
చెలియ యామె ప్రసన్నురా లని
అమల సంతోషాతిశయమున
అంధుడనె నైతిన్

ఇంతలోపల వేదికాస్థలి
నిర్భరమె మిగిలితిమి! మెల్లన
కర్ణగోచర మయ్యె హాసము
కంకణారవమున్

మరువజాల ని కెన్నటికి నే
మధుర మగు నానాటి రేయిని!
రాజుగా న న్నేలుకొన్నది
రాణి వేదికపై!

# ఉద్బోధన

## బుర్రా శేషగిరిరావు

భారత కుమారకుల ఆశీర్వదించి సభాస్తారులైన విద్వద్వరేణ్యుల అనుజ్ఞ వేడి ఈ నవ్యసాహిత్య పరిషత్తు మహాసభాధిపవేదిక నుంచి నా చేయంగల ఉద్బోధన.

ఈ మహాసభలో నా కాధిపత్య మిచ్చి గౌరవించినందుకు మీకందరికీ, పిన్నపెద్దలకు, సోదరసోదరీమణులకు, చాలా కృతజ్ఞుణ్ణి. పండితలోకప్రసిద్ధమైన వ్యావహారికాంధ్రభాషను సాహిత్యకల్పన చేయడములో నేనుకూడా అణుమాత్రపు సేవగా సాహసము చేసియుండి, "విమర్శాదర్శ" అనేముప్ఫై పేజీల చిన్న పత్రిక వ్రాసియుంటిని. దానికి కినుకవహించి, "ఆంధ్రభాషా సంరక్షకులు" మూడు వ్యాఖ్యాములలో నన్ను దీవించి, లాఠీపోటులతో మనయువకులకు జాతీయోద్యమములో నుపనయనమయినట్లు, నాకంతటితో నవ్యాంధ్రభాషాప్రవర్తకత్వమున కర్హత కలిగింది. నన్నుకూడా చాలామంది "నవ్య" సాహిత్యపరులలోనే లెక్కవేస్తున్నారు. కొందరు మిత్రులు నన్ను గ్రాంధికులలో కలిసిపోయినట్లు అనుమానిస్తున్నారని వినియుంటిని. నేటి ఆంధ్రపత్రికలలో రోజుకురోజు, బహుముఖములుగా ప్రవర్ధమానమవుతున్న వర్తమానాంధ్రభాషారచనలుచూస్తే, నాస్వల్పరచనలు చాందసముగానే తోచవచ్చు. నేనుమాత్ర మింకా వెనుకకు నడిచేవాడనైపోలేదని అనుకుంటున్నాను. ఇంతకుమించి నాకీ అధ్యక్షపదవి వచ్చుటకు ప్రత్యేకించి చెప్పదగిన కారణ మేమీలేదు. ఈ మచిలీపట్నమున కఖండఖ్యాతి చేకూర్చినవారును, కృష్ణాపత్రికను అతిసమర్థతతో, రసభావవిన్యాసములతో, నవ్యకావ్య సంపుటములుగా నడుపుతున్న విద్వద్వరేణ్యులును, మావర్తమానాంధ్రభాషాప్రవర్తక ప్రయత్నమునకు తొలుదొల్త భరవసా ఇచ్చినవారును, మామిత్రసత్తములును అయిన శ్రీ ముట్నూరి కృష్ణరావుగారుండగా నన్నీ అధిపత్యమునకు రావించుట మీకు నాయందుగల కేవలవాత్సల్యమే యనవలె. మరొకమాట. కౌమారము దాటిన మావంటివారినిగాక వ్యవహారికాంధ్రరచనా ప్రవాహవేగాని కాత్మశక్తితో తోడుకల్పించుతూన్న ఏభారతీ కుమారుడైనా, కుమారికైనా, ఇందుకు నియోగించినయెడల ఇంతకన్న తగియుముగాను, బస్తీమీద సవాలుగాను ఉండియుండేదిగదా! అయినా, తమరంతా ఇంత ఆదరాభిమానములతో చేసిన ఈగౌరవమును, నాకొసంగిన ఈ అవకాశమును, ఒకవిధమైన పౌరత్వబాధ్యత (Public duty)గా శిరసావహించి, తమకందరికీ నాకృతజ్ఞతాపూర్వకవందనము అర్పించుతున్నాను. నమో మహద్భ్యః!

నేటి ఆంధ్రసారస్వతములో నా కేపాటిదైనా కర్మక్షేత్ర మేర్పడడానికి ప్రోత్సాహకులైన మద్గురుత్రయము, (శ్రీ) రామమూర్త్యప్పరాయ రామానుజవరేణ్యులను, నాయీప్రసంగానికి మంగళాయమానముగా, ఉపక్రమణికయందు భక్తికముగా త్రికరణశుద్ధిగా సంభావించుతున్నాను. వారి ఆశీర్వచనబలము నాకీనాడు తోడై ఈ మహదవసరమున కనుకూలములగు భాషాభావనలను గ్రహించుతుంది గాక! నమో గురుభ్యః!

## సాహితీప్రచారము – కొత్తపాతలు

నేడు మన ఆంధ్రములో చాలామంది ఉత్సాహపరులు నవ్యనవనీతకోమల మానసులు, సాహితీవనవిహార విలాసులు, మృదుమధురపదవాక్య విరచనానిబద్ధచేతోవృత్తులు అయిన యువకులు కావ్యకన్యా ప్రణయపిపాసువు లవుతున్నారు. సహృదయుల మెప్పు పడయడానికి ఉత్సహించుతున్నారు. వారి రచనలలో సత్కవితాలక్షణమగు ఆత్మవిశ్వాసము దృఢముగా ఉన్నది. ఇంత దృఢమైన ఆత్మవిశ్వాస మింతమందినవకవులలో గాఢముగా తోచుతున్నప్పుడు, దానివల్ల నేజాతికి భావిభాగ్యోదయము సూచింపబడు తున్నదని మనము గ్రహించలేనియెడల, మనకు వార్ధక్యము మీరుతున్నదనిగాని, రసానుభవశక్తి సన్నగిల్లుతున్నదనిగాని అనవలసియున్నది. ఈ నవ్యరచనలపోకడలే మంచి చిత్రమైనవి. సూక్ష్మదృష్టిని పరికింపదగినవి. వీటిలో వ్యక్తావ్యక్తమైన రసవిశిష్టతా, "నూతన" స్వాతంత్ర్యమూ పరికింపతగ్గ గుణములు. వీటిలో అనేకములు నేను కొన్ని సంవత్సరముల నుంచి అప్పుడప్పుడు చదువుతూ ఆనందిస్తున్నాననియే చెప్పగలను. మంచిపద్యములంటే నాకు చాలాయిష్టము. నాపసితనములో మాతండ్రిగారు భాగవతములోని నారాయణకవచము చదివి నన్ను నిద్రపోగొట్టేవారు, మాతాతగారు నాకు 'దాశరథీశతకము' పద్యాలు చెప్పేవారు. అక్షరములు రాని మాతల్లిగారు నాకు 'గజేంద్రమోక్షం' పద్యాలుచెప్పేవారు. పద్యములుధారగా గుర్రంకదంతొక్కుట్టుగాని, వరద పారేటట్టుగాని, మృదంగవాద్యమువలెగాని వినబడితే నాకు శరీరము పులకరిస్తుంది. కొన్నిసంవత్సరముల క్రిందట అదే ఒకవ్యసనముగా పద్యకావ్యములు రాత్రి పగలూ తీరిక గలఅప్పుడల్లాచదివాను. అల్లిబిల్లి పద్యాలుకూడా అల్లి చించేశాను. నేటియువకవులగేయములలో నాకు చిరపరిచితములైన పాటల నరసలు వినబడుతున్నవి. కాని కవితా వ్యాసంగములున్ను రచనలున్ను నేడు మన ఆంధ్రావనిలో స్వాతంత్ర్యాదర్శసాధనములుగూడా కావలసియున్నవి. దేశికవితావిభూషణ శ్రీ కొండపల్లి జగన్నాథదాసుగారి 'నిరాకరణయంత్రం' అనేపాటయున్ను, వడ్డాది ఆంజనేయులుగారి 'దండాలు దండాలు భారతమాత' పాటయున్ను ఆంధ్రదేశమంతా కొంతకాలముకిందటనే మారుమ్రోగియుండలేదా? కొన్ని సంవత్సరముల కిందట కన్న ఇప్పటిలో ఆంధ్రములో గద్యపద్యములు రచించడానికి చాలా యెక్కువగా యువకులు యువతీమణులు మోజు చూపుచున్నారు. నవకవులు గ్రామములూ పట్టణములూ తిరిగి సభలుకూర్చి తమరచనలను గానముచేస్తున్నారు. పత్రికలు ధారాళముగా యువకవులరచనలు ప్రకటించుతున్నవి. మనఇప్పటిసాంఘికరాజకీయార్థికములలో వలెనే భాషారచనవిషయములో కూడా విశృంఖలమైన స్వాతంత్ర్యమునకు పరిణామమా విప్లవమా అనుసరణీయమైన మార్గమని భాషారచయితలు వివాదములు సాగించవచ్చును. ఏదోదారినిశ్చయించుకొని రచనలేసాగించవచ్చును. మన ఈ మహాసభలో రచనలకూ ప్రదర్శనములకూ విమర్శనకూ అవకాశమేర్పరచారు గనుకను, అధ్యక్షప్రసంగము విమర్శగానుండు ఉద్బోధమగుట ఆచారము గనుకను అట్టి ఆత్మపరీక్షకూడా అప్పుడప్పుడు వ్యక్తులకేగాక, సంస్థలకును ఉద్యమములకును శ్రేయస్కరమేగనుకను మనసాహిత్యరచనాప్రయత్నమెంతవరకెట్లు సాగుతూన్నదో ఎట్టి సంప్రదాయములలో ఇమిడికలిసియున్నదో కొంచము చూచుకొందముగాక! బౌద్ధజైనసంప్రదాయాలు మనభారతభూమిలోతలయెత్తి సనాతన వేదపురాణ ప్రసిద్ధమైన మతములో పందెముగా అన్నట్టు ప్రజలమనస్సులను ఆకర్షించి విజయవంతములై చెలరేగిననాడు సంస్కృత వాఙ్మయాన్నిటుండమని లోకవ్యవహారములో నుండిన ప్రాకృతములలోను "అనియమాద్గ్రామ్యంహి యత్యపభ్రంశః" అని వైయాకరణులు కేటాయించిన అపభ్రంశములోను ఆయానవ్యసంప్రదాయములను సమర్థించుతూ పండితులు దివ్యములైన

కావ్యములను రచించియుండిరి. అట్టి మహాపురుషుల ధైర్యసాహసములను మనహావభావ పరంపరలకు ప్రోద్బలముగా చేసుకొని మన పూర్వాంధ్ర సారస్వతాన్ని "భగవద్గీత"వలె పూజనీయమైన దానినిగా పటించి మనము ప్రస్తుతము నిత్య వ్యవహారములో వాడుకొనుచున్న "కథనభాష"ను వ్యావహారికాంధ్రమును ఆధారముచేసుకొని సాహిత్యరచన సాగించితే పూర్వాంధ్రసాహిత్యపరులకు కేవలము విప్లవమార్గముగానే తోచవచ్చు. గ్రామ్యాదేశమని శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు వాస్తవముగా నిరసింపదగియుండిన మార్గమది. కానిమన నవ్యసాహిత్య పరిషత్తుఅంతటి ధైర్యసాహసపు చరితల కింకా దిగలేదు. పూర్వాంధ్రసాహిత్యములో మనస్సు నుద్రేకమో ఉద్వేగమో కలిగించు రచనలవంటివగు "ఆంధ్రప్రశస్తి" "హంపీక్షేత్రము"లను బహూకరిస్తూనేఉన్నాము. వ్యావహారికాంధ్రసాహిత్యకల్పన మీదృష్టిని చూచినయెడల భారతీయ సంప్రదాయానికి విరుద్ధము కానప్పటికీ దూరదృష్టితో చుట్టు చూపున్ను వెనుకచూపున్ను జోడిచేసిచూసినయెడల పాతదిఅంతా విసర్జించే ప్రయత్న మెన్నడూ సాగినట్లు తోచదు. నాగరికప్రచారము కొన్ని శతాబ్దములనుండి కలిగియున్న జాతులలోమాత్రము పాతది అంతా తగలవేసి దాని బూడిద గాలికెత్తిపోసినా ఆ అణువులుకూడా నూతనసృష్టికి ఎరువవుతవని పలువిధములైన నీ ప్రాకృతకావ్యములలో ఉన్న తత్సమ సంస్కృత పదములే రుజువుచేస్తూన్నవి. ఇంకా పాతదని తత్సమము వదలుకొని కేవలము తద్భవదేశ్యములతోనే "శుద్ధాంధ్ర" గ్రంథములు చేసిన పాండితీధనులుకలరు. వారి పాండిత్యమహిమను కొనియాడవలసినదే గాని వారి కవనము అంత సులువుగా సాహిత్యపరులకే అన్వయముకావని అంగీకరింపకతప్పదు. ఇంతవను మించిన మస్తీపని తద్భవముకూడా తీసివేసి కేవలము దేశ్యములతోనే కావ్యకల్పనము చేయడం. ఈ అతిమానుషమైనపని చేసినజెట్టి శ్రీమదజ్జాడాది భట్ట నారాయణదాసుగారు. సంగీతసాహిత్యాలలో పండిపోయిన ఆటపాటలమేటి. ఈయన "ఉమర్ ఖయ్యాము" తెలుగుసేతలోనిది ప్రఖ్యాతమై కేవలము దేశితెలుగనుభాష స్వతంత్రముగా కావ్యకల్పనకు చాలినదని రుజువుచేసి "తెలుగుతనము" స్వాతంత్ర్యమును "బస్తీమీద సవాలుచేసి" నిలిపింది. ఇందుకు మనమంతా ఆమహాపండితుడికి కృతజ్ఞులముగా ఉండవలసినదే గాని ఆ "దేశితెనుగుసేత"కూడా సులువుగా బోధపడవలసి వస్తూన్నది. దీనికి కారణము మన వ్యావహారికాంధ్రముకూడా సంస్కృతమయమై ఉండటమే. కేవల పాటకజనము మాటలాడే భాష జాగ్రతగా విమర్శించినా అందులోకూడా చాలా సంస్కృత ప్రాకృతరూపములు "యాస" భేదముతో కనబడుతవి. అందుచేతనే మన ఆంధ్రులు హిందీకూడా నేర్చుకుంటే మన కిదివరకు సాహిత్య వ్యవహారములోనికిరాని కొత్తసంస్కృత ప్రాకృతములు నేటివిజ్ఞానాన్ని ఆంధ్రములోనికి దించుట కుపయుక్తములయ్యేవి చాలా లభించి మన సాహిత్య సామగ్రియెక్కువయి సంప్రదాయసిద్ధముగానేఉండును. కాని ఆంధ్రసాహిత్యరచనలలో సంస్కృత ప్రాకృతములను పాత మాటలనిగాని, పండితపదములనిగాని నిరసించి బహిష్కరించదలచుప్రయత్న మంత ప్రయోజనకారి కాదేమోఅని నాసంశయము. పదజాలాన్నిఎంచుకొనడంలో రచయిత తనఅభిప్రాయములను తానుద్దేశించిన చదువరికి సులువుగా అవి తెలియపరచగలవా లేదా అని చూచుకొనవలె. తక్కిన వితర్కములతో అతనికిపనిలేదు. మేము 1910 సంవత్సర ప్రాంతములో సాహిత్యరచనకు "శిష్టభాషా" ప్రసిద్ధాలైన పదరూపములును, కారకములును కూడా యోగ్యములేఅన్నవాదం లేవదీసినప్పుడు దానికి "గ్రామ్యవాద" మనీ "గ్రామ్యాదేశ" మనీతగని పేర్లుపెట్టి "గ్రాంధికభాషా సంరక్షకులు" నిందా ప్రచారము చేసినారు. మే మవలంబనీయములని వాదించిన ప్రయోగములు సంప్రదాయసిద్ధము లనిన్ని, సకలాంధ్రమండల ప్రసిద్ధములనిన్ని, ఆంధ్రకవిత్వములలోకూడా పూర్వు లుపయోగించినవేగాని లాక్షణికు లరసియుండని వనిన్ని మాప్రధానాచార్యులైన

శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు లాక్షణికులు కాదన లేని నిదర్శనములు చూపించి రుజువుచేసినారు. కాని గ్రాంథికుల ఛాందసత్వమూ, "లోకజ్ఞతా" శూన్యతా ఎప్పటివలెనే ఉన్నవి. కొంతవినా మారినట్లు కనబడదు. మా అప్పటి పరిమితవాదముకూడా పాతబడిపోయింది. ప్రస్తుత ప్ర ఆంధ్ర వ్యావహారిక భాషారచనలు అక్కడక్కడ సోవియటు ప్రొలెటేరియను లిటరేచరు (Soviet Proletarian Literature) మార్గము ననుకరించుచున్నట్లు కూడా స్ఫురించుచున్నది. గాని, మరొకమాట. ఇతరవిషయములలో వలెనే సాహిత్యములో కూడా మనలో అంతర్లీనములైన వ్యక్తి కులాన్వయ వాసనలున్ను, మనపెంపుదలో ఉపయోగపడిన సంప్రదాయములున్ను, మనసాంఘిక సాహిత్య సాహస సంస్కారములున్ను, మనము వదలుకొందామన్నా మనల నవి వదలవు. నాగరికతవల్లను, సభ్యతా శిక్షణవల్లను వాటిని కొంత కప్పిపుచ్చగలము. సున్నితముగా అణగదీయగలము. కాని కేవలము వదిలించుకోలేము. ఇది మానవచరిత్రలో సర్వకాలములలోను సర్వదేశములలోను నరనారీజన సహజమైఉన్నది. మనలోనే చూడండి. కొందరు స్త్రీ సంబంధమైన ఉపమానములు లేనిదీ పలుకలేరు. కొందరు శకారోక్తముగా నేతిప్పి మాటలాడజాలరు. కొందరు మోటుమాటలు దొర్లనిదీ ఒక్కవాక్యమైనా అనలేరు. కొందరి ఉపన్యాస ధోరణి వారిసంభాషణలో కనబడదు. పాండిత్య విలసితముగా అతి కోమలముగా గానమాధురిగల పదజాలముతో ఉపన్యసించగల ద్వివేదులు సంభాషణలో కేవల మసంస్కృతులైన గ్రామీణుల వలెనే మాట్లాడతారు. కొందరు కర్షకవృత్తిలో నున్న బ్రాహ్మణులు భారతభాగవత రామాయణములు పురాణము చదివి అర్థము చెప్పగలవారు కూడా పల్లెలలో తమతోడి కర్షకులవలెనే మాట్లాడుతారు. వ్యక్తివిమర్శ (Psycho Analysis) చేసుకుంటే దీనికి కారణములు తెలుస్తవి. కవిత్వములలో కూడా కవిచరూరా కనబడిపోతుంది "బొంగు బుజానవేసుకొని పోయెద మెక్కడికైన భూవరా" అని యొక యుద్దండకవి యొకప్పు డొక రాజాస్థానములో పలికాడట! ఎంత లేద పడిపోయిన భట్రాజు కవియైనా కినుకవహించితే ఫెళఫెళలాడే తిట్టుపద్యము చెప్పేవాడు; భూపతిఅయినా హాడిలేవాడు. శత్రువులవల్ల పరాజితుడై వెనుకబడి వస్తూన్న ప్రభువును "లేదలైవట్టి సరదార్లమీద గాక కలడె క్రొవ్వాడి బాదులాఖానుమీద" అని ఉల్లసముగాడి పగతురపై తిరుగగొట్టి జయముపొందున ట్లుత్సాహపరచి, విజయుడై తిరిగివచ్చినఅతణ్ణి "కటకంబు మొదలుక్కొని గోలకొండ పర్యంతము నీవకా విజయరామగజేంద్ర సురేంద్రవైభవా" అని అడిదము సూరకవి ఉగ్గడించినాడు. "ముగురాడువారమైతిమి". అని ఖడ్గతిక్కనపై అతని భార్య ఒకప్పుడు చెప్పినఉల్లసత్పద్యము మీరెరిగినదే. అందుచేత, పూర్వాంధ్రసాహితీ పరిచయము నేటికి సుమారు 800 సంవత్సరములు పైగా మన ఆంధ్రదేశములో పాటకజనములో కూడా, తరములవరబడిని, వ్యాపించియుండి వారి నిత్యవ్యవహారభాషలో కలిసిపోయియుండగా, దానిని వ్యక్తివిషయముగాను, జాతివిషయముగాను, కడకు కులమర్యాదగానుకూడా కేవలము వదలుకోజాలమనీ, అవిద్యాసముదయమును మన నూతన హేవభావములతోను ఆశయములతోను సమన్వయపరచుకొని మన ప్రయత్నములకు నూతన సాధనముగా చేసుకొనుట యుక్తమని తోస్తున్నది. మననవ్యసాహిత్యపరిషత్తువారి ప్రచురణము లేచూడండి; భాషాపరిశీలన చేయండి. పూర్వాంధ్రసాహిత్య సామగ్రి ఇందులో ఎంతకనబడుతున్నదో సరిక్రొత్తదేశ్య మెంత తక్కువగాఉండునో! అందుచేతనే గాబోలు "నవ్యాంధ్రసాహితీరచనా" సూత్రమును శ్రీ అప్పారాయకవిశేఖరుడు—

'గుత్తునా ముత్యాలసరములు - కూర్చుకొని తేటైనమాటల
కొత్తపాతల మేలుకలయిక - క్రొమ్మెఱుంగులు చిమ్మగా

అని గేయబద్ధము చేసినాడు.

## క్రొత్తపోకడలు

క్రీ. శ. 19 శతాబ్ది తొలిదినములలో ఆంగ్లసాహిత్యములో "రమణీయమైన ప్రతి వస్తువులోను శాశ్వతానందమున్నది" అనే ఆశయము మారుమోగింది. (A thing of beauty is a joy for ever.) కాని 20 వ శతాబ్దాదిలో యూరపులో- అందులోను ఇటలీలో-పాతరచనలకు నిప్పంటించినను తప్పులేదనీ వాటినిజూచి హర్షించుట వృథా ప్రయాసమనీ, ఒక వాదము బయలుదేరింది. దానికి "భావితవము" ఫ్యూచరిజమ్, (Futurism) అనిపేరు. "ఏవో రెండు మూడు కావ్యములు తప్ప పూర్వాంధ్రములో మిగిలినవన్నీ ప్రొయ్యినిడ వలయును" అని ఒక ప్రఖ్యాత విమర్శకులు వ్రాసి యుండలేదా? అట్లే 1912 సంll లో ఇటలీలో కొందరు "నవకవులు" బయలుదేరి, ఈ "ఫ్యూచరిజమ్" అనే సంప్రదాయ మొకటి లేవదీశారు. లలితకళలలో పూర్వులు చేసిన దృశ్యశ్రవ్య కల్పనలన్నీ భగ్నము చేసి వీర్యవంతమైన, సాహసవ్యాపారకీర్తనమైన క్రొత్తరచనలు సాగిస్తామని మత ప్రణాళిక (Manifesto) ప్రకటించారు. "ఒక పురాతన చిత్రమును చూచి మనహావభావములను వెలిబుచ్చుట చచ్చినశవములో మనజీవమును చొప్పించుటవంటిది. అందుకుమారుగా మనహావభావముల నుక్కిరి బిక్కిరిగా నొక నూతననిర్మాణములోనో, కార్యసంఘటనములోనో, వినియోగించుట మేలు.. లయిబ్రరీ అరలకు నిప్పంటించండి..... ...మ్యూజియములగుహాలలోకి ఏటికాలువలు మళ్లించిముంపుడుచేయండి" *అని యుద్బోధించారు. వీరిమార్గాన్ననుసరించి, రష్యాలో ఈసంప్రదాయమును లేవదీసిన మహనీయుడు మయొకొవిస్కీ (Mayokovsky) ఈతని యాశయము, కవిత్వమును కేవలము చదువురాని పాటకజనానికి తెలిసేటట్లు చేయడమే. రష్యాభాషలో వాక్యముల కారకము (Syntax) లోను, ఛందోగణనిర్ణయములలోను మార్పులు చేసి, కొంతవిశృంఖలత చేకూర్చుకొని, పద్యముల నడకలలో కొన్ని క్రొత్తవింతలు ఈయన చూపగల్గెను. కానిబుద్ధిపూర్వకముగా కావ్యభాషకు మెరుగూ, నునుపూ, తగ్గించి "గ్రామ్య"ము చేసినాడు-అనగా "పామరజనమాత్ర వ్యవహృతము"లైన మోటుమాటలతో ముదుగుభావములను, తలపులను, ఊహాపోహలను, కేవల పాటకజనములకు రుచించేటట్లు కూర్చినాడు. ఇవి "యెంకిపాటల"వంటి రచనలే. అంతకన్న విపులమైనవి, ప్రఖ్యాతమైనవి కూడాను. కాని మన "యెంకిపాటలలో" ఈఫ్యూచరిష్టు రచనలలో కనబడని "రసభావలాలిత్యము" కలదని అంగీకరింపక తప్పదు. అందుకే నేనన్నాను—పూర్వాంధ్రసారస్వతములోను ప్రసిద్ధములైన హావభావపదబీజములు మన పాటకజనహృదయములలో కూడా అంతర్లీనములై ఉంటవని. ఈఫ్యూచరిస్టు సంప్రదాయములో పామరజనుల నిత్యజీవితమును "ఉన్నదున్నట్టుగా" వర్ణించడమే ముఖ్యము. రచయిత కథావస్తువులో లీనమై పామరుడై పోయినప్పుడే దాని ఉత్కర్ష. ఇట్టి రచనాసంకల్పములతోను, ప్రగల్భములతోను, ఫెళఫెళలాడే ప్రణాళికలతోను ప్రారంభమయినప్పటికీ, ఇటలీలోగాని, రష్యాలోగాని ఈసంప్రదాయ మెంతోకాలము రెపరెపలాడజాలక పోయింది. అందలి సాహితీతరంగములలో ఒకపిల్ల అలయై అంతర్వాహినియై పోయినది. "జీవితరంగమంతా కళారంగముకాగల"దని ఈసంప్రదాయులు భ్రమపడుటయే దీనికి కారణము. ఇట్టి ప్రయత్నమువల్ల వీరి తక్కువతనపుభావనయే (Inferiority complex) వ్యక్తమైనది.

* To admire an old picture is to pour our sensitiveness into a funeral urn, instead of casting it forward in violent gushes of creation and action........... Set fire to the shelves of libraries! Deviate the course of canals to flood the cellars of museums" — Marinetti,

పూర్వసంప్రదాయములను అరిగించుకొని వాటికన్న మేలైనదారులు తీసినడవలేనివారే వాటిని నిరసిస్తారని వీరినిగూర్చిఒక విమర్శకుడంటాడు. అందుచేతనే మన నవ్యసాహిత్యపరిషద్రచనలలో కూడా పూర్వసాహిత్యమార్గములలో వాటిగుణవిశేషములను జ్ఞాపకముతెస్తూ నవభావరసభాసురాలైన రచనలు కొన్ని కనబడుతున్నవి. కాగా నవ్యసాహిత్య పరులు పూర్వాంధ్రకావ్యములకు నిప్పంటించనవసరంలేదు. వాటినిమించిన 'నిర్నిద్రసారస్యలీలాచాతుర్యము' గల రచనలు చేస్తేచాలు. కొందరుత్సాహపరులైన యువకులు 'పల్లెసాహిత్య' మనీ 'కర్షకసాహిత్య'మనీ 'కార్మిక' సాహిత్యమనీ కొత్తసాహిత్యశాఖలు తీయ నుద్యుక్తులగుతున్నారు. సాహిత్యము, శాస్త్రములు, చరిత్ర, భూగోళము, లోకజ్ఞానము మొదలైన కోటిజ్ఞానసముదయమంతా, చేతిపనులద్వారాను, వాటికిసంబంధించి ఏర్పరింపవలెననీ, అది పూర్వమార్గముగా గాక కొత్తమార్గముగా బోధించవలెననీ, అట్టి యత్నమున కనువైన కావ్యసృష్టిచేసి విద్యావిధానములోకి దించవలెననీ, ఒకమతము వార్ధాలో తయారవుతున్నది. ఇట్టి ప్రయత్నము కొన్నివత్సరములనుంచి రష్యాలోజరుగుతున్నది. దీనికే ప్రొలెటుకల్టు (Prolet cut) అనీ ప్రొలెటేరియను లిటరేచరు (Proletarian Literature) అనీ పేరు. ఈ సంప్రదాయము లేవదీసినఆన్ గర్డు (Onguard) పత్రికలో—కవిత్వము వర్గబద్ధమగు సంఘములలో ఏదోఒక వర్గమువారి ఆశయములకే లోబడి మానవజాతిలో అవర్గమువారి ద్వారానే ఆయుద్దేశములు నెరవేర్చును * అని ప్రకటించినారు. వర్ణాశ్రమధర్మబద్ధములైనా మన ఆంధ్రగీర్వాణసాహిత్యములపట్ల ఈనూత్నమువర్తించదని ధైర్యముగా చెప్పగలము. ఆంధ్రములో కవిత్వము మొదట బ్రాహ్మణవర్ణములో ఉద్భవమైనా పూర్వాంధ్రులలోనే క్షత్రియులు, వెలమలు, కమ్మలు, రెడ్లు, కంసాలులు, కుమ్మరలు, కాపులు, హరిజనులు, సాతానులు, సన్యాసులు, వీరశైవులు మొదలైన వివిధజాతులవా రెందరో బ్రాహ్మణులతో పోటీగా కవనముసాగించినవారు కలరు. పూర్వులలోకాదు ఆధునికులలో కూడాకలరు. హిందువులేగాదు క్రైస్తవులును ఇస్లామీయులును కూడాకలరు. ఈ సంప్రదాయి లింకొకవాదము పెట్టను. ప్రొలెటేరియన్ రీడరు, అనగా కార్మిక పాఠకుడు,— మేస్త్రీ, కమ్మరి, వడ్రంగి, సాలీడు, కుమ్మరి, రోజుకూలీవంటివాడు—సులువుగా చదువుకొని ఆనందించి బుద్ధివికాసము పొందడానికుపయోగించే సారస్వతమే సోవియటు రష్యాలో కావలసియున్నదిగనుక, అట్టి రచనలే ప్రచారములోనికి రాదగినవనీ, తదితరములు ఎంతఘనమైనవి అయినా, ఎంత ప్రాచీనములైనా, ఇతరమైన ఎట్టి గుణాతిశయములు కలవైనా, విసర్జనీయములే అనీ ఈవాదము. ఈమన ప్రాంతములోకూడా కొన్ని సంవత్సరముల క్రిందట ఇట్టి పిచ్చిఒకటి బయలుదేరింది. చెన్నపట్నం యూనివర్సిటీలో తెలుగు పఠనీయగ్రంథములు నిరయించు సంఘములో సభ్యులొకరు, పూర్వాంధ్రగ్రంథములపట్టిక ఒకటివ్రాసి, అందులో బ్రాహ్మణోత్కర్ష కలదనీ, అందుచేత అవిపాఠ్యగ్రంథములుగా పెట్టకూడదనీ, ఒకమనవితో పంపారు. దాని పర్యవసాన మెట్లు తేలినదో మాత్రము నాకు తెలియలేదు. ఒకవేళ అట్లుండినా పూర్వాంధ్రగ్రంథాలలోని ఆశయములు కేవలము బ్రాహ్మణుల ద్వారానే నెరవేర్పబడియుండలేదు. సాహిత్యములో ఇట్టి యుద్ధ్యంతరములు కల్పించుట అనర్థదాయకమని Trotsky నిష్కర్షగా చెప్పినాడు ఎట్లనగా—"Such terms as Proletarian Literature and Prole-

* The main thesis of the *Onguard* group ran that "in a class society, imaginative literature serves the objects of a definite class and only through that class of mankind."

tarian culture are dangerous, because, they erroneously compress the culture of the future into the narrow limits of the present day. They falsify perspectives; they violate proportions; they distrust standards; and they cultivate the arrogance of small circles which is most dangerous."— ఇట్లు నిర్దేశించుటవల్ల సాహిత్యము యొక్క భావివిన్యాసమును నేటి చిన్నచిక్కులలో కుదించుచున్నామనీ తారతమ్యములు పరిమాణములు విలువలు తారుమారు చేస్తున్నామనీ స్వల్పసంఘములకు తగని యహంభావ మలవరచుచున్నామనీ ఇదిచాలా ప్రమాదకరమనీ ఈయన అంటున్నాడు, వీరిరచనలు చూసినయెడల వీటిలో కళావిశ్వాసముకన్న ప్రచారకప్రయత్నము (Propaganda) ఎక్కువగా కనబడుతుంది. వీరిలో కర్షకులయు కార్మికులయు నిత్యజీవిత మున్న దున్నట్లుగానో సానుభూతితోనో వ్యాజస్తుతిగానో వేళాకోళముగానో జీవకళగల పాత్రలను కలుగుసంఘటనలలో వర్ణించడంకన్న సోవియటు రాజకీయసిద్ధాంతములను వారి మనసులలోని కెక్కించే ప్రయత్నమే ప్రబలముగా కనబడును. దీనివల్ల నేడు రష్యాలో సాహిత్య పరులకు కథల నెంచుకొనడంలో గాని వాటిని తమకు తోచినట్లు విన్యాసము చేయడంలో గాని స్వాతంత్ర్యము లేకుండా పోయింది. ఇట్టి ప్రతిబంధకములున్నప్పటికీ హృదయంగమములైన రచనలు సాగించగల గార్కీవంటివా రున్నాడంటే వారినూత్రములను కొంతవర కతిక్రమించడమే కారణమై ఉన్నది. కాలమును క్షణికముగా నెంచక ముందువెనుక లరసిచూడడమే. యెంతవరదలుకొండా మన్నా మనిషిఅయిన వానికి ముందువెనుక లరసి ప్రస్తుతముతో పోల్చిచూచుకొనుట తప్పనిసరియై యున్నది. గాలిలో యెగిరేపిట్టలకువలె మనుష్యులకు అఖండమైన నిష్కళంకమైన శాశ్వతమైన ఆనందము కలుగనేరదనిన్ని దీనికికారణము మానవుడు ముందువెనుక లరసికొనవలసిన వాడగుటయేయనిన్ని షెల్లీకవి కుమారుడంటాడు. అట్లే నేటి రష్యా సాహిత్య నిర్మాతలలో గణనీయుడైన గార్కీ (Gorky) రచనలలో పాశ్చాత్య లిటరేచరుకు కావలసిన గుణములన్నిటితో కలిసి రసద్యోతకముగు చిద్విలాసమూడా కలదు. ఎంతతేటగా ఎంతనిరాడంబరముగా, ఎంతఅలంకారరహితముగా ఎంత యథార్థముగాపదవాక్యసరణి కనబడుతున్నా రచనలలో "రసముచిప్పిలు"చుండుననుట అతిశయోక్తి కాదు. ఈయన జన్మచేత కార్మికుడు. పలుతెరగులైన పనివాండ్రతోను తుంటరులలోను తిరిగినవాడు. వారి జీవితములలోతుపాతులను సూక్ష్మదృష్టిని గుర్తించినవాడు. చూడండి "డాకు" పనివాండ్రను యెట్లు వర్ణించుతాడో—

"The granite, the iron, the wood, the harbour pavement, the ships and the men — all swelled the mighty strains of this frenzied, impassioned hymn to Mercury. But the voices of men, scarcely audible in it, were weak and ludicrous. And the men, too, themselves the first source of that uproar, were ludicrous and pitiable their little figures dusty, tattered, nimble, bent under the goods that lay on their backs, under the weight of the cares that drove them hither and thither, in the sea of sweltering heat and clay, were so trivial and small, in comparison with the colossal iron monsters, the mountains of bales, the thundering railway trucks, and all that they had created. Their own creation had enslaved them and stolen away their individual life.',

ఇందులోవున్న ఇంత స్వభావోక్తివర్ణనలోనూ గార్కీ (Gorky) చేయదలచిన జీవిత విమర్శ (Critcism of life) వ్యంగ్యముగాను, ఉక్తివిశేషముగాను కనబడుతూనేఉన్నది. "రియలిజం"అంటే యిట్టిది

గాని మిస్ మేయో తయారుచేసిన "గట్టరు"వస్తుసమీకరణంకాదు. కళావిలసితములైనరచనలవల్ల మన హావభావములకు వేగమే కాకుండా, వేడియేకాకుండా విన్యాసముకూడాకలుగవలె. చదివిన గ్రంథభాగమువల్ల అనేక తర్క-వితర్కములు, ఊహాలు జ్ఞాపకములు సంస్కారవాసనలు పోలికలు తారతమ్యములు తాదాత్మ్యాలు మనసులో ఉద్భవము కావలె. తన్నావరించియున్న మానవసంఘము యొక్క జీవిత మెట్లు పరిణమిస్తూన్నదా అని సింహావలోకనమునకు ప్రోత్సాహ ముండవలె. కావ్యమునుంచి కవి వైపున్న తనవైపున్ను ప్రపంచమువైపున్ను దృష్టి త్రిప్పబడవలె. అదీ సాహితీ రచనాలక్షణము.

## సాహిత్యము — సారస్వతము

సాహిత్యము సారసత్వముఅనే ఈరెండుపదములూ మనము లిటరేచర్ (Literature) అను మాటకు పర్యాయములుగా వాడుతున్నాము. ఇది పూర్వాంధ్రగ్రంథసంప్రదాయముగా ఉన్నట్టు కొన్ని ఉదాహరణములు చూస్తే నిశ్చయముకలుగుతుంది. (a) 'అభిమన్యుపరిణయ'గద్యలో 'సంగీత సాహిత్య విశారద'అని (b) 'అధ్యాత్మరామాయణ'గద్యలో 'సాహితీ విహారకళాదాన్వయతిమ్మనార్యకుమార' అని (c) 'ఉత్తరహరిశ్చంద్ర'గద్యలో 'శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వత విచిత్ర'అని (d) 'కృష్ణార్జునసంవాదము' గద్యలో 'తిమ్మనమంత్రి తనూభవ సరససాహిత్యవోబయామాత్య' అని (e) 'రాజవాహన విజయము' గద్యలో 'సరససారస్వత లహరీపరిపాక'అని (f) 'విష్ణుధర్మోత్తరము' గద్యలో 'శ్రీహనుమత్కటాక్షలబ్ధ......సహజ సారస్వత'అని ఇట్లెన్నిచోట్లనో కలదు. ఇట్టిపదములను మన పూర్వులొకేఅర్థములో వాడియున్ననూ నేటి మన విమర్శనలో వీటికించుక భేదముకల్పించి రూఢిచేసినయెడల ఉపయోగకారి అగునేమోఅని నాఊహ. 'సారస్వత'మనగా వాఙ్మయములో పుట్టిన వివిధములైన రచనలనీ 'సాహిత్య'మనగా అన్ని కావ్యగుణములను కలిగి రసాత్మకమై కాంతాసమ్మితతయా మనస్సు నాకర్షించే రచనలు మాత్రమేఅనీ ప్రత్యేకించినయెడల రచయితలకూ విమర్శకులకుకూడ అనుకూలముగా ఉండవచ్చు. అప్పుడు చరిత్రలు శాస్త్రములు లక్షణగ్రంథములు నిబంధనములు వ్యాసములు జ్ఞానబోధకములైన ఇతరరచనలు అన్నీ సారస్వతములో చేరుతవి. వాటిని విమర్శించడంలో శయ్యలు రీతులు పదబంధములు అంతగా గణనలోకిరావు. కేవలము ప్రసన్నత తేటగా తెలియడమే విచారణీయ మవుతుంది.

ఒకానొక సభలో శ్రీ మహారాజా విక్రమదేవవర్మ బహద్దరువారు పూర్వాంధ్రములో కవిత్వమున్నది గాని సాహిత్యములేదని పూర్వపక్షము చేశారు. సాహిత్యమనగా శృతిస్మృతి పురాణేతిహాసలక్షణాది జ్ఞానసముదయమంతా అని వారినిర్వచనము. కతగ్గాకతగ్గా దీనికి సమాధానము పూర్వాంధ్ర సాహిత్యంలోనే ఒకటిదొరికినది. దగ్గుపల్లి దుగ్గనకవిని నాచికేతూపాఖ్యానకృతిపతి సభలో యిట్లుగ్గడించిన ట్లా గ్రంథమందున్నది.

శ్రుతుల విహారదేశములు సుస్థిరవాక్యపద ప్రమాణ శా
స్త్రతతుల యిక్క లాగమ పురాణచయమ్ములకేళిసద్మముల్
స్మృతుల నివాసముల్ కవిసమీహితసత్కవితాగుణ ప్రసా
దితములు దగ్గుబల్లికవి తిప్పయదుగ్గని గద్యపద్యముల్.

మరోకవిధంగా చూసినా ఈఆక్షేపణ నిలవజాలదని తోస్తున్నది. మనపూర్వాంధ్రసాహిత్యములోనే వేదాంతము, వ్యవసాయము, నిఘంటు, కళలు, దర్శనములు, జ్యోతిషము, జీవితములు, ధర్మశాస్త్రము, కామశాస్త్రము, అర్థశాస్త్రము, రాజనీతి, వ్యాకరణము, ఛందస్సు, అలంకారము, ఇతిహాసము, పురాణము, స్థలమహాత్మ్యము, శిల్పము, రత్నపరీక్ష, ఆయుర్వేదము, ధనుర్వేదము, ఖడ్గశాస్త్రము, అశ్వశాస్త్రము, గజశాస్త్రము, పాకశాస్త్రము, యోగము, పశుపాల్యము, సస్యానందము, సంగీతము, మంత్రశాస్త్రము, శైవము, వైష్ణవము, శకునశాస్త్రము, రసతంత్రము మొదలైన చతుష్షష్టి విద్యలనుగురించిన గ్రంథములున్నవి కలవు. అముద్రితమైనసాహిత్య మెంతో ఉన్నది. కేవలము పద్యగద్యాత్మకము గానుండడం చేత దీనికంతా కవిత్వములో లెక్కవేసి అంధ్రములో సాహిత్యంలేదనడము న్యాయముకాదు. ఆయావిషయములలో అభినవజ్ఞానమును తెలియజేసే గ్రంథములుకూడా కావ్యమండలుల ద్వారా నేటికిని వెలువడుతున్నవి. విజ్ఞానచంద్రికామండలి మాతరములో ఈ విషయములో ఎంతోపని చేసింది. ఈ మచిలీబందరులోనే మిల్లు స్వాతంత్ర్యాదర్శము (Liberty) వంటిగ్రంథములు ప్రకటించిన గ్రంథమండలి ఒకటి ఉండేను. కాని ఆంధ్రభాషలోనే యూనివర్సిటీ విద్యఅంతా నేర్పబడవలెననే ఆశయము ప్రచురముగాఉన్న మన ఆంధ్రావనిలో కేవలకావ్యములకన్న జ్ఞానబోధకమైనవి పెద్దరకము గ్రంథములు చాలా వెలువడవలసిఉన్నదని మాత్రము మనమంతా అంగీకరించవలసినదే. ఆమహారాజుగారి విమర్శమనలను ఈప్రయత్నములో ఉద్రేకపరచును గాక! ఇట్టివిమర్శలు వస్తూన్నవి గనుకనే మనము 'సాహిత్యము' 'సారస్వతము' అనేపదములను విమర్శాపరిభాషలో ప్రత్యేకపరిచి రూఢిచేయదగునని మనవిచేశాను.

## సాహిత్యవ్యవసాయము—కొత్తపాతయెరువులు

మన నవకవులు సాహిత్యమును పూలతోటగాను కావ్యములను పుష్పఫలవృక్షములు గాను నిరూపిస్తున్నారు. 'పూలతోట' అనేకావ్యసముదయములో 'భావకవి'నిగూర్చి—

> తానొకండె భావాలతోద్యానమందు దోటమాలిగ భావించు; దోహదముల
> నూతనములైన ఫలపుష్పజాతిగణముఁ బెద్దసృజియింతునని విర్రవీగుచుండు.

అని వర్ణనకలదు. ఇట్టి వర్ణన పూర్వాంధ్రకవులు కూడా చేయకపోలేదు. చూడండి:—

> శ్రీమంగళాద్రి నృసింహుకృతల కటాక్షాంచలామృతో వృష్టి నంకురించి
> సంగీతసాహిత్యసరసప్రౌఢయుక్తి శాఖోపశాఖలఁజాలఁ బ్రబలి
> రసిక రాజన్యముఖ్యసమాజ బహుమాన, సతతవసంతాభిరతిఁ జిగిర్చి
> దైవనామాంకిత స్తవమనోహరభావ పదవాక్యసుమములఁ బరిమళించి
> యభినవస్థితి బెంపొందు నస్మదీయ భాగధేయసారస్వతపారిజాత
> తరువువనుఁ దగు సత్ఫలోదయము గాఁగ సముచితంబగు నొకప్రబంధము రచింతు.
>
> —అబ్బయామాత్యుడు : అనిరుద్ధచరిత్ర

పూర్వాంధ్రకవిత్వమునకు దైవభక్తి, గ్రంథపరిశీలన, సంగీతజ్ఞానము, మహనీయుల సమాదరణము, మనోహర భావపద వాక్యసముదయమూ ఉద్దీపకములుగా పేర్కొనబడినవి. ఇట్టి దోహదములతో పనిలేకయే మన తరములో చాలామంది యువకులు సాహిత్యరచనకు దిగుతున్నారు. గాలిలో ఎగురుతూ పాడేపిట్టలవలె తాముకూడా తమహృదయముల సహజధర్మాన్ననుసరించి కవితచేస్తున్నామంటారు. ఇట్టివారి రచనలను పూర్వకవిప్రసిద్ధములైన రచనలతో పోల్చడంలో చాలా ఔదార్యము

కావలె. కాని నవకవులు పూర్వులతో పోటీగా వారి రచనలను మించిన శోభగల కవనములు చేశామని సవాలుకొడితే మాత్రము తీవ్రపరీక్షకు నిలువవలసి వస్తుంది. కవిసార్వభౌమాంకుడు శ్రీకృష్ణ భారతకర్త నన్నయయెడల అలాటి సవాలు కొంతకాలముక్రిందట చేయించితుంటే ఎట్టి గౌరవము కలిగిందో నేను వేరే మనవిచేయ నక్కరలేదు. మన పూర్వాంధ్ర సాహిత్యములో గ్రంథములను పోలిన గ్రంథములు, పద్యములను ఫోటోలనదగిన పద్యములు ఎన్నో కనబడుతున్నవని మన నవీనులు కొందరంటారు. నేటి నవలలు, నాటకములు, చిన్నకథలు, ప్రణయగీతికలు, ప్రకృతిగానములు, ప్రణయసమాధులు, ప్రేమయాత్రలు ఎన్నైనా ఇట్టివి కనబడవనులేదా? కవితాసామగ్రి అంతా సమానమే అయినా ఒకరు కవితచెప్పినారని ఇతరు లూరుకోనక్కరలేదనీ అంతమించిన రచన చేయవచ్చుననీ ఒక పూర్వాంధ్రకవియే జవాబు చెప్పినాడు. చూడండి—

> మునుపటివారికంటె నొక బుద్ధిసమేతుడు గలవోవునే
> యని మది నూహసేయ దగ దందురు పెద్ద లొనర్చినట్టి వ
> స్తునికరముల్ త్యజించి కడు సుందరభంగి నపూర్వవృత్తి నా
> ఘునికులు సేయలేర యతి దుర్లభవాహన గేహజాలముల్,

—నల్లాని నృసింహాచార్యకవి : పద్మినీపరిణయము

ఇందులో ప్ల్యాజరిజమ్ జాడకలదని మాత్రము భ్రమపడకండి. ఆ గ్రంథములోనే ఈతడు పూర్వాంధ్ర సాహిత్యములలో ఎంతటి పాండిత్యము సంపాదించి ఇట్లన్నాడో నిరూపింపబడి ఉన్నది. కాగా ఆంధ్రకావ్యక్షేత్ర మెవ్వ క్తికిని యావజ్జీవపట్టాగా గాని వంశపారంపర్యపు పట్టాగా గాని భారతీదేవి ఏకభోగముగా వ్రాసి యివ్వలేదని పండితవరేణ్యులమనుకొనువారూ, నవకవులమనుకొనువారూ భావించి నేటి ఆంధ్రయువకవుల యెడల వాత్సల్యమును చూపుతారుగాక!

## దే శా భి మా న ము

పూర్వాంధ్రకవితలో ఇష్టదేవతాప్రసాదమువలె నవకవితలను దేశాభిమాన భాషాభిమానములు (ప్రోత్సాహకములై) ఉన్నవి. వీటిలో ఉద్దిష్టములుగానో ప్రత్యేకోక్తిగానో స్ఫురించుతున్నవి. కొంతకాలము క్రిందట దేశాభిమానగీతములు చాలా వినబడుతూవచ్చినవి. అప్పారాయకవిశేఖరుడుకూడ ఒక దేశాభిమానగీతం చెప్పినాడు. అయనరచన రొమాంటిక్రియలిజమ్ (Romantic Realism) అని వానిరూపణ. దేశాభిమానమనేది కేవలము రసభావప్రపంచమందే నిలిచిపోకుండా కార్యరూపము దాల్చవలెనని వారి ఉద్బోధన. చూడండి—

> 6 పూనుస్పర్ధలు విద్యలందే
> వైరములు వాణిజ్యమందే
> వ్యర్థకలహం పెంచబోకోయి
> కత్తివైరం కాల్చవోయి.
>
> 7 దేశాభిమానం నాకుకద్దని
> వొట్టిగొప్పలు చెప్పకోకోయి
> పూనియేదైనాను వొకమేల్
> కూర్చి జనులకుచూపవోయి

10 స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయ్.

కేవలము అయిడియలిస్టికు (Idealistic) గా ప్రోత్సాహమాత్రముగా కవితోద్దీపకమైన భాషగా ఈదేశాభిమానము "ఆంధ్రప్రశస్తి" "హంపీక్షేత్రము" వంటి నవ్యకావ్యాలలో కనబడుతుంది. మరొకచిత్రమేమంటే "ప్రణయగీతము"లలోని విషాదమువంటిది ఈచారిత్రకగీతములలోకూడా నిర్భరమైన శోకము వెల్లివిరుస్తుంది. ఇట్టి భావగీతికలకు మనతరములలో మార్గముతీసినవారు ప్రఖ్యాతులైన శ్రీరాయప్రోలు సుబ్బారాయకవి. టాగూరు కవిసమ్రాట్టుని గీతాంజలులమార్గమాంధ్రములోనికిదించి ఆంధ్రభావకవిత్వమునకు గానలాలిత్యమును లాంఛనము చేసినాడు. ప్రణయమునకూ ప్రేమకూ చైతన్యమతములోని ఉత్తమభక్త్యవస్థాస్వరూపమును రూఢిపరచినాడు. వారిప్రణయగీతికలలోని లాలిత్యముతోను గేయతతోను వారిచారిత్రకకవనములలోని "వీరరసభావభాసురత" తులతూగుతుంది. చారిత్రకగాథారచనలను చెప్పవలసినప్పుడుకూడా మాఅప్పారావుని స్మరించక తప్పదు. అందులోను విశేషించి ఆయన పౌరుషవంతమునకు పేరుపడని కోమటిజాతిచరిత్రమునుంచి కథతీసి నిత్యస్మరణీయము చేసినాడు. ఇది మనకవయిత్రులైన సోదరీమణులు వినతగ్గది. అబలాత్వములోని పరాక్రమమునకూ పురుషుని ప్రగల్భమునకూ తారతమ్యమును వ్యక్తపరచుతూన్నది "కన్యక" అనే చిన్నకావ్యములో "కన్యకాపరమేశ్వరి" కథనిమిడ్చిచెప్పుతు అగ్నిప్రవేశఘట్టము నిట్లు వర్ణించినాడు:

పట్టపగలే నట్టివీధిని పట్టబోరే జారచోరులు
పట్టదలచితి వింక నీవొక పట్నమేలేరాజనటరా!
కండకావరమెక్కి నీవీ దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దైవమంటూ వుండివూరొక్కనునా!
కులంపెద్దలుకూడి రదుగో అగ్నిసాక్షికి అగ్ని అదుగో
కన్నకోరినకన్నె యిదిగో బాలమేలొక్క
పట్టమేలేరా వైతే పట్టునన్నిపు డనుచుకన్యక
చుట్టముట్టినమంటలోనికి మట్టితాజనియెన్ ||
పట్నమేలేరాజుగర్వం మట్టిగలిసెను కోటపేటలు
కూలి నక్కలకాటపట్టయి అమరె...
పట్నమేలేరాజుపోయెను మట్టిగలిసెను కోటపేటలు
పదంపద్యంపట్టినిలిచెను కీర్తులపకీర్తుల్ ||

మానాభిమానద్యోతకమైన పౌరుషవంతమైన నేటి ఆంధ్రరచనలలో ఇంత తేటమాటలతో ఇంత పౌరుషవంతంగా ఇంతధాటిగా ఇంతఉత్తమనాటకలక్షణాలతో అంతకును మించిననిజమైన భక్త్యావేశంతో మతపవిత్రతతో చెప్పబడినపద్యములు చూపడం సులువైనపనిగాదు. ఇట్టి దీపని వానితనము. కాని "ఆంధ్రప్రశస్తి" "హంపీక్షేత్రము" వంటి కృతులలో పూర్వాంధ్రకావ్యములకు అలంకారాలైఉన్న ప్రఖ్యాతాంధ్రరాజులయు నాయకాగ్రేసరులయు ప్రతాపవర్ణనల పోకడలు వెనువెంటనే స్ఫురిస్తూంటాయి. ఆంధ్రజాతిపౌరుషవంత మనీ పరాక్రమము నెరపి ఉండినదనీ, అట్టి పరాక్రమము ధూళిధూసరితములైపోయి పాడుపడిన రాయిరప్పలనుండి

కూడా ఈతరమువారిని నుద్బోధించుచున్నదనీ దేశకాలపాత్రవ్యవస్థల ననుసరించి తిరిగే తలనూప గలదనీ ఈతరములోని ఆంధ్రపుత్రులనుత్సాహపరచడమే ఇట్టి రచనలతాత్పర్యము. గాని వీటిలో బైరన్ (Byron) కవికుమారుని (Childe Harold) చైల్డుహెరోల్డు కావ్యమందలి చారిత్రక విషాదమువంటిది కూడ జామలాగా ఉన్నది. అప్పారాయ కవి శేఖరుడు చూపినట్లు లేటమాటల మెరుగులతోకూడా ఇట్టి చారిత్రకగీతము వ్రాయడానికి నవకవులు యత్నించదగియున్నది. అప్పుడే వ్యావహారికాంధ్రభాషా సాహిత్యరచనకు ప్రఖ్యాతికలుగుతుంది. పరాక్రమవంతమైన చర్యలకు జగజ్జేగీయమానమైన ఔదార్యములకు పాశ్చాత్యప్రపంచమునకు దిగ్భ్రమకల్పించే కళానిర్మాణములకు ఆజిముఖాల ప్రాణాలొడ్డి ప్రభుభక్తిచూపగల సాహసములకు నిత్యోదయస్థానమైన మన ఆంధ్రమాతకు తేజాన్నిచ్చినది మతమే; పరమేశ్వర చరణారవిందసంసేవనమే. అట్టి పూర్వాంధ్రవీరవిభ్రాజితమైన మతాన్ని గూర్చి ఒక నవకవికుమారుడు

తరాలనుంచీ "దైవం" నీలో, నల్లమందుగా గంజాయీగా
మత్తెక్కించీ పై మరపించీ, ఊగిస్తున్నది వాగిస్తునది, ఆడిస్తున్నది పాడిస్తున్నది.

అని అంటాడు. దానికేమిలెండి ఏచెట్టుపిట్ట ఆకూత పలుకుతుందని సామెతఉందిగా. స్వత్వస్వాతంత్ర్యం దాల్చిన కవితలో కవిచహారా మరుగుపడజాలదు. అట్లుకాదు, ఇది ఏదోసోవియటులిటరేచరువాక్యములకు ప్రతిధ్వని అంటారా ? అదీ గాలి యెటు విసురుతున్నదో సూచించకపోదు. మతమే ఇట్టిదైతే దానికిట్టివారాదేశముచేసే "దేశాభిమాన" మనేదిమాత్రం అట్టిపనేగదా చేస్తున్నది నేటి పాశ్చాత్యరణరంగములలో ?

## నా చు రా లి జ మ్

మన కవితలలో ఆంగ్లకవితలలోనివంటి ప్రకృతిగానములు (Nature lyrics) చాలామందిచేసినవి పత్రికలలోను, పద్యసముచ్చయములలోను చదివియుంటిని. పూర్వాంధ్రకవిత్వములో లేని క్రొత్తవింత ఇదియొకటి నవ్యసాహిత్యములోనికి వచ్చిన మాటనిజమే, కాని పూర్వాంధ్రసాహిత్యమును నేచరు బ్లైండు (Nature Blind) అని నిరశిస్తేమాత్రము నేటి ప్రకృతిగానములకన్న "రసభావభాసురత" గలవాటిని పందెమువేసి చూపించవచ్చు. నూతనత్వమేమనగా ప్రకృతినే కావ్యవస్తువుగానూ ఇతివృత్తముగానూ ఎత్తివర్ణించడం. ఈమార్గము ఆంగ్లమునుండి మన మనుసరించుచున్నామనడం నిజమే. అందుచేతనే ఆంగ్లకవితాసంపర్కములేని వారికీ మనప్రకృతిగానములు సులువుగా అవగాహనచేసుకొని మనలను ప్రోత్సహించజాలకున్నారు. ఆంగ్లకవిత్వచరిత్రలో 19 వ శతాబ్దములో ఆయాకవులస్వానుభవ విలసితాలైన ప్రకృతివర్ణనలు ఎక్కువగా కనబడును. అదికూడా వారానాడు క్రొత్తగా తెచ్చిన మార్గమే. వాస్తవానికి మన ఆంధ్రదేశములో కనరాని ప్రకృతిరామణీయకము ఇంగ్లాండులో ఎక్కడగలదు గనుక ? అయితే మన యువకుల కీ విషయములో స్వానుభవము లెక్కువ కావలె. బలపడవలె. హీనుడు ప్రకృతిఉపాసన నిజమైన ప్రేమతో ఎక్కువగా చేయవలె. వర్డ్సువర్తు షెల్లీకవిత్వములలో - అనగా ప్రకృతి కవిత్వములలో - అంతయుత్కృష్టతా పవిత్రతా రసతరంగితత్వమూ కలగడానికి వారు యెడతెగకుండా చేసిన ప్రకృతిసాధనయే కారణము. వారు ప్రకృతి యోగులు. వారిలో వర్డ్సువర్తు (Wordsworth) సిద్ధుడు; షెల్లీ యోగభ్రష్టుడు.

మన కవు లీ ఆంగ్లకవుల జాడలను బాగా పట్టుకున్నారని మాత్ర మంగీకరింపక తప్పను.

"విరిసీరియని క్రొవ్విరి నరయుటకును ఎంతో సందియపడ స్పృశియింపగలమె?

వలపుల హరింపగలమె? యౌవనము నూత్న వికసితము కలుషహృదయము వెలుపులెందు"

ఇది వర్డ్సువర్తు (Wordsworth) కవి ప్రకృతినుండి నీతిని బోధించు మార్గము.

"పక్ష్య" అనే ఖండకావ్యములో కూడా ఈమార్గము కలదు:—

నగరుపాగ వెన్నెల చివళ్లు పంటనొక్కి ఓచకోరమ, రససిద్ధి నొందె దెంత!

మధుమధుపదార్థములలోన మమత పెంచి ఎట్టి శుష్కజీవనులమో యేము చూడు.

ఇందులో ఆంగ్ల ప్రకృతికవులు నేచరును మానవజీవితానికి గల భేదము చూపుమార్గము కూడా కనబడుతుంది. ఒక విచిత్రము చూడండి. చకోరములతోనూ కోకిలములతోనూ కవిత నింపినారని ఆంధ్ర ప్రబంధకవులని ఆక్షేపించు మన నవకవితాప్రపంచములలో కూడా మనము ఆపాత చకోరములనూ కోకిలములనూ వదలుకోజాలకున్నాము. మన పూర్వులు మనకు చేసిపెట్టిన అశృంగార రసోద్దీపక సామగ్రి ఈనాడు కూడా మనకెంత తోడునీడయై ఉన్నదో కొంచము సూక్ష్మదృష్టితో చూడండి. విశ్వనాథంవారి "అనార్కలీ" నాటకములోని "నిర్భరవిషాదము" (Tragic Intensity) ను ఎట్లు పూర్వప్రబంధమార్గములోనికి దించి శ్రుతి తగ్గించినదో చూడండి.

"కృష్ణవేణి" అనే కావ్యములో కూడా మన జీవితమునకును ప్రకృతి జీవితమునకును ఉన్న భేదము తేటగా స్ఫురించబడింది;—

"నీ కూలంకష వాక్ప్రపూరమున నెన్నే బిందువుల్ గల్గునో
నీ కన్నేళ్ళవయస్సు లేదటవె, వీనింజూడు షట్త్రింశకుల్,
వాకల్ కట్టుచు పొంగి పొంగి మరలన్ వర్షంబు వర్షంబునన్,
నీకౌమారము చాలెదే ఇతడో క్షీణించెన్ గదే యప్పుడే"

పందొమ్మిదో శతాబ్దపు ఆంగ్లయువ కవులు మానవజీవితములో లేని ప్రశాంతతను పొందడానికి ప్రకృతిని ఉపాసించినారు. ఆ ప్రశాంతతను క్షణికముగానైనా కని అనుభవించినారు. అంతవర కైనా జీవితములో వెలుగూ అమలమైన ఆనందమూ అనుభవించినారు. మన నవకవులు జీవితములో ఇంకా కాలు పెట్టీపెట్టకుండానే ప్రణయ విషాదాన్ని ఉపాసించుతు ప్రకృతి రామణీయకములను దాని కుద్దీపకము చేసికొంటున్నారు. ఇందులో ఏదో నిగూఢమైన వ్యక్తితత్వ మిమిడిఉన్నది. నాకు గోచరముకాలేదు, కొంతవర కిది ప్రపంచము యెడల నిరాశ (World Wieriness) అనదగియున్నది. బైరనిజమ్ (Byronism) వంటిది; కాని ఈరకము కవిత్వమంతా ఇట్లు సమర్థించ జాలము. ఈవిషయములో (Wordsworth) వర్డ్సువర్తు సిద్ధుడంటిని.

మరొకచిత్రము చూడండి. పందొమ్మిదవ శతాబ్దాదిలో యూరపులో కలిగిన స్వాతంత్ర్యోద్యమమున్ను మన తరములో కలిగిన మహాఘోర సంగ్రామమున్ను ఆంగ్లకవుల రచనలలో ఎన్నెన్నో రకముల జీవిత పరిశీలనములకు దించినవి. రచనలకు దీప్తిని అమరత్వమును ఉద్రేకమును కలిగించినవి. షెల్లీ కవి కుమారుని "వెస్టువిండు" (West wind) వంటి స్వాతంత్ర్యోద్బోధక గీతము ఒకటైనా మన నవ కవులనుంచిరాలేదు. ప్రపంచమంతా భారతభూమివైపు తిప్పి లోకానికి నూతన రాజకీయసూత్రము నిచ్చి దిగ్భ్రమ చెందించిన సత్యాగ్రహోద్యమము మనకవులను కలవరపరచలేదు. ప్రణయడోలికలనుండి వారి మనస్సులను కార్యరంగములోకి దించలేదు. మన నవీనులు "తారా శశాంక"కావ్యాన్ని సత్కావ్యమంటారే, అందులోని జీవిత సమస్యాసమర్థన మటుంచి, తాదాత్మ్యము చెందిఉన్న

శృంగారావస్థనుండి సోముడు యుద్ధరంగములోని కెట్లొక్కగంతువేసినాడో ఆకావ్యమందు వర్ణించి ఉన్నది గుర్తించండి.

ఇట్టి సంఘటనములు మన భారతభూమిలో సత్యాగ్రహసంరంభములో నరనారీజనములు నవనీత కోమలతను హృదయులెందరో చూపినారు. వర్ణించిన భావకవి ఒకడూ కనబడడుగదా! ఎందుచేత? ఎవ్వరెట్లు సమర్థించినాగానీ నాకు మాత్రము మన "కృష్ణు"ని "కృష్ణపక్షము"నకు కలిగిన ప్రసిద్ధియే యని తోస్తున్నది. అతని కవిత్వాన్ని వేళాకోళము చేసినవారూ, నిందించినవారూ, ఉన్నారు. కొందరు వ్యక్తి విమర్శకులు (Psycho analysts) దానిని "ఆటోఇరాటిసిజమ్"అని కూడా నిరూపించడం విన్నాను. ఎవరేమన్నా 'కృష్ణపక్షకవి'కి 'కృష్ణభారత కవికి'రాని ఆంధ్ర ప్రసిద్ధి కలిగింది. బైరనుకవి కుమారునివలె అతడొకనాటి ఉదయమయ్యేసరికి ఆంధ్రయువజన ప్రసిద్ధుడైపోయినాడు. అతని మార్గానుకరణములు అనుసరణములు బయలుదేరినవి. బయలుదేరుతున్నవి. అతని మార్గమనుసరించి ఒకరు "ప్రణయయాత్ర" వ్రాసిరి; మరొకరు "ప్రణయసమాధి" వ్రాసిరి. ఆకావ్యము వినిపించుతూన్నప్పుడు మిత్రులొకరు "అసలే భావకవిత్వము, అందులో ప్రణయసమాధి" ఇది. అక్కడక్కడ పద్యములు చదివితే తెలియదు. ఒకఘట్టమైనా పూర్తిగా చదవండి. అని ఛలోక్తిగా అన్నారు (అదియెంతవరకు నిజమో తమరే ఆలోచించండి) ఆంగ్లములో ప్రేమ గీతికలు (love lyrics) చాలఉన్నవి. వాటితత్త్వము కొంత పరిశీలనగా చూడండి. వాటిలో స్వానుభవములున్నవి; ఆత్మపరీక్ష ఉన్నది; మనసులో గందరగోళమున్నది; ఊగులాటలున్నవి; ఆశలు నిరాశలు మిళితములైఉన్నవి. భావతరంగముల పెరుగువిరుగులున్నవి, తుపానులున్నవి, మలయసమీరములున్నవి, ఎన్నో జీవిత పారమార్థికముల చింతనములున్నవి పంజరములో చిలకగిజగిజలాడుతూ కొట్టుకున్నట్లు కావ్యములో జీవికొట్టుకోవడం, ఎగరడము, పడడము, కనబడుతుంది. తిరస్కారభావము కనబడుతుంది. నిరాశలో కలిగే వికటహాసము కనబడుతుంది. ఒకప్పుడు కష్టభాజనమైన జీవితమువదిలించుకోగల సాధన చేజిక్కిన విజయవంతమైన ఆనందముకూడా కనబడుతుంది. మరొకప్పుడు రణరంగమున ధీరుడై వీరస్వర్గమునకు పోతూన్న యోధుని ప్రశాంతత కూడా కనబడుతుంది. మన ప్రణయగీతికలలో ఈమార్గములు క్వాచిత్కముగాఉన్నవి గాని వీటిలో నింతవరకు "కృష్ణకవి" "అప్పకవి" మార్గములే ప్రచురముగా నున్నవనక తప్పదు.

మరికొందరు, పాశ్చాత్యుల స్వచ్ఛందఛందోమార్గములను అనుసరిస్తున్నారు. ఇది ప్రబలమైతే ఫ్యూచరిజముపద్ధతి అనకతప్పదు. ఇటాలియను ఫ్యూచరిస్టు మ్యానిఫెస్టోలలో పాతఛందములను విచ్ఛిన్నముచేసి స్వేచ్ఛానుసారముగా ఛందోకల్పన చేయవలెననీ, అచ్చు వేయడంలో కూడా మార్పులు చేయదగుననీ అవసరమైతే ఒక్కపేజీలోనే 20 రంగులతో ముద్రించవలెననీకూడా వ్రాసినారు. పాశ్చాత్యుల యథేచ్ఛాగమన ఛందోమార్గమును మన యువకులుకూడా అనుకరిస్తున్నారు. కొందరు పాతపద్యములనే కొత్తరకముగా అచ్చువేసి కొత్తవిగా కనపరుస్తున్నారు. "వైతాళికులు" అనేకావ్యగుచ్ఛములో "రంభ" "కాపుపాట" "ఆ మెకన్నులు" "పూర్ణిమ"అనే గీతములు చూడండి. ఇట్టిరచనలకు మన "కృష్ణుడే" మొదట "భావగీతిక" లనిపేరు పెట్టినాడు. "ఎదిరియు అపూర్వమధురశక్తి స్ఫురియించుకొని అర్ధమ్ముకాని భావగీతమ్ములవి"అని అతని నిర్వచనము. విమర్శకలోకము పట్టుకున్నారు. "భావగీతములు" "భావకవిత్వము"అని నవ్యసాహిత్య ప్రయత్నమును నిరసించడానికి దీనిని "కాన్విక్టు" మెడలోని బిళ్ళగా మార్చినారు. వేళాకోళములూ, నిరసనములూ, కోరచూపులూ, దీవనలూ, ప్రారంభించినారు. మన కోమలహృదయులగు నవకవుల ప్రేమ

చూపులకివి కట్టుమంత్రములు కాలేకపోయినవి. "కవిసర్పగారుడములు" "కవిజిహ్వాబంధనములు" ఇంకా బయలుదేరలేదు. సంతోషించవలసినదే! అయితే ఈగ్రాంధికుల సంరంభమంతకూ కొన్ని కారణములు నాకు పొడకట్టుతున్నవి. నేను పొరపాటుపడితే దిద్దవచ్చు. ఇవి ప్రణయగీతములు చాలామట్టుకు కావడము ఒకటి; వీటిలో పూర్వ కావ్యప్రసిద్ధములైన గాథలను జైనబౌద్ధ సంప్రదాయములు పూర్వము యథేచ్ఛముగా మార్చినట్లు మన నవకవులు స్వమయాభిప్రాయసమర్థనమున కనుకూలముగా మార్చడము ఒకటి; వీటిలో పూర్వపు శృంగార ప్రబంధములలోని హావభావ విన్యాసమే ఆకావ్యసమయములతోను ఆసామగ్రితోను వేషముమార్చి కనబడడము ఒకటి; అందుతో కలిపి సులువుగా అవగాహనకాని విషాదప్రపంచము మిళితమై ఉండడమొకటి; ఏరెండుమూడుపద్యములలోనో పూర్వరచనలలోగల ప్రణయచేష్టావర్ణనము లీరచనలకు జీవికలుగా ఉండడమొకటి - వీటిలో విముఖులైనవారికీరచనలలో మన యువకవు లుత్సాహముతో ఓపికగా ఇమిడ్చిన కొత్తసొగసు లెట్లు కనబడతవి? ఇట్టి సంఘటనములు సాహిత్యచరిత్రలో కలుగుటకు కారణము గార్కీ-కథల ఆంగ్లానువాదమునకు పీఠిక వ్రాసిన గార్నెటు (Garnett) మహాశయు డిట్లు తెలిపియున్నాడు:—

Differences in the interpretation of an artist's spirit arise from the different standpoints of spectators ... ... If a writer shows men's animal natures getting the better of their instincts towards fineness, while life is not painted "as it ought to be" and beauty made synonymous with "moral effort," we (the English) complain of him as a "depressing" and "unpleasant" writer. Perhaps we do not deny the writer's truth, but the critics are apt to lable him "powerful but repulsive." The Russian speaking world, on the other hand, is quite intolerent of cheap idealism, and finds its satisfaction largely in those analyses of men's motives, good and bad, which show the insufficiency of "the moral law" dictate to nature and dominate it; the difference being that, to the Russian mind, it is normal to conceal or falsify the seamy facts in a world so constantly dominated by uglyness, while, to the English mind, it is immortal not to let fine character and conscience have the final word in the battle of life." ఆంగ్లరష్యామార్గములు భారతభూమిలో సంఘర్షణకు వస్తున్న ఈరోజులలో ఇవి ఎంతవర కాంధ్రజాతితత్వముతో సమన్వయింపగలవో చూడవలె. ఇందుచేత నేగాబోలు "సీత" "సావిత్రి" మొదలైన పూర్వ కావ్యప్రసిద్ధలైన పతివ్రతామతల్లుల జీవితములును మన నవకవులు మననాటిదుర్బలులగు నే పూర్వ పాశ్చాత్యాబలలనో అసలువారినో కావ్యములలోని వారినో మనస్సులలో నున్నవారిని పోలునట్లును వారి జీవితములవలెను దిద్ది తిరిగి చూపిస్తే కోపతీవ్రతకు గురి అవుతున్నారు. ఈపూర్వచరిజముపద్ధతి మనపత్రికలలో పడుతున్న చిన్నకథలలో కూడా గమనించదగిఉన్నది. ఇది చాలావరకు యూరోపియనుల జీవితములను దృశ్యములుగా చేసే సినీమాలనుచూసో, క్షణికానందము కలిగించడానికి పాశ్చాత్యసాంఘికాచారములను అలవాటులను అనుసరించి వ్రాయబడిన మ్యాగజీనుకథలను చూసో, మనయువకులు వ్రాస్తూన్నారనుకొంటాను. కాని హాస్యమని పేరుపెట్టి మనమట్టుకు మనము ఎవరికివారు చదువుతుంటే సిగ్గుపడవలసిన మార్గముగా ఇట్టి రచనలు సాగించడంవల్ల ఆంధ్రుల జీవిత మెట్లు ఇతరులకు పొడకట్టునో ఆలోచించండి, ప్రబంధములలో తమకు చిరపరిచితములైన హావభావములనే గదా మేము తేట తెలుగున పాఠకజనమునకు తెలిసేటట్టు వ్రాస్తు

న్నామని యీ కథలంటారేమో? ఆంధ్రలోకములో తరతరములనుంచీ పాటకజనానికి భారత భాగవత రామాయణాది పురాణముల గాథలు పదములుగాను పురాణశ్రవణములుగాను వినిపింపబడినవిగాని, ఇంద్రియలోలత్వము అనుసరణీయముగా బోధించు లేక రూపించు గ్రంథము లేవీ పురాణము చెప్పబడలేదే. -తమతరించి ఇతరులను తరింపజేయాలనని మన సాంప్రదాయము, తమరింద్రియలోలత్వములో మునిగితేలుతు జీవితపరమార్థమును మరచి, ఇతరులను కూడా అట్టి మరిపింతలోనికి దించదలచడం యేమి యుక్తమైనపని? ఆంధ్రనారీమణులు యువకుల యింద్రియలోలత్వాన్ని ఉద్రేకపరచడానికేనా సృజింపబడినారు? వారిలో ప్రతిఫలించుతూన్న దేవత్వమును(Divinity) పురుషుని నరకమునుండి ఉద్ధరింపగల శక్తియు మనము కీర్తింప నక్కరలేదా? "సీతాపతిత్వము"రామునకంత తేరగా లభించినదా? ఆమెయే లేకుంటే రాముని జీవితమునకు సార్థకతయేదీ? ద్రౌపదివల్లగదా పాండవులఉత్కర్షఅంతా జగజ్జేగీయమానమైనది? నరనారాయణులకుకూడా అమరత్వము చేకూర్చినది. ఆంధ్రయువకులారా, నారీజనతత్త్వమునకు పైన ఆజీవితములయందలి యౌన్నత్యమును ఔదార్యమును గుర్తించి తమనవ్యగద్యపద్యములలో భారతీయ స్త్రీత్వాదర్శము (Indian ideal of womanhood)నకు వన్నె తెచ్చు రచనలను సాగించండయ్యా! తమ జీవితములు ధన్యతములవుతాయి! పురుషుల గౌరవమాలోచించి, తమమామగుల యెడలను సోదరులయెడలను గలవాత్సల్యముతో, మీ స్త్రీలోలతకు చింతిల్లుతు, పిచ్చుకమీద నా చంద్రాయుధములన్నట్లు, తమ యాగ్రహోకేకరచనలను మీపైని ప్రయోగించుట కుపేక్షించుతున్న కవయిత్రులాంధ్రలోకములో గలరని మరవకండి! ఆయబలారత్నములే తమ యాత్మగౌరవము కాపాడుకొనవలసిన తరుణము కలిగినదని యెంచి గద్యపద్యాస్త్రములు మీపై త్రిప్పదలచితిరా,—పర్యవసానము పూర్వయుగములలో వలెనే తిరిగీ కలుగగలదని నమ్మండి.

మన యువకులు పాతఛందస్సులను పూర్వకాలపు ఆభరణాలవంటివని నిరసించుతారు. వ్యావహారిక ఆంధ్రము పదములకును మాత్రాఛందస్సులకును కుదిరినట్టు సాంస్కృతికఛందస్సులకు కుదరడము కష్టమని అప్పారావుగారు అనేవారు. ఇట్టి ప్రయత్నములో మనయువకులు మనపూర్వపుపాటలను పరిశీలించి తమ నూతనరచనలకనువగునట్లు సంస్కరించుకొంటున్నారు. ఈ ప్రయత్నములో అనేకవిధములుగా రచన సాగుతున్నది. "రుధిరజ్యోతి"లోని "దేశమాత" గీతము చూడండి. నండూరివారి రచనలు ప్రసిద్ధములే. అవి మొదటిలో పత్రికలలో పడినప్పుడు వాటి ప్రభావమెంతవరకు వెళ్లినదంటే కొందరు యువకులు తమభార్యలను గురించిప్రసంగములలో "నాయెంకి" అని కూడా అనేవారు. ఇంతప్రసిద్ధిపొందినా "యెంకిపాటలు" సంపుటములకు చెల్లుబడిలేక బీరువాలఅరల అలంకరించి ఉండటము చూశాను. ఇది యెందుచేతనో తమరంతా ఆలోచించవలసియున్నది.

ఈపాటల వాఙ్మయ మింకా అనుకరణావస్థలోనే ఉన్నది. కొందరు మువ్వగోపాల పదముల వంటివి కూడా వ్రాస్తున్నారు. అంతేకాదు వాటి అభినయము మీదికికూడా మనదృష్టి మరలుతున్నది. కాని కాపమాటలతో వ్రాసిన ఈ వాఙ్మయము కర్షక సాహిత్యముగాని కార్మిక సాహిత్యముగాని కాజాలదు. (Tennyson) టెన్నిసన్ నార్దర్న ఫార్మరు (Northern Farmer) వలె మాండలికముయి పోగలదు. ఇంతకూ హరిహరీ నారాయణ పదములవంటివీ, రామదాసు బందిఖానావంటివీ, బొబ్బిలిపాట వంటవీ, స్త్రీల పాటలవంటివీ, గొల్లసుద్దులవంటివీ, భాగోతపు దరువులవంటివీ, కందార్థతత్త్వములవంటివీ యెన్నో పాటలు పామరులకుకూడా సులువుగా తెలిసే నాగరక వ్యవహారభాషను జానపద లోకప్రసిద్ధములై ఎన్నితరాలనుండియో వస్తూండగా, కేవలము పామరజన

వ్యవహారికాలైన మాటలతో పాటలు చేయడం అంత సంభావ్యం కాదేమో అనుకుంటాను. "గౌరమ్మ" పాటలాగ వెలాకోలాని కట్టి రచన ఉపయోగించవచ్చు. ఉపయోగపడుతున్నది. గాని "యెంకిపాటల"కు వ్రాసిన పీఠిక చూస్తే అందులో ప్రయత్నము వెలాకోలంగా తోచదు. అనుకంపతో ఉద్దీపింపబడ్డరచన. అనుకంపాతిశయంవల్ల కొన్ని కొన్నిచోట్ల అశ్రుధార లాలికించుతుంది. ఇదికూడా నవ్యసాహిత్యములో నూతన ఛందోమార్గాన్వేషణమే! నిజమైన ప్రొలిటేరియను లిటరేచరు ఉదాహరణ మనవచ్చు. ఇందులో మన ఆంధ్రములో ఏరకపు ప్రొలిటేరియను మార్గానుసరణము హృదయంగమం కాగలదో సూచనఉంది. ఈ దృష్టిని చూస్తే ఈసప్రయత్నాన్ని అంత సులువుగా తుడిచివేయ జాలమని తోస్తుంది. భావిపరిణామ మెట్లుంటుందో పరికించవలసి ఉన్నది. పాత పద్యగతులు కేవలము విసర్జనీయములేనా అనే విషయమున ఒక ఆంగ్ల విమర్శకు డిట్లంటున్నాడు:

" We must not go on to make the mistake that a metre once used is used up. A form, a metre, a stanza may be used a hundred times by a hundred writers, and each time with originality if it expresses each time a personal vision. We are happy in having an example close at hand. One of our oldest and most familiar metres, one of the few in which thouands of lines have been written, is the Rhyme-Royal of Chaucer. It was in this metre that William Morris told some of the dreamiest tales of his Earthly Paradise. In this metre only a year or two ago was written a poem called "The Widow in the Bye - street." Mr. Masefield has there treated a story of man's oldest passions in their newest setting. It is a story of amaging range and since the poet has things to say that Chaucer never thought, he uses that metre with a freedom to which Chaucer never attained. In the last section alone of that poem there are passages of simple narrative, similes, the phantasmagoria of a dying brain, the terse and poiquent dialogue, — eight speeches in a single stanza,—a sombre Trial at Law, death sentence and execution, and a final scene in flowery uplands, idyll and tragedy mingled in a beauty that is beyond description. Through all these changes "there is no check, no jar, no flow in the sincerity of expression. The metre may be of any emotion you please; the vision, the voice, the rhythm, the life of the poem are altogether of today."

ఛందోవిషయములలో "కొత్తపాతల మేలుకలయిక" అంటే యిట్టిదని నాఊహ. మన పూర్వకవీశాంధ్రరచనలలోకూడా విమర్శకు నిలిచేవి ఇట్టివి చూపించవచ్చు. రెండు ఉదాహరణములు:— భారతయుద్ధానంతరం ధర్మరాజు అశ్వమేధయాగంచేసి మనశ్శాంతి చేకూర్చుకొని హస్తిపురంలో ఉన్న రోజులలో తీర్థయాత్రలు చేసుకుంటూ వచ్చిన విదురునికి సముచితాతిథ్యాదరములిచ్చి కుశల ప్రశ్నచేసిన అంశము భాగవతములో ఇట్లున్నది:—

ఉన్నారా ద్వారకలో సన్నారా యదువు లంబుజోదరుకరుణన్
గన్నారా లోకులచే విన్నారా మీరు వారివిధ మెట్టిదియో

ఈ పద్యము చాలామందికి గుర్తులోఉండకపోవచ్చు. కాని ఇది చదివినప్పు డాంధ్రసాహిత్య పరిచయముగలవారికి "విజయవిలాసము"లోని—

మీ రింద్రప్రస్థము గనినారా పాండవుల జూచినారా సుఖులై
వారందరు నొకచో నున్నారా వీరాగ్రగణ్యు నరు నెరుగుదురా

అనిశ్రుతకటయతితో సుభద్ర చేసిన కుశల ప్రశ్న కందము జ్ఞాపకము వస్తుంది. ఏనాటి పోతరాజు; ఏనాటి వెంకటకవి? ఓరంగలెక్కడ, తంజావూరెక్కడ? కాని సాహిత్య సామగ్రి ఒక్కటే, వస్తువు ఒక్కటే, ఛందస్సు కూడా పూర్వ ప్రసిద్ధమయినదే, వందల సంవత్సరముల వరబడిన సాహిత్యములో అరిగి పోయినదే అవాలి గదా! అయితే వెంకటకవి చెప్పిన కందములో అంతపసవిశిష్ఠత యెట్లువచ్చినది? సంఘటనము వేరు, దృశ్యము వేరు; కుశలప్రశ్న కందమైనా అట్లు నడచిందిగనుకనే రఘునాథ భూపాలునిచేత "చేమకూర పాకమున పడ్డది" అని మెప్పును పండితాకీర్ణమైన నిండుసభలో పొందగలిగినాడు. ఆంధ్రసాహితీతత్పరుల మానస రంగములలో ఈకంద మిప్పటికిని వినబడుతూనే ఉన్నది.

ఇట్లే పాతబడిన వనబడే ఛందస్సులలోనే జాషువాకవి నిరుపేదయొక్క నేటి దుర్భరదారిద్ర్యమున్ను దానివల్ల అతనికి కలుగు హావభావములున్ను ఎంత సకరుణంగా రచించినాడో వినండి:—

"తిరిపెపుదమ్మిడీ తనివిదీపముగా వెలిగించి దీపమే
యెరుగని నాపటీరమున నృత్యమొనర్చు మహాపిరాటి చిం
పిరితల చిక్కులమ్మ తరబీయుతు జేసెడి నన్ను నుర్వికిం
బరువుగ గబ్బిలాయిగ తృణంబుగ జుల్కనగా హుళక్కిగా."

"చెరుకుంబిండిన లీల నాబలము నోడ్చెన్ గానుగం బట్టి యీ
పిరిపో దెమ్ములప్రోవు నిల్చినది నావేషంబు సీక్షించి నా
సరసన్నిల్చుట కేవగించుకొని జ్యేష్ఠాదేవి భీతిల్లె నిం
కొరు డేలాగున నిష్ఠరించు నిపు డోహో! వింత ధన్యాత్ముడన్."

## నవ్య నాటక రచన

కవనములను కథలను అటుంచితే మనవాంధ్రసాహితీ ప్రయత్నములో సాగుతూవున్నది నాటకరచన. మనవారు రచిస్తూన్న "పద్యనాటిక"లను గూర్చిగాని "సినిమా నాటకము"లవంటి వాటినిగూర్చిగాని అంతగా చెప్పనవసరంలేదు. అవి ఖండాంతరములలోకూడా ప్రయత్నమాత్రములుగానే ఉన్నవి. రచనా మార్గములుగా దృఢపడలేదు.

ఇట్టి ప్రయత్నములు చేయడంమాత్రము ప్రశంసనీయమే. గతానుగతికముగా రచన సాగించడంకన్న ఏ నూతనమార్గము ననుసరించి స్వతంత్రించినా మేలే. కాని చేసిన ప్రతీరచనా ప్రకటించడము సాహసమైనపని. యతిప్రాసలువదలి సాంస్కృతిక ఛందములలోను పూర్వప్రబంధమాదిరిగానది కొత్త కథ నేటి జీవితములోనిది, విద్యార్థిప్రపంచములోనిది తీసుకుని అందులో నేచరు అలిగరీ (Nature Allegory) కూడా కలిపి "కమల" అని పేరుపెట్టి ఒక పెంకి ప్రబంధము కొన్నాళ్ళ క్రిందట వ్రాసినాను. మిత్రులకు చదివి వినిపించాను. కాని కొన్ని సంకోచములు వదలక అచ్చువేయలేదు. అలాగే "చిత్రాంగి" అనే నాటకము సారంగధరుని కథనే ఆధారముచేసి హిస్టారికో సోషల్ ట్రాజెడి (Historico Social Tragedy)గా గద్యమయంగా వ్రాసినాను. ఆడించాను. గాని ఇంకా సాఫుచేయవలసిన అంశములు కనబడుతూండడంచేత ప్రచురించలేదు. "బొబ్బిలి" నాటకకొన్ని

ఆనాటి రాజ్యాంగపరిస్థితులకూ చరిత్రపురుషుల సత్యజీవితానికీ అదర్శమునకూ ప్రతిబింబముగా ఉండేటట్లు అప్పటి వ్యావహారికాంధ్రమున రచించే ప్రయత్నము చేశాను. ఇంకా సమన్వయములు సరిచేయవలసియుండి ప్రచురించలేము. అనార్కలీ నాటికను ముద్దుకృష్ణగారు ఎన్ని వారములలో వ్రాసి ప్రచురణకు సిద్ధం చేసినారో గాని అది ప్రతివాక్యమూ విమర్శగా చూచుకుంటూ చదివినకొద్దీ వారు పడిన శ్రమ నాకు అవగాహన అవుతూ ఉన్నది. లోపములకేమి లెండి, మనము కుర్చీలో కూచుని, సిగరెట్టుపొగ వదలుతూ, ఆ ధూమపరిణామములకు సంతోషిస్తూ ఆ అక్షరమీలాగుంటే బాగుండును- ఈ స్టేజిడైరెక్షన్ ఇట్లు మారిస్తే బాగుండును, అని రిమార్కులు చేయవచ్చు, డిప్టీఇన్‌స్పెక్టర్లవలె. కాని, రచయితలముగా చూచితే మాత్రము, ఆయన నెంతో అభినందించక తప్పదు. నేను మనవి చేయదలచిన దేమంటే, మనము వ్రాసిన ప్రతీరచనయున్న పత్రికలో చూడవలెనని యత్నించకూడదు. మనకే మంచిదికాదు, చదువరి మాటకేమి. ఒకవేళ అచ్చువేసినా, "మిత్రులకొఱకే" అని కొన్ని ప్రతులే వేయించితే మంచిది. హంపీక్షేత్రములో విశ్వనాథంవారేమంటున్నారో చూడండి—"ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభగరీయసి. దేశమునంతయు హూణవిద్యా వ్యాసంగియగుటచేత తెనుగుకవితకు వలసిన వ్యుత్పత్తి నూటికి తొంబదిపాళ్లు ఆంధ్రసంస్కృతభాషాశ్రియ యగుటచేత నేటికాలపు ప్రతిభాశాలురగు కవులకు వ్యుత్పత్తిలోపము కనబడుచున్నది". అని ప్రతిభావంతులని యీ పీఠికలో ఒప్పుకొన్న రే "ముగ్గురు నలుగురు" విషయములోనే ఇట్లున్నదంటే నవయిత రాంధ్రకవులనుగూర్చి ఏమనాలి! గాని "ప్రథమప్రయత్నము"లు చేసే యువకులుకూడా, వాటిని ఏ "భారతి" లోనో "ప్రతిభ" లోనో ప్రకటన కావడమే ముఖ్యమైన ప్రోత్సాహముగా ఎంచుతున్నారు. నవ్యాంధ్రసాహిత్యాభ్యుదయానికి ఇదిఎంత ఉపయోగకరమో తమరంతా యోచించవలసియున్నది.

నాటకరచన, నాటకవిమర్శలలో కూడా ఆంగ్లమర్యాదలను,—అందులోనూ ఆంగ్లప్రాచ్యగ్రంథమర్యాదలను మన యత్నముల కాధారము చేస్తున్నాము. వీరేశలింగంగారి తరమువారు వ్రాసిన ఆంధ్రనాటకములలో షేక్స్పియరు కవి నాటకముల జాడలు చాలా కనబడతవి. అయినప్పటికీ, మన మీ ప్రాచ్యగ్రంథ పంజరములనుండి వెలువడి, నేటి పాశ్చాత్య నాటకరంగమును కలయచూస్తేనేగాని మన మాంధ్రములో నవ్యనాటకరచన సాగించడానికనువైన మంచి పాదుగొని కూర్చుకొనజాలము. ఇప్పటికి కౌమారము దాటివచ్చిన మావంటివారము నాటకములలో విషాదమయములే, ట్రాజడీ (Tragedy) లే ఉత్తమమనీ, ఆంగ్లభాషలో, ట్రాజడీలలో, షేక్స్పియరుకావ్యములే సర్వోత్తమములనీ నేర్చుకొన్నాము, నేర్పుతున్నాము. మనలో ఆంగ్లభాషావిశారదులని వర్ణింపబడేవారిలో చాలామంది షేక్స్పియరు నాటకములను వినాచేసి ఇతరనాటకములు చదివియుండరు. పరీక్షలు ప్యాసయినతరువాత తిరిగీ యేడికెట్టివు నవలలోతప్ప ప్రఖ్యాతాంగ్లకావ్యములు చదివేవారనేకులు మన ఆంధ్రులలో కనబడరు. షా, ఇబ్సెన్, మేటర్లింకు, వైల్డు-ఇత్యాదులైన రచయితలపేళ్లు ప్రసంగములలో దొర్లించడము ఒక సంభాషణ లాంఛనమయి పోయింది. కాని ఈనవీనులరచనలు ఏమి సూచిస్తున్నవో, ప్రపంచమువారికి యేలాగు కనబడుతున్నదో, ఇట్టిరచనలు చేయడములో వారితాత్పర్యమేమో, వస్తువిస్తరములోను, పాత్రపోషణలోను, వీరిమార్గమెట్లుమారియున్నదో సింహావలోకనము చేయుడం ఆంధ్రనాటకకర్తల కవసరమైయున్నది. ఈమధ్య "Great Modern English Plays" (గొప్ప నవ్యాంగ్లనాటకములు) అనేగ్రంథము చదివియుంటిని. అవిఅన్నీ ఆడినాటకములే, వాటిలో ఒక్కటిన్ని

ఏకాంక నాటకం లేదు. ఆసంపుటములోని సంపాదకీయమందలి అంశములు నేటి ఆంగ్లనాటక ప్రియుల ఆశయములు తేటపరచును. ప్రస్తుతమాంగ్లదేశములో దేశకాలపాత్రోచితమైన నాటక విశేషము కామిడీ (Comedy) అట. జాతితత్వముచేత ఆంగ్లులను వేళాకోళముగా చెప్పితే తలకెక్కి-నట్లు ధర్మోపన్యాసముగా చెప్పితే ఎక్కదట. నవలవ్రాసి సంఘికములో సంస్కారము తెచ్చినవాడు డికెన్సట (Dickens). గాని నేడు నాటకములవల్ల సాంఘిక సంస్కారములు కలిగినట్లు నవలలవల్ల కలుగజాలదట. షా గారి రచనలవల్ల ఆంగ్లదేశములో లేబరు పార్టీ (Labour party) వారికి చాలా ప్రాబల్యము, పలుకుబడి కలిగినదట. ఆంగ్లస్త్రీలలో నవ్యసంచలనము కలగడానికి ముప్ఫైసంవత్సరములకు పూర్వమే ఆయన అట్టి పరివర్తనమును తననాటకములలో "నవ్యవిలాసిను"లను చిత్రించిచూపెనట. నేటి ఆంగ్లనాటకరచనలలో నవీనుల నిత్యసంసారయాత్రలో గలుగు సంఘటనలు సంఘర్షణములూ కవికి ప్రపంచముమీదగల విశేషదృష్టిని సమన్వయింపబడి కూర్పబడియున్నవట! ఏ సాంఘిక సమస్యను గురించియైనా పలువిధములైన ప్రకృతులను వివిధావస్థలలో తోచుమనోభావములను ఆయాపాత్రల వ్యవహారాలను సత్తాలుతగినట్లు అవసరమైనట్లుకూర్చి సమర్థించడం సాంఘిక నాటకమునకు లక్షణమట! ఇట్లు ఆంగ్లదేశములోని రచనలలో నాటకవస్తువు నేటి సాంఘికజీవితములోనిదై పాత్రలు నేటిఆంగ్ల స్త్రీ పురుషులై, అందులో వృత్తము ఆంగ్లుల నేటిసంసారపరిస్థితులలో కలుగు చిక్కులను వాటిని విడదీయుప్రయత్నములున్నూనై, అందులో బోధరచయితల ప్రత్యేక సాంఘిక విమర్శమై రచనాసంప్రదాయమాంగ్లనాటకచరిత్రలో కామెడీవిధానపు చరిత్రలో ప్రఖ్యాతములైన కాన్గ్రీవు, బెన్ జాన్సను (Congreve, Ben Jonson)ల మార్గమైయున్నదని ఆంగ్లవిమర్శకులే అంటారు మరిన్ని ఈ నాటకములలోను ఇట్టి ఇతరయూరోపియనాటకములలోను "నవవిలాసినీ" సమస్య సమర్థించు ప్రయత్నమే ఎక్కువగానున్నదనిన్ని అంటారు. ఈసమస్యయేమిటో మనకుకూడా కొంతతెలిస్తే మంచిది. "తప్పెవరిది" వంటివి సాంఘికనాటకములని అనుకుంటున్నారే! వాటిలోకూడా ఈ "న్యూవుమన్" (New Woman) సమస్యయేఉంది. పాశ్చాత్యనాటకములలో ఈ న్యూవుమన్ (New woman) సమస్యకు సంబంధించిన యితివృత్తములు, కావ్యవస్తువులు (Dramatic Themes) కొన్నిరకములుగా ఉన్నవి. ఎట్లనగా—

(1) ఇరువురు స్త్రీలొక పురుషుని ప్రేమించడం, తన భర్త నూతన యువతితో హాయిగా నుండటానికై భార్య ప్రాణత్యాగము చేయడం.

(2) ఇరువురు పురుషు లొక స్త్రీని కామించడం, అందొకడీర్ష్యచే రెండవ వానిని చంపడం, కథలో అవాంతరంగా అనాలోచితంగా పొరపాటున తన భార్యనుకూడా చంపడం.

(3) ఇరువురు స్త్రీలొక పురుషుని మోహించడం, పెయింటింగులు చేసే ఈ పురుషుడు తన మనసులో కలగే రసోద్రేక మెప్పుడెటు లాగితే అటుపోయి తన ప్రేమపిపాస తీర్చుకోవడానికి తనకు సహజమైన హక్కు కలదని సిద్ధాంతము చేయుడం. "When we dead Awaken'' of Ibsen and Shaw's 'Doctor's Dilemma,

(4) ఇరువురు స్త్రీలొకనిని కోరగా, తన భార్యకాని స్త్రీని వదలలేక ప్రాణత్యాగము చేయుడం.

(5) ఇరువురు స్త్రీలొకనిని మోహించడం, అందొకతె అతనికి ప్రధానమై యుండడం, రెండవ ఆమెకూ ఈతనికీ మక్కువ యెక్కువగా నున్నను ప్రధానమైన యువతి కుటుంబమువారి యెడలగల కృతజ్ఞతచేత నీ రెండవయామె అతనినుండి విడపడడం,

(6) చిన్న సంసారములలో ఒక యువతి ఒక గొప్ప ప్రభు కుటుంబీకునితో చెలిమికలిగి మనస్సు కలతపడడం, కొంతవరకు కూగులాడి ఆమె తన భర్తయందే తన మనస్సంతా లగ్నము చేసుకొనడం.

ఇట్టి నాటకములేవో చదివి పేర్లు మార్చి మన ఆంధ్రదేశపు పరిస్థితులలో సంఘటించి సాంఘిక నాటకములని. వ్రాయదలచడం తగనిపని, ఎందుచేతనంటే ఇట్టి సంఘటనములు మనదేశపు సంప్రదాయములకు విరుద్ధములు, అవి సంఘటించడానికి తగిన సాంఘికపరిస్థితులు, ఆచారములు, అలవాటులు, సాంఘిక పరివర్తనములు పాశ్చాత్యదేశములలో గలవుగాని మనదేశములో లేవు. కో ఎడ్యుకేషను (Co-Education) మన దేశములో కూడా బాగా ప్రబలమయితేనేగాని, మిక్సెడు క్లబ్బు (Mixed club) లకు మన నారీమణులు వెళ్ళి పురుషులతో టెన్నిసు, పేకాట, చదరంగము, బిలియర్డ్సు మొదలైన ఆటలలో నిరభ్యంతరముగా జోడీకడితేగాని ఇట్టి సాంఘిక నాటకాలు వ్రాయడాని కవకాశము కలుగదు. అయినా పాశ్చాత్యనాటక కవులయినా, పాత్రోచితముగా ప్రకృతుల తత్వములను చిత్రించియున్నను, మొత్తముపైన స్త్రీపురుషుల ఔదార్యములను, సాహసములను ఇంద్రియములోలత్వా తిరిక్తములైన ఆత్మపరీక్షలను, మనోవ్యాకులములను, దీర్ఘాలోచనలను, కలతలను రూపించి స్త్రీవ్యక్తి అంత చులకనగా చూడతగినదిగాదని సూచించినారు.

"శివరాజు" నాటకములో ఇట్టి న్యూవుమనిజమ్ (New womanism) మాడర్నిజమ్ (Modernism) కూడా సరిగ్గా విన్యాసపరచితే యెట్లు పరిణమిస్తుందో సూచించవలెననే యత్నమున్నట్లు తోస్తుంది. ఒక్క వాక్యమైనా రసవంతమైతే అదే కావ్యమని మనపూర్వులవచనము గదా! ఇట్టివచనము వ్రాసి వచనముతోనే నాటకము రసభావభాసురము చేయగలమని "అనార్కలీ"లో "ముద్దుకృష్ణ"గారు చూపినారు. ఇట్టి రసవంతమైన వాక్యములకు ఆర్నోల్డు విమర్శకుడు (Matthew Arnold) "కవితకు గీటురాళ్లు" (Touchstones poetry) అని పేరుపెట్టినాడు. అనగా కావ్యమంతా మరచిపోయినా మనకును వదలని వాక్యములన్నమాట. ఇట్టివి మన పూర్వాంధ్ర సారస్వతములో కూడా ఉన్నవి:—ఉ॥

1. ఆచట బుట్టిన చిగురుకొమ్మైన చేవ
2. ఇంతటి కన్నులుండ తెరువెవ్వరి వేడెదు
3. కలడందు రన్నిదిశలను కలడు కలండనెడివాడు కలడో లేడో
4. తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదివేలుజేరు
5. శివుడుం తాండవమాడ నాడశపిశాచీ భూతభేతాళముల్

6. ప్రజయాత్ర యెరుగని ప్రభువు దూరమునుండి వచ్చెనే మచ్చట చచ్చెనేమి.

వీటియందు అలంకారికులు కోరు కావ్యగుణములు అన్నీ చూపవచ్చు. విశేషించి, ఆంగ్ల విమర్శకులుకవనమందు కోరే దృష్టి (Vision) న్ని రసము (Emotion) న్ను చూపగలము—ఇటి వాక్యములు అనగా దృష్టిరసములు కలిగినవి మన నవ్యాంధ్రరచనలలో ఎంత యెక్కువగా ఉంటే వాటి కంత నిలుకడగల ఆమోదము కలుగుతుంది. ఒకతరముకూ రెండవతరముకూ స్థితిగతులలోను, అవస్థలలోను, అభిరుచులలోను, రుచులలోను, వాతావరణములలోను, సాంఘిక రాజకీయ మత సంఘర్షణలలోను భేదములు కలుగుతునే ఉంటవి. ఇన్ని భేదములలో నుంచియు ఇంతకాలము నుంచియు ఇన్నితరములనుంచియు ఆదరాభిమానాలకు కొరతలేకుండా ఏ యుగమువారికా పరిస్థితుల కనుకూలంగా హృద్యముగా నంటూవచ్చిన కావ్యము లాంధ్రములో మహాకావ్య గౌర

కముగలవి కొన్ని ఉన్నవి, వాటి తాళపత్ర ప్రతులింకను మన ఆంధ్రావనిలో ఎన్నైనా దొరుకుతవి. వాటికి కలిగిన గౌరవమును ఆదరమును తన రచనకు కూడ కలుపవలెననే సంకల్పముతో దీక్షతో వ్యుత్పత్తితో శాంతముతో ధైర్యముతో ప్రతినవకవికుమారుడూ ఉత్సహించదగియున్నది.

అందుచేతనే ఆంధ్రమాతకు సేవ చేయడానికి సారస్వతములో నవాధరస భావబోధకములైన రచనలు చేయడానికికూడా ఒక సాధనమే అని నా మనవి. కాయకష్టముల కోర్వలేని కోమలహృదయులగు యువతీయువకులీ ఉత్తమమార్గాన్ని ఆశ్రయించవచ్చు. అంతకు చాలని నావంటివారు పూర్వాంధ్రసాహిత్యముల గుణవిశేషములు నవీనులకును నవీనపాశ్చాత్య ప్రపంచమునకును నచ్చజెప్పేలాగు పత్రికలువ్రాసి ఆంధ్రుల ఉత్కర్షను విశదపరచవచ్చును. ఇంతమాత్రమున నీ సేవ మాతృదేవతకు సమాదరణీయము కాకపోదు. మనపూర్వ సాహిత్యపరులకు లేని అనుకూల్యములు మనకిప్పుడెన్నో ఉన్నవి. వారికానాడు పరస్పర సమావేశానికి ఇంతటి ప్రయాణసౌకర్యములుగాని ఉదారస్వభావులైన జనసంఘముల ఆదరణలుగాని సులువుగా లభించి ఉండలేదు. ఇప్పటివలె ఆనాడు ముద్రణాదిసౌకర్యములుగాని ప్రకటానుకూల్యములుగానిలేవు. వారినుగ్గడించే స్నేహితబృందమును వారెరుగరు. పరస్పరము వారిలో స్పర్ధలే మెండుగానుండేవి. శ్రీకృష్ణరాయలువంటిప్రభువు పండితకవిఆస్థానములో సుంకసాల నృసింహకవి, "కవికర్ణరసాయన" కర్త, ప్రవేశముసంపాదించడానికెట్టి పాట్లుపడవలసియుండెనో ఆకథమీరెరుగనిది కాదుగదా! ఎటుచూచినా, వారిరచనలలో అక్షరమునకొకతప్పుపట్టి వారికెక్కడా మంచితీర్థము పుట్టకుండాచేయ యత్నించినవారే ఇతర పండితులుగదా! అవి నూరిజనసంఘములలోను, రాజాస్థానములలోను పండితులలో పండితులకు ఘోరవాగ్వాదములు జరిగినరోజులు. అందుచేతనేగాబోలు, యుద్ధములో సేనాముఖముననిలిచి శత్రుభీకరముగా కరవాలముల నేర్పుచూపి విజయముగొన్న యోధాగ్రేసరులకు కలిగిన బిరుదగౌరవములు బహుమతులువంటి లాంఛనములును, ధనకనక వస్తువాహనాదులును కవిత్వములో విజయములు పొందినవారికికూడాలభించేవి. కాని అట్టిఉద్దండకవులు నూటాకాటా ఒకడో ఇద్దరో ఉండేవారు. కాని చిన్నగ్రామములలోకూడా ఏపేదకవియైనా తన నూతనరచన వినిపించుతున్నాడంటే మాత్రము అతనిని ఏదోవిధంగా హీనతపరచడానికే సాహిత్యపరులు నడుములుకట్టేవారు, ప్రశ్నవచ్చినప్పుడు రాజాస్థానములలో చేసినప్రయోగము సమర్థించుకోలేకపోతే కవికి పాగాఎగురగొట్టే వారన్నమాట! అంటేశిరచ్ఛేదమనే యర్థము. అంతటివిషమపరీక్షలకు నిలిచి వచ్చినదే పూర్వాంధ్రసాహిత్యము. మహాకావ్య గౌరవముకలవి మననాడెట్టి పట్టుదలలుగాని సంరంభములుగాని లేవు. బిరుదలాంఛనాది సత్కారములుకూడా అంతకన్న సులువుగా కేవలము కవితా ప్రోత్సాహకములుగా లభించుతూన్నవి, అభిమానముతో ఆదరముతో అనుకంపతో ఉదారదృష్టితో నవకవులరచనలను విని అభినందించే యువజనసంఘములును ఇట్టి మహాసభలును ఏర్పడుచునే ఉన్నవి. ఆంగ్లభాషా పరిచయమువల్ల ప్రస్తుత మభినవ ప్రపంచమం దుద్భవించుతూన్న మంచికావ్యముల అనువాదములేగాక వాటి సద్విమర్శలుకూడా మనకు లభించుతున్నవి. ఆంగ్లములోగల విలువైనగద్యగ్రంథములవంటిని మన ఆంధ్రమున ఎన్నెన్నో కావలసియున్నది. పలువిధములుగా పరుగులెత్తుతూన్న నేటి జ్ఞానవాహినులు ఎట్టివిజ్ఞాన వారిధిలో కలుస్తూన్నవో ఆకల్లోలిని ప్రశాంతత వహించినప్పుడెట్లు భాసిల్లుతూన్నదో అరయగల అవకాశము మన భారతీ కుమారకులకును కుమారికా మణులకును కలిగియున్నది. పూర్వాంధ్ర సాహిత్యమందలి రసవత్పదజాలమును నూతనపదజాలముతో సమన్వయపరిచి ఆంధ్రజాతికుత్తేజము కలిగింపగల రచనలు

రావలసియున్నది. శోకమోహములకుగాని శోకమోహ విన్యాసములకుగాని ఇది కాలముగాదు. విషాదయోగమునుండి కార్యరంగమునకు వెలువడి అంతర్బహిశ్శత్రులపైకి మన సాహితీ దివ్యరథమును నడపవలసియున్నది. "నిరాకరణయంత్రి"మును సమస్తభారతమండలములలోనికి త్రిప్పినట్లు నేడు మన ఆంధ్రసాహిత్యరథాన్ని సమస్తాంధ్రభారత సాహితీ కర్మక్షేత్రములలోకన్నీ నడపవలసిఉన్నది. సాహితీపరుల రచనలవల్ల సంసారములో చిక్కుకొని నిర్భరమైన నిరుత్సాహములో పడిపోయినవారికి శాంతియో ధైర్యమో, ఆనందమో, ప్రోద్బలమో, సాహసమో, సమాశ్వాసమో, సంశయవిభేదకరమైన నవ్యభాసమో కలుగవలసి ఉన్నది. ఆదిఆంధ్రకవితా గురువులు ఆంధ్రలోకమునకు చేసిన ఉపకారము. దానికి వారియెడల కృతజ్ఞతి చూపదలచిన పూర్వాంధ్రకవి—

భాసుర భారతార్థముల భంగులనిక్క మెఱుంగనేరముఀ
గాసట బీసటే చదివి గాథల త్రిప్పు తెనుంగు వారికిఀ
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లముజేసినట్టి యు
ద్భాసన కల్పులం దలతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.

అని స్తుతించినాడు.

నవ్య ఆంధ్ర కవికుమారకులారా,

తమ కీ పూర్వాంధ్ర సాహిత్యమంతా "గాసట బీసట" అని తోచవచ్చు. దానికి తగవులేదు. కాని ఇట్టి గాసట బీసట త్రిప్పుటలో కాలక్షేపము చేస్తూన్న నేటి అజ్ఞులకు నాటినన్నయాదుల వలె పాశ్చాత్యవిజ్ఞాన భారతములగు కావ్యములను పరమార్థతత్వ నిస్సంశయకారులగువాటిని ఆంధ్రజాతీయతా విలసితమగువాటిని నవరసభరితములగు సకల కళావిన్యాసముగలవాటిని సృష్టికి ప్రతిసృష్టిగా జేయడంలో తమ సాయశక్తులను కలిపి వినియోగించి తమ జీవితములను, తమ భాషాపాండిత్యములను, తమ రసానుభవములను, తమ రసాస్వాదనతత్పరతను ధన్యము చేసి మన ఆంధ్రమాతను తిరిగీ భారతీయ సాహితీసింహాసనమున పట్టాభిషేకం చేయండి.

# దుఃఖ ధోరణి

కందుకూరి రామభద్రరావు

ఇడుములు కల్గెనేమొ జనియించిన వేదన రోదనధ్వనిన్
బుడమికి ధారగాఁ గడవపోఁతలు పోసిన కంటినీరు ని
ల్కడగన, శూన్య మేదొ తడికన్నులఁ గాంచుచు దీనయై వెతం
బడు గగనేందిరారమణి వర్షనిపాతసమాప్తి వేళలన్

నిండుగ దుఃఖపూరమున నిండిన గౌతమియాస్య మెట్టిదై
యొండు వచింపఁబోక యెదియో యెదలోఁ గలపంగఁ బైకి రా
కుండ నడంచివైచును వయోజని తేద్ధ వివేకసంపదల్
పండినవృద్ధ కావున నభంబు కలంగునటన్న భీతినో !

నాకముఁ జూచి పత్రినయనంబులఁ గార్చుచు నశ్రుబిందువుల్
మ్రాఁకులు నిల్చిపోయినవి మాటల కందని సౌహృదంబునన్
వాకిటిబంధుకోటివలె; వాకొనలేనిజడంబులై గిరుల్
మూఁకొను జాలిగా హృదయముల్ ద్రవియింపఁగ మెల్లమెల్లఁగన్ .

నాయెదఁ బొంగిపోయె జననమ్ములబాంధవ మేదొ యొక్కటై
పోయి విషాదవాహినులు; పోల్చుకొనంగ వశంబుగాక దుః
ఖాయతమూర్తినై ప్రకృతి యంతయుఁ గప్పిన శోకవార్ధినే
పోయితి లోకలోకములపొంతలఁ దేలుచు వెఱ్ఱి నేడ్చుచున్

# అప్పుడు

పైరుగాలికి నాట్యమాడే
పైటరాపిడి తగిలి చిటుకున
పండిపోయిన దాని మొక్కటి
పగిలి విచ్చింది
పండుదొండకు సాటివచ్చే
పడతిపెదవులలోన దాగిన
పండ్లముత్తెపుతళుకు లన్నీ
పక్కుమన్నాయి.
అప్పుడు నే ననుకొన్నాను
అందాని కర్థం ఇదే నని.

గట్లమీదా పుట్లమీదా
గంతులేస్తూ తిరిగివచ్చిన
కోడెదూడని బాడి అయినా
గోవు నాకింది
దుస్తులంతా దుమ్ముపడినా
దులపకుండా చేరవచ్చిన
కన్నతండ్రిని తల్లి ఎత్తుకు
కౌగిలించింది.
అప్పుడు నేననుకొన్నాను
ఆనంద మంటే ఇదే నని.

తేనెకోసం పూవుపూవుకి
తిరుగుతుండే గండుతుమ్మెద
కాలికంటినపుప్పొడంతా
పూల కంటింది
పూటపూటకు సేకరించిన
పూరజంతో బరువు లెక్కిన
విరులగుత్తులు పురుడుపోసుకు
పిందె లయినాయి.
అప్పుడు నే ననుకున్నాను
అచ్చపుసత్యం ఇదే నని.

# మౌనశ్రుతి

చిన్నిశంఖంలోన చిక్కువడినట్టుగా
ఆమెగొంతుకలోన అంబుధులుమూల్గినవి
దీర్ఘమౌ మౌనగీతికలరాగాలతో
మారుమ్రోసినవి నామనసులోగుహాలు.

ఆమెహృదయంలోన ఆచికొన్నవలపులు
కనులతళతళలో మినుకుమని మెరసినవి
అంధకిరణాలతో ఆక్రమించినది ఆ
కనుబడనివెలుగు నామనసులోగుహాల.

ఆమెతనువునపులక లఖిలదిక్కోణాల
గాలికెరటాలపై కదలివ్యాపించినవి
మూలమూలల నొదిగి ముడిగిపోయినగాలి
మారుపులకించె నామనసులోగుహాల.

చిన్నిశంఖంలోన చిక్కువడినట్టుగా
ఆమె గొంతుకలోన అంబుధులు మూల్గినవి
దీర్ఘమౌ మౌనగీతికల రాగాలతో
మారుమ్రోగినవి నామనసులోగుహాలు.

-3ఒ3

## చిత్రరచన

ఏమి వ్రాస్తున్నావు చిత్రకారా?
చిన్నపిల్లల బొమ్మరిళ్ళలో నాజూకూ
చిట్టిపాపల తప్పటడుగులవయ్యారం
చిరుతపలుకుల ముద్దులొలికే మైమరపూ.

ఏమి వ్రాస్తున్నావు చిత్రకారా?
చిలిపికజ్జాలనీ, వలపుకన్నీటినీ,
ఎడబాటువగలనీ, కడకంటిఎరుపునీ,
మరలకలయికలనీ, కరగుహృదయాలనీ.

ఏమి వ్రాస్తున్నావు చిత్రకారా?
ముడతలుపడ్డ దేహంలోపల
ముక్కపోయినమనసులూ
తేనెలతీపిని చే దనితోసే
తిక్కలెక్కినజిహ్వాలూ
ఆయాసంతో అలసట చెందీ
అదే వాగే నాల్కలూ.

ఏమి వ్రాస్తున్నావు చిత్రకారా?
ఏడుపులూ నవ్వులూ ఏకంగా జేసేసి
ఈజీవితపు కష్టసౌఖ్యాలనీడల్ని
ఏడురంగుల్లోకి అనువదిస్తున్నాను.

## జీవితప్రవాహము

నాగతజీవితపునదికి నెదురీది
చిన్నతనపునాళ్ళ జేరుకోగలన?
కాలవేగములోన కలిగిపోయిననీట
నాప్రతిబింబ మే నరయజాలుదున?

నాయెద నిరుగట్ల నంటికొని పారె
నెపుడో స్వచ్ఛము లైననీరపూరములు
మలినపంకముతోడ మథియించు నిపుడునా
తలపుల దరిలేని విలయవారిధులు.

ఆసల వెందుకో? ఆశయము లేలో?
ప్రేమ అదేలనో? పెన్వాగ ల వేలో?
వినపు టుపనదులట్లు విమలమౌ నాబ్రదుకు
టూపగలో గలసి యాపదల బెంచు.

విడనిసమస్యలే సుడి దిరిగిపోవు
నీనదివేగంబు నెటు లాపగలనో!
వశము దప్పినది నాపడవచుక్కాని ఏ
కనుబడనిశిలను డీకొని పగులగలదో!

నాగతజీవితపునదికి నెదురీది
చిన్నతనపునాళ్ళ జేరుకోగలన?
కాలవేగములోన కలిగిపోయిననీట
నాప్రతిబింబ మే నరయజాలుదున?

**పాలగుమ్మి పద్మరాజు**

# సంపాదకీయము

## అఖిలాంధ్ర కథక సమ్మేళనము

### హైదరాబాద

ఫిబ్రివరి 4, 5 తేదీలలో హైదరాబాద శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయములో ద్వితీయసమ్మేళనము జరిగింది. శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు అధ్యక్షులు. వారు కథానికాచరిత్ర వేదకాలంనుంచి నేటివరకు సూచించి ప్రసిద్ధఆంధ్రకథకులను గురించిచెప్పి నవ్య సారస్వతంలో కథ ఎన్నిరకాలుగానడుస్తున్నదో వివరించారు. వీరి ఉపన్యాసంవల్ల నిజాంఆంధ్రులకు ఉత్సాహంకలిగి అక్కడ నవ్యసాహిత్యపరిషత్ శాఖను స్థాపించడానికి కొందరుత్సాహపరులు పూనుకొన్నారు. ఈ సారి కథకసమావేశం మధ్యాంధ్రదేశంలో జరపడంమంచిది. ఉత్సాహపరులు ఆహ్వానింతురుగాక !

## నవ్యసాహిత్య పరిషత్తు : ఆరవ సమావేశము

### బందరు

ఫిబ్రివరి 12, 13 తేదీలలో బందరు జాతీయ కళాశాలలో అత్యుత్సాహంగా జరిగింది. ఆహ్వాన సంఘమువారినీ, ముఖ్యంగా చల్లపల్లి రాజావారినీ, అద్భుతంగా ఏర్పాట్లు చేయించినందుకు అభినందిస్తున్నాము. పూజ్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు సభను ప్రారంభంచేశారు. శ్రీ బుర్రా శేషగిరిరాయ ప్రధాని సభాధ్యక్షులు. బందరు పురవాసులేకాకుండా పొరుగూళ్లనుంచికూడా వందలకొద్దీ సాహిత్యాభిమానులువచ్చి సభలను శోభావంతంగా చేశారు. శ్రీయుతులు విశ్వనాథ సత్యనారాయణ, వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, పిలకా గణపతిశాస్త్రి, వింజమూరి శివరామరావు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ప్రముఖులు కావ్యపఠనం చేశారు. శ్రీయుతులు జమ్మలమడక మాధవరామశర్మ, కోలవెన్ను రామకోటేశ్వరరావు, చిలుకూరి నారాయణరావు, పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రముఖులు ప్రసంగాలు చేశారు.

తమిళదేశస్థులు సుప్రసిద్ధ కళారాధకులు శ్రీరామచంద్రన్ గారు సంగీతాన్ని గురించీ, నాట్యకళను గురించీ ఉపన్యసించారు పగటివేషాలు, జంగంకథలు, భాగ

వతం, కూచిపూడి రాఘవయ్యగారి భరత నాట్యం, వేలూరి చంద్రశేఖరంగారి కాంచనమాలా నాటకప్రదర్శనం ముఖ్యమైన వినోదాలు.

నవకవుల కృతులూ, జాతీయ కళాశాలలో తయారైన లివాచులూ మొదలైనవి ప్రదర్శింపబడినవి. ఈసంవత్సరానికి కార్యనిర్వాహక సంఘం ఎన్నికలు జరిగినవి.

శ్రీ గిడుగు రామమూర్తిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, తల్లావఝ్ఝల శివ శంకరశాస్త్రిగారు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, చింతా దీక్షితులుగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మొదలైనవారుకూడా వచ్చిఉంటే సభలు ఇంకా బాగుండేవి.

## కృతిసమర్పణఉత్సవం
### గుంటూరు

మార్చి 18 వ తేదిన గుంటూరులో నవ్యసాహిత్య పరిషత్ తరఫున 'గౌతమీ కోకిల' వేదులసత్యనారాయణశాస్త్రిగారి 'దీపావళి' అనేఖండకావ్య సంపుటి శ్రీ శ్రీ నూతక్కి రామశేషయ్యచౌదరీగారికి కృతియిచ్చారు. జిల్లాబోర్డుభవనంలో శ్రీ విశ్వ నాథ సత్యనారాయణగారి అధ్యక్ష్యంక్రింద సభజరిగింది. అనేకులు పురప్రముఖులు, కవులు, విద్వాంసులు సభకువచ్చారు. సంగీతవిద్వాన్ పెనుమర్తి రామశర్మగారు వీణా గానంతో మంగళాచరణం చేశారు. శ్రీ సత్యనారాయణశాస్త్రిగారు మధురంగా తమ కావ్యాలు చదివి వినిపించారు ఆరాత్రి ఆంధ్రక్రైస్తవ కళాశాలా భవనములో బందరు మిత్రులు అద్భుతంగా కాంచనమాల నాటకం ప్రదర్శించారు.

## కవిత్రయసన్మానం
### రేపల్లె

ఏప్రిల్ 10 వ తేదీన రేపల్లెలో నిరుద్యోగ సంఘయువకులు శ్రీయుతులు తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి గార్లకు సన్మానం చేశారు. సన్మాన సంఘంవారూ, పురప్రముఖులూ కవిత్రయాన్ని రైల్వే స్టేషనుకు ఎదురేగి, ఉత్సవంతో సినీమాహాలువద్దకు తీసుకొనివెళ్లారు. అక్కడ సభలో డిస్ట్రిక్టుమున్సిఫ్ శ్రీ మామిడన్న నారాయణరావుగారి అధ్యక్షతక్రింద వారికి సన్మాన పత్రాలు సమర్పించారు. అడివి బాపిరాజుగారు హాజరు కానందున వారి కుర్చీకి పుష్పమాల అలంకరించి సన్మానపత్రం ఇచ్చారు. సాయంకాలం తాలూకాబోర్డు

భవనంలో సభ జరిగినది. విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణ భాగం మధురంగా చదివారు. శ్రీ శివశంకరశాస్త్రిగారు ఛిద్రఘుటి అనే కావ్యం చదివి కావ్యకళ మీద ఉపన్యసించారు. కృష్ణశాస్త్రిగారు కావ్యపఠనంచేసి కవుల కర్తవ్యాన్ని గురించి ఉపన్యాసంచేశారు. వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు, వింజమూరి శివరామారావుగారు పద్యాలు చదివారు. ఈ సత్కారానికి కారకభూతులైన దేశిరాజు కృష్ణశర్మగారు ప్రశంసార్హులు.

## రవీంద్ర సారస్వత సమాజ
## వార్షికోత్సవం — భీమవరం

ఏప్రిల్ 10 వ తేదీన శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారి ఆధిపత్యాన్ని అత్యుత్సాహంతో ఈ ఉత్సవం జరిగింది శ్రీయుతులు అడివి బాపిరాజు, మల్లవరపు విశ్వేశ్వరరావు, గురుభాగవతుల సుబ్బారావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, పెమ్మరాజు లక్ష్మీపతి ప్రభృతులు ఉత్సవంలో పాల్గొన్నారు.

## నాగేశ్వరరాయ నిర్యాణము

ఏప్రిల్ 11 వ తేదీన దేశోద్ధారక, కళాప్రపూర్ణ, విద్యాదాత, వీరమాహేశ్వర స్వరూప, నవ్యసాహిత్యపరిషత్ గౌరవాధ్యక్ష, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు లింగైక్యమును పొందినారు. పరిషత్తువారు బెజవాడలో సభచేసి తమవిషాదాన్ని వెల్లడిస్తూ వారిఅల్లుడు శంభూప్రసాదరావుగారికి ఆశ్వాసం అందజేశారు.

## మహతి పత్రిక

ఏప్రిల్ 15 వ తేదీన తెనాలిలో శ్రీజమ్ములమడక మాధవరామ శర్మగారు అధ్యక్షులుగా ఉండగా నూతాశ్రమంలో మహతి పత్రికా ప్రారంభోత్సవం జరిగింది. సంపాదకులైన శ్రీ వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారికి మా అభినందనాలు.

# సందేశం

**కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి**

మాధవి అనే గోపిక సమీపంలో సంగీతం
పాడుతూవున్న షట్పదాన్ని చూచి,

గొల్లచేడియ లెల్ల చూడగ
పిల్లగ్రోవిని పెదవి జేరిచి
కల్లపిల్లడు కమ్రగీతులు
ఎల్లవారలు నెడదగుందగ
పాడుచుండును తుమ్మెదా
ప్రణయవార్తలు చెప్పవా ?

కనగ బృందావనమునడుమను
కనులపండువు గాగ నిలిచి
మనసు కరిగే మధురగీతుల
పనులు మరపింపంగ బాడును
వానితోడను భృంగమా
ప్రణయవాక్కులు పలుకవా ?

మిత్రపుత్రిక మెరుగునీళ్ళ వి
చిత్రగమనము చేయుచుండెడి
మాత్రిలో మామాట దెలిసి
యాత్రిత న్ననుసరయునట్లుగ
వానితోడను తుమ్మెదా
ప్రణయగీతులు చెప్పవా !

చెవుల జొనిపిన చిన్నిపువ్వము
తివిరి జేరుచు తీయపాటల
రవళి సేయుచు రమణుహృదయము
దవులనట్టుల తరిచితరిచి
వానితోడను షట్పదా
ప్రణయవార్తలు పలుకవా !

ప్రకృతి నిండగ ప్రణయగాధలు
త్రిప్పుచుంటిని త్వరగ కృష్ణుని
చెంత జేరుచు చింత జెప్పుచు
తోడ గైకొని తొలుత రమ్మ
పలుకవమ్మా తుమ్మెదా
కంటినీటిని గాంచవా !

నెమలికుంచియ నెగడి యూడగ
సుమశరీరము సోకుచుండగ
విమలవాగ్ఝరి వీనులందున
కొమరు మీరగ గోపబాలుని
చెంతనే వసియింతునా
అంతభాగ్యము కలుగునా !

ఆసమయంలో మరో తుమ్మెద యిల్లా అంటుంది,
సంగీతం పాడుతూ అప్పుడే వచ్చి

ద్విజులమంత్రోత్తేజములతో
ప్రజల జేజేరావములతో
భజనచేసే గానములతో
కాళ్ళగజ్జెలు ఘల్లు రనగా
మాధవుం డరుదెంచున్
మాధవీ
నీభావ మలరించున్

కవుల స్వేచ్ఛాభావములతో
మధుపఝుంఝాధ్వానములతో
చంద్రచంద్రికచవు లెసంగగ
సరస మెరిగినశాంతమూర్తి
మాధవుం డరుదెంచుఁ
మాధవీ
నీభావ మలరించుఁ

# వాంఛ

## వట్టికొండ రంగయ్య

బాలభాను ప్రభాపటలి తాకినమాత్ర కలికినవ్వుల గుల్కు కమలమట్లు
కలువల చెలి వెల్గు గిలిగిలింతలవల్ల కలకలలాడు చెంగలువ లీల
బహుశాఖ కాయత మహీజావలంబియై తేటగా నెదుగు క్రొందీవభాతి
ప్రత్యూషపవనాంకురస్పర్శసంకీర్ణ సౌరభ్యమైన పుష్పమ్మురీతి
త్వన్మనోహరపాణి సంస్పర్శకలన
మామకాభీష్టముల్ దీర ప్రేమమీర
జీవితము లెప్పుడును దేశసేవకొరకె
అర్పణము సేసి మనుద మన్యోన్యమైత్రి

లతికాంతగుచ్ఛసంగతిపిడ కేనాడు ఎలతావి ఘుమఘుమాయించు భాతి
మిహికాంశుకిరణాళి మిళితమై అమృతంబు పృథ్వీస్థలిం బ్రసరించుభంగి
అమృతధారలలోన ఐక్యమై మాధురి తాయమై నోహార జేయురీతి
తీయకై తలయందు తేయాదురసంబు చిత్తమ్ము చివురెత్త జేయుపగిది
అతితరాన్యోన్యమైత్రి దోహదముచేత
ప్రేమలతికలు నానాట పెచ్చుపెరిగి
మొగ్గకై సేసి ముద్దుగా పూలుపూచి
పక్వఫలములం తులదూగు భాగ్య మెపుడో!

మృదుచూత పల్లవాయితవసంతమునకై ఎలమి వీక్షించు కోయిలవిధాన
స్వాతివర్షమునకై సంభ్రమంబున జూచు తప్తచేతస్క చాతకమురీతి
కలువలచెలికాని వెలదివెన్నెల గ్రోల లబిడాయు వెన్నెలపులుగులీల
చిరుమబ్బుతొలిమ్రోత చెవులార వినగోరి తమిమీర తిరుగాడు నెమిలిపోలె
యుష్మదార్ద్రాస్య నిర్గళితోపకార
సత్కపీయూషనిష్యంది సరసభాష
కర్ణపేయంబుగా విన గంపెడాస
అనుగు నెచ్చెలి వేచియుంటిని గదోయి!

# అపుడు – ఇపుడు

చేబ్రోలు సూరన్న

## అపుడు

నిండుపున్నమి పండువెన్నెల
విశ్వమంతా వెల్లవేయగ
పచ్చపచ్చని బయలులందు ప్ర
పంచ మంతా మరచి హాయిగ
చేయి చేయీ కలిపి నేనూ
ప్రేయసియు విహరించినారము

కడలు లేని అగాధమౌ పెను
కడలి నడుమను కాంత నేనూ
దేనికొరకోగాని ముందుకు
మేను మరచీ మృతిని చరచీ
పవలు రేలూ ప్రణయనౌకలో
ప్రయాణ మ్మొనరించినారము

రమ్యహార్మ్యోపవని స్వేచ్ఛా
రతులమై నా రాణి నేనూ
అలరు తావుల చందమునకూ
అళులపాటల అందమునకూ
మురిసిపోతూ, అంతలో మై
మరచిపోతూ, తిరిగినారము

## ఇపుడు

కారుమబ్బులు గగనమంతా
క్రమ్ముకొని యీ యవనినంతా
కటికి చీకటి ముంచి నాసఖి
కన్నుమలపీ దాచివైచెను
కారు మబ్బులు కటికి చీకటి
క్రమ్మినవి నా గుండె నిండా

వీచె జంఝూనిలము దిక్కుల
లేచి వచ్చె తుపాను మీదికి
పొంగనది సంద్రమ్ము తనలో
ముంచుకొన్నది చిన్ని నావను
చెదరగొట్టెను సుదతినీ నను
పొదవె నాయెదలో తుపానులు

ప్రళయ కాలానలము రేగి ప్ర
పంచమంతా కంపమొందెను
నందనారామమ్ము సుదతియు
ఎందులోనో చెందె విలయము
ప్రళయవహ్నియు భూప్రకంపము
కలిగె నాహృదికే అనంతము

కటికి చీకటి రగులు పొగలో
కడలిలో రేగే తుపానులో
క్రాగిపోయే పుడమికడుపులో
కానబడునా కలికి కంటికి!

# "చాలనీ"

## (పుస్తక సమీక్ష)

1X\36

### గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతీసారము

పుటలు 12+102 వెల రూ 1

సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

16 జీరా, సికిందరాబాదు, (దక్కన్)

సప్తశతి అంటే 700 పద్యాలసమూహము. ప్రాకృత భాషలో గాథాసప్తశతి, సంస్కృతంలో ఆర్యాసప్తశతి, హిందీభాషలో "బిహారీసత్ సాఇ" ప్రసిద్ధాలు. ఈగ్రంథాలలో కథ ఏమీ వుండదు. ఏపద్యానికి ఆపద్యమే. అయితే ప్రతిపద్యములో భావముకాని, పటముకాని సమగ్రంగావుంటుంది. రసవంతము లయినపద్యాలు కూర్చి పేరేమీ పెట్టటానికి తోచక—700 కాబట్టి సప్తశతి అని నామకరణంచేశారు. ఇవన్నీ ఆర్యావృత్తాలు కావటంచేత ఆర్యాసప్తశతి అనిపేరు.

ఇటువంటి పుస్తకాలలో శృంగారం ప్రధానం. నాయకుడు నాయికతోకాని, నర్మసఖునితోకాని, నాయికచెలికత్తెతోకాని, దూతికతోకాని పలకడం వుంటుంది. అలాగే నాయికచెలికత్తె మేనత్త మొదలయినవారి వాక్కులు పద్యాలలో నిబద్ధమయివుంటవి. ఒక్కొక్కప్పుడు కవివాక్యంగాని, ముఖ్యపాత్ర స్వగతంగాని సంబోధనముగాని వుంటుంది. వలపునుగురించి సంయోగవియోగములను గురించి శృంగారచేష్టలను గురించి వివరణము కనబడుతూ వుంటుంది. రసలోలుపు లయినవాళ్ళందరికీ రమ్యమయిన విధానము ఇందులోది.

స్తన జఘననితంబాదివర్ణనలు, ఆలింగనచుంబనాది వ్యాపారలి ప్రశంసలు పరకీయాప్రీతి - ఇత్యాది మనోహరవిషయాలు మందిలిగువుగా వర్ణించివుంటవి. ఆచార్యగోవర్ధనుడు రసికచక్రవర్తి. అందుకనే "శృంగారోత్తర సత్ప్రమేయరచనై రాచార్య గోవర్ధన స్పర్ధీ కోపి న విశ్రుతః" అన్నాడు జయదేవుడు. భారతభూమి నాగరికతలో నాట్యమాడే రోజుల్లో ఆనందజీవితం ఆచార్యుడు గ్రహించి రత్నఖండము లలాంటి రమ్యపద్యహారం గుచ్చినాడు. నీతిద్రావకము తాగినిజమైనజిహ్వారుచి కోల్పోయిన కోవిదమ్మన్యులకు శృంగారకావ్యము లంటే చేదు! ఆధునికుల కైతే అసలే పనికిరావు, ప్రాచీనులవి పనికిరావన్ను కాస! దేశంలో దౌర్భాగ్యవశంచేత రససాంకర్యం ఏర్పడ్డది.

సూర్యనారాయణశాస్త్రి గారు సప్తశతిలో నాలుగు వందల పద్యాలే ఏరి తెలిగించినారు. ఆర్యావృత్తానికి సమీపం కందపద్యం. మనలో అసలు ఆర్యాపరిణామమే కంద మని కొందరిమతం. వీరు కందములేకాక తేటగీతలు, ఆటవెలదులు ఒకమత్తేభం రెండు ఉత్పలమాలికలు రెండు చంపకమాలికలు వాడారు. గ్రంథారంభంలోవున్న 54 ఆర్యలను 21 పద్యాల్లో సద్దినారు.

శాస్త్రిగారిపద్యాలు సరళంగా వుంటవి. మూలశ్లోకంలోభావం పోనివ్వకుండా పద్యలలో ఇముడుస్తారు.

అయి లజ్జావతి, నిర్భర
నిశీథరత నిస్సహాంగి, సుఖసుప్తే,
లోచన కోకనదచ్ఛద
మున్మీలయ, సుప్రభాతం తే!

ఓసీ లజ్జావతీ, రేయి ఒడలు డస్సి
బిట్టు మయిసేతలకు నిద్రపట్టె రెప్ప
తెరువుమా, యెఱ్ఱకన్నుదామరల జంట
సుప్రభాతంబు గావుత సుదతి నీకు!

శృంగారవిముఖు లైన నీతినీరసులకు ఇటువంటి కావ్యాలు రసఘుటికలవలె పనిచేస్తవి. వారికి ఔవి

తంలో స్వారస్యం గ్రహించి ఆనందం అనుభవించే శక్తి అమీద కలుగుతుంది. అప్పటికీ కలగదూ--
"తస్మై నమ స్స్వాదుపరాఙ్ముఖాయ!"

శి. శా.

## నవమి చిలుక

ఉమా 'విజయ' మహేశ్వర 'వినాయక్'
కల్కి-కావ్యశాల C/o నవ్యసాహిత్య
పరిషత్ : గుంటూరు. 0-2-0

మున్నుడిలో ప్రారంభమయి, గోపీచందుగారి విమర్శతో అంతమయిన 64 పేజిల పుస్తకంలో 18 ఖండికలు వున్నవి. కొన్ని పద్యప్రాయాలు, కొన్ని బందోబస్తయినగీతికలు, కొన్ని నారాయణదాసుగారి నడకలవంటి నడకలరచనలు ఇందులో కనపడుతున్నాయి. ప్రతిఖండిక మధురంగా పలకటానికి అనువుగా వున్నది.

ఇందులో వివిధవిషయాలు రాముడికి వార్త తీసుకపోయి అప్పటినుంచీ రామచిలుకలు అని పేరుపడ్డ "చిలుకరక్తి" భక్తిభరితం. "పూలరంగడు" రకరకాలపోకడలు పోయి చివరకు దొరసానిపడకగదిలో అస్థిపంజరం అయిపోయిన కథలో కరుణరసం. "అగ్రహారబ్బడితె" అన్నిటికీఅందివేసినచెయ్యి అతను లేకపోతే వూరు వూరే కాదు. ఏం చేసినా అతను అనురాగపాత్రుడు. "ఊట్లకాత్రిమ్మ"! వూళ్ళో వుందంటే వూరంతా వుబుసుపోక బూచికంటే కాత్రిమ్మపేరు కొయ్యారట్లు ఎక్కువ పని చేస్తుంది! "బాలవీరుడు" పల్నాటివీరుడయినాడు. తల్లి పడిపోతే ఆరేళ్ళవాడయినా అరితేరినవీరుడయి వూరిజండా నిలిపాడు. "పుట్టింట పిల్ల" ఎన్నినోములు నోచినా చివరకు పుట్టెక్కి వురి పోసుకోటమే! "ఆడవాళ్ళు" ఆశలు ఆడుగంటిన వాళ్ళు అయినారు. "పయనం" రెండెడ్ల బండిలో గంటల గణగణలు తిరిగిరావటం వుంటుందో వుండదో! "జై జై లు" స్వరాజ్య జై జై లు ధీరవ్రులు కూడావీరులు కావాలి. "జ్ఞాపకాలు" స్త్రీజీవితంలో సమస్త జ్ఞాపకాలు పుట్టిందిమొదలు పోయేవరకూ అందరూ వుండి ఏకాకి కావటం కాస్త సుఖానికి గంపంత బాధపడటం - ప్రపంచప్రసవవేదన! "నూతనవసంతం" శుభస్వస్తిలో పచ్చ పచ్చగా వుంది.

ఈపుస్తకంలో "అగ్రహారబ్బడితె" "ఊట్ల కాత్రమ్మ" "జై జై లు" "జ్ఞాపకాలు" పరాకాష్టకు వెళ్ళినవి. భాషలోనూ, భావాల్లోనూ చాలా బిగుతులున్నాయి. కొన్నిచోట్ల కురాన్‌షరీఫ్ కులుకులు, కొన్నిచోట్ల Greek Dithyramb పోకడలూ జ్ఞప్తికి వస్తవి.

అతినవీనమార్గంలో అన్నివిధాలా వెళ్ళుతున్నవాడు వినాయక్ ఒక్కడే. ఇతనిరచనలుఆశ్చర్యజనకాలు. ఆధునికాంధ్రసారస్వతం ఇతనివల్ల కొంత సంపన్నంఅవుతుంది.

శి. శా.

## భారతదేశమున బ్రిటిష్‌రాజ్యతంత్రము

16 + 320 పుటలు : వెల రూ 1-4-0
దిగవల్లి వేంకటశివరావు, బెజవాడ.

శివరావుగారు న్యాయవాదవృత్తిలో వుండికూడా అవకాశం చేసుకుంటూ దేశానికి వుపకరించే గ్రంథాలు చాలా వ్రాశారు. వీరు మనదేశంలో Publicists లో ప్రముఖులు. విషయములను బాగా చర్చించి నిష్పాక్షికసమాధానం చెప్పగల శక్తి వీరికి బాగా వుంది. పట్టిమాటలు కాక, చెప్పిన ప్రతి సందర్భాన్నీ ప్రమాణాలతో, అంకెలపట్టికలతో సమర్థిస్తారు.

బ్రిటిషువారి రాజ్యతంత్రము ఏవిధంగా మనదేశంలో పరిణమించిందో, అభివృద్ధి నిజంగా అభివృద్ధి అవునో కాదో, నూతనఇండియారాజ్యాంగచట్టము ఎటువంటిదో చాలా బాగా వివరించారు. కాంగ్రెసుప్రభుత్వోదయము మొదలుకొని రాష్ట్రీయస్వపరిపాలనమువరకు తొమ్మిదిపరిచ్ఛేదాలలో 250 పుటలగ్రంథం రాసి శివరావుగారు తరువాత

ఐదు అనుబంధాలు, లెక్కలసూచికలు మరి 70 పేజీలలో ఇచ్చారు. బ్రిటిషు విద్యావిధానము, వైజ్ఞానిక పారతంత్ర్యము మొదలయిన అమూల్య విషయాలు రాసినారు.

గ్రంథం సుబోధంగా వుంది. ప్రచారకులకు, గ్రామోద్ధరణోద్యమసేవకులకు జనసామాన్యానికీ ఈపుస్తకం చాలా వుపకరిస్తుంది. ప్రతిగ్రంథాలయంలో వుండదగిన ఈపుస్తకము ప్రజలలో రాజనీతివివేకం కలిగిస్తుం దని నిస్సంశయముగా చెప్పగలము. అనేక అపూర్వగ్రంథములు, రిపోర్టులు రికార్డులు పరిశీలనచేసి ఈగ్రంథము వ్రాసినారు. స్వార్థత్యాగి, గౌతమీసత్యాగ్రహ ఆశ్రమస్థాపకుడు, దేశసేవాపరతంత్రుడు, కైలాసవాసి అయిన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారికి ఈకృతి అంకితం చేయడం చాలాసమీచీనం.



## సీతపెండ్లి: ఇతరనాటకములు

అనువాదకుడు:

కాటూరి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు: వావిళ్ల వారు, మద్రాసు.

182 పుటలు: వెల ముప్పావలా

ఎ. ఎస్. పంచాపకేశ అయ్యరుగారు ఆంగ్లభాషలో రచించిన నాటకముల సంపుటానికి అనువాద గ్రంథమిది. ఇందులో సీతపెండ్లి, ధర్మపథము, భావబంధనము అనే మూడు నాటకము లున్నవి.

నలభై సంవత్సరాలు వయస్సూ, నిరుద్యోగమూ, క్షయరోగమూ, దక్షతవు ముసలితల్లీ, ఈ యోగ్యతలు గల వెంకటప్పయ్యకు ఐదువందల కట్నముతో సహా అంద చందాలూ సంగీతాలూ ఉన్న సీతనిచ్చి మంగళ పెండ్లి చేస్తానంటుంది. మంగళ భర్త శ్రీనివాసులు ఆసంబంధం తనకు ఇష్టం లేకపోయినా గృహకృత్య నిర్వచనములో స్వతంత్రురాలుగా ఉన్న భార్యకు లోబడి పెండ్లి కానిస్తాడు. కొద్ది దినాలకే అల్లుడు మంచంపట్టడమూ, రెండునెలలు తిరగకపూర్వమే మరణించడమూ సంభవిస్తవి.

సీతను దుఃఖోపశమనముకోసము ఆమె అక్కమగడు రాజగోపాలంఇంట దిగబెట్టగా అక్కడ అక్క సంసారసుఖం చూస్తూ తనకు సుఖించే యోగ్యత లేదుగదా అని ఆమె విచారపడుతూ ఉంటుంది. రాజగోపాలం సీతకు పునర్వివాహం చేయవలెనని సంకల్పించి అత్తగారిని ఒప్పించి ఆమెతో సంప్రతించి సంబంధాలు చూస్తూ ఉంటాడు. ఇంతలో వెంకటప్పయ్య స్నేహితుడు విశ్వనాథం ఒక సంబంధంచూచి వరుని సీతకుచూపి ఆమెతో మాట్లాడుతాడు. సీత అంగీకరిస్తుందని తోచిన తరువాత అచ్యుతాన్ని మంగళఇంటికి తీసుకుపోయి వారితో మాట్లాడి పెండ్లిస్థిరపరుస్తాడు. ఈకథలో ప్రాసంగికముగా మంగళకు కలిగిన సాంసారికములయిన చిక్కులు, శ్రీనివాసుల దుర్వ్యయము, దుర్వ్యాపారము, ద్రోహకృత్యము మొదలయినవీ మంగళచాకచక్యము కుటుంబకార్యములు నిర్వహించుటలో దక్షత పుత్రికావాత్సల్యము మొదలయినవిషయాలు వ్యక్తీకరింపబడ్డవి.

'ధర్మపథము'లో రంగరాజు అనే బారిష్టరూ (క్షత్రియుడు) ఆనందస్వామి అనే సన్యాసీ పరతత్త్వము, మతము, మతాచారములు, మద్యమాంస విసర్జనము మొదలయిన ఎన్నో విషయములనుగురించి చేసినసంవాదము నిరూపితమైనది. ఇదినాటకమనిపించుకోడానికి తగదనితోస్తుంది. అయితే సంభాషణలో చాలాగడుసు పోకడలున్నవి. గ్రంథకర్త ప్రజ్ఞ వాదోపవాదాలు నడపడములో బాగా గోచరిస్తుంది.

ఈరెండో నాటకము 'భావబంధనము' అనే మూడవ నాటకానికి ఉపోద్ఘాతమువంటిది. ధర్మపథములోని బారిష్టరురంగరాజే ఈనాటకములో నాయకుడు. తనధర్మసందేహాలు చాలావరకు తీర్చుకొని జ్ఞానసంపాదనముచేసి గురూపదేశముపొంది తీర్థయాత్రలు సేవించివచ్చి తీరావిషమపరీక్ష ప్రత్యక్షమయేసరికి తట్టుకోలేక అంతర్గతంగా ఉన్న పాశవ

ప్రకృతికిలోబడి భార్యను బాకుతో పొడిచి చంపి ఉరితీతకు పాలవుతాడు.

“కీడు చేసినవారెవ్వరయినాసరే తప్పిద మొప్పుకొని పశ్చాత్తాపము చెంది శిక్షమను ఆదరించినట్లయితే అట్టి వారిని సైరించి త్రికరణయా నిర్దోషులుగా ఎంచుట సీధర్మము” అని ఆనందయోగి చేసిన ఉపదేశము. రంగరాజు తీర్థయాత్రలు సేవిస్తూ ఉన్న దినములలో తనకు దగ్గరచుట్టమూ చిరపరిచితుడూ అయిన తిమ్మరాజు ఇంట ఒకనాడు అతనితో కలిసి మరీ తప్పుత్రాగి ఒడలు తెలియని అవస్థలో ఉన్నప్పుడు తిమ్మరాజు ఆమె మానము హరిస్తాడు. భర్త ఎదుట తనదప్పిదము ఒప్పుకొని పశ్చాత్తప్త అయి తనను పూర్తిగా క్షమించమని ఆమె కోరుతుంది. కాని రంగరాజు పలాచారమునను సరించి ఆమెను సంహరించక ప్రాణములతో విడవడానికి మాత్రమే అంగీకరిస్తాడు కాని ఎప్పటివలె గృహిణీభావముతో చూడడానికి అంగీకరించడు. అందువల్ల భర్త కోరిన తీరున శపథము చేయక సగముక్షమాపణ తన కిష్టములేదని చెప్పి బాకుతో పొడిచి చంపమంటుంది. కోపమాపుకోలేక ఒక్కపోటుతో ఆమెను చంపి పోలీసు స్టేషనులో తన నేరము ఒప్పుకొంటాడు. నిశ్చలమైన మనస్సుతో చావును ఎదుర్కొంటాడు.

మొదటి నాటకమూ మూడవనాటకమూ చదవడానికి ఇంపుగానూ ప్రదర్శించడానికి యోగ్యముగానూ ఉన్నవి. అయినా వీటిలో హృదయసంచలనము కలిగించేఘట్టాలకంటె బుద్ధినైశిత్యము ప్రకటించేవి ఎక్కువగా కనబడుతవి. హృదయప్రవృత్తులనూ, కార్యాచరణానికి పురికొల్పేభావపరంపరలనూ పరిశీలించి వ్యక్తీకరించడములో గ్రంథరచయిత మంచిప్రజ్ఞ కనబరచినాడు. ఈశక్తి ఉద్యోగధర్మమువల్ల సంక్రమించినదే అయినా దానిని కావ్యరంగములో నిపుణతతో ప్రవేశపెట్టినందుకు వారిని చాలా అభినందించవలసిఉన్నది. సంభాషణ చాలా సరసంగా నాటకీయంగా యుక్తియుక్తంగా నడుస్తుంది.

శ్రీ కోటూరి వెంకటేశ్వరరావుగారు ఎంతో సమర్థతతో ఈగ్రంథము అనువదించినారు. రసస్ఫూర్తి చక్కగా కలిగేటట్లు రచించినందుకు ఆంధ్రపాఠకులున్నూ తమరచనను మెరుగుపెట్టి ఆంధ్రవిద్వల్లోకములో ప్రచారానికి తెచ్చినందుకు అయ్యరుగారున్నూ వారిని చాలా అభినందించవలసిఉన్నది. ఆదినుంచి అంతమువరకూ స్వతంత్రగ్రంథమువలెనే పొడకట్టినదిగాని ఆంగ్లగ్రంథాని కనువాదమని పించుకోలేదు. వెంకటేశ్వరరావుగారి చేతిలో వ్యావహారిక భాషకు మెరుగువచ్చినదో, వ్యావహారిక భాషవల్లనే కవిగారి రచనకే మెరుగు వచ్చినదో చెప్పడము సాధ్యము కాకుండా ఉన్నది. ఎలాగయితేనేమి గ్రంథము ప్రశస్తముగా సమాదరణీయముగా ఉన్నది.

ఈగ్రంథమునూ ‘రత్నప్రభ’నూ తెలుగులో ప్రకటించినందుకు వావిళ్ళవారిని అభినందిస్తున్నాము. ఇప్పటికవుల గ్రంథాలు విరివిగా ప్రకటించి నవ్యసాహిత్యాభివృద్ధికి వారు తోడ్పడుదురుగాక అని కోరుతున్నాము.

వెం



## రత్నప్రభ

ఎ. ఎస్. పి. అయ్యరుగారి
చరిత్రాత్మకనాటకము
అనువాదకుడు:
సర్వా వెంకటశేషయ్య
ప్రకాశకులు: వావిళ్ళవారు, మద్రాసు
91 పుటలు : ఆరణాలు.

ఈ నాటకములో పన్నా అనే రాజపుత్రి యువతి సంగమహారాణా ద్వితీయపుత్రుడైన ఉదయుని దాది. రాజభక్తి ప్రేరితఅయి తన అధీనములో ఉన్న ఉదయుని ప్రాణాలు కాపాడడానికి తన ఏకైక పుత్రుడైన అమరునికి ఉదయుని వేషము వేసి ఉదయపుర రాజ్యము స్వాధీనము చేసుకొంటూఉన్న వన

వీరుని విద్రోహఖడ్గానికి బలిగా ఇస్తుంది. అతురుని వేషములో ఉదయుని కోటదాటించి ధైర్యసాహసములతో సామంతరాజుల సాయ మపేక్షించి ఉదయుని నిరపాయస్థితిలో ఉంచుతుంది. కొంత కాలము గడచిన తరువాత అతడు తిరిగి తన తండ్రి సింహాసనము ఆక్రమించుకొనే లాగున ఏర్పాటు చేస్తుంది.

పన్నా రాజభక్తికి రూపకల్పనము చేయదలచుకొన్న గ్రంథకర్త సంకల్పసిద్ధు డైనాడు. ఆమెశీలము బాగాపోషింపబడ్డది. ఆమె ధైర్యస్థైర్యములూ ప్రభుభక్తీ పుత్రయజ్ఞమూ మాతృహృదయమూ కన్నులకు కట్టేలాగున చిత్రితము లైనవి.

అనువాదము సరసముగానే ఉన్నది కాని భాషమాత్రము అనువాదకులు పీఠికలో చెప్పకొన్నట్లు పాత్రోచితముగా లేదు. భాష పాత్రోచితముగా ఉండవలెనంటే లోకములో ఆయా పాత్రలు సహజముగా ఎట్లుమాట్లాడుతారో ఆరీతిగానే ఉండవలెను. అంతేకాని నీచపాత్రలచే వ్యావహారిక భాషప్రయోగించీ ఉత్తమపాత్రలనుకొన్నవారి చేత గ్రాంధికము మాట్లాడించీ వ్రాయడము సరికాదు. వ్యావహారిక భాషరచించవలెననే అనువాదకుల అభిలాషఅయి ఉంటుంది. కాని పాతవాసనలే బలవత్తరముగా ఉండడమువల్ల కొత్తశైలి వారికిస్వాధీనముకాలేదు. చూడండి పుట 52. ఇవి పన్నా చెప్పినమాటలు "మీమాటలు నాకెంతయు సంతసముగలిగించినవి. అతడుజీవించియున్నందులకు మీకు పరిమితముయిన ఆనందముకలిగియుండును. అవసరమైన మీప్రాణాన్నైనా అర్పించి అయన్ని రక్షిస్తాగు అనుకుంటాను......వనవీరుడు చంపింది నాకుమారుణ్ణి." కొత్తపాతల కలయిక అందగించదు. శేషయ్యగారు వ్యావహారిక భాష వ్రాయడము బాగా అలవాటు చేసుకొని ముందుముందు నాటకాలతో అభినవాంధ్ర భారతిని అలంకరించవలెనని కోరుతున్నాము.

వెం.

## ఉచ్ఛల విషాదము

100 పుటలు : వెల 0-12-0

సురవరము ప్రతాపరెడ్డి.

గోలకొండపత్రిక, హైదరాబాదు (దక్కన్)

ఉచ్ఛలరాజు క్రీ. శ. 1101-11 వరకూ కాశ్మీర దేశం పరిపాలించినాడు. రాజతరంగిణి కర్త ఐన కల్హణుడు ఆకాలములోవాడు. రాజతరంగిణిలో చరిత్రాంశాలను తీసుకొని ప్రతాపరెడ్డి గారు ఈనాటకం రచించారు. సాహిత్యదృష్టిలోగాని, ఐతిహాసికదృష్టిలోగాని చూస్తే ఈరచన ప్రశంసార్హం.

మూలగ్రంథానికీ, దీనికీ కొద్దిభేదాలున్నవి. క్రితకటువుగా ఉన్నకొంతమంది పాత్రలపేర్లు మార్చివేశారు. రాజుకు ఇద్దరుభార్యలున్నా, నాటకంలో బిజ్జలిదేవిసంగతి మాత్రమే వచ్చింది. సుస్సలుని తిరుగుబాటుకు కారణాలు కొంత మారిపోయినవి. మూలగ్రంథములో రాజు ప్రజలను చాలా పీడించేవాడని ఉన్నది. నాటకములో రాజు యోగ్యుడనీ కొందరు ఇతని యోగ్యత గ్రహించలేక ఈర్ష్యాళువులై ద్రోహులయినా రనీ తెలుస్తుంది.

రసపోషణకోసం ఐతిహాసిక విషయాలను కొంత మార్చడానికి నాటకకర్తకు స్వాతంత్ర్యం ఉన్నది. ఇందులో ఉచ్ఛలరాజును Tragic hero వలె పోషించారు. Julius Caesar ఉచ్ఛలుడూ చాలా విధాల సరిపోలుతారు. Tragic hero కు మంచి గుణాలు చాలా ఉన్నప్పటికీ ఒకటిరెండులోపాలు తప్పకుండా ఉంటవి. అవే అతనికష్టాలకు కారణమై, జీవితాన్ని దుఃఖభాజనం చేసి చివరకు మరణానికి ఈడ్చుకుపోతవి. ఇటువంటి రూపకాలవల్ల సామాజికులకు కరుణ కలిగి మనోమాలిన్యము క్షాళిత మవుతుందని పాశ్చాత్య ఆలంకారికుల తాత్పర్యం.

ఈపద్ధతి భారతీయ నాటక లక్షణానికి విరుద్ధము. ఉచ్ఛలరాజుకు ద్వంద్వయుద్ధములంటే వ్యసనము ద్రోహులను కఠినంగా దండించడమంటే ఆసక్తి.

ఈ రెండు లోపాలను పురస్కరించుకొని ప్రతాపరెడ్డిగారు ఈరాజును Tragic hero ను చేశారు. సంప్రదాయానికి వ్యతిరేక మయినప్పటికీ నవీన మార్గం తొక్కినారు. నాకు తెలిసినంతలో కాశ్మీర దేశ చరిత్రను ఆధారంగా చేసుకొని తెలుగులో మొదటినాటకం రచించినవారు వీరే.

నాటకవస్తువు ఉత్తమ చరిత్రాంశం. ఉచ్ఛలరాజు దేశక్షేమం కోరి న్యాయప్రకారం పరిపాలన చేసేవాడు. ఎంత ఉన్నతోద్యోగులైనా తప్పు చేస్తే శిక్షించేవాడు. దేనికీ భయపడేవాడు కాదు. ఒకప్పుడు రాజువల్ల ఉపకారం పొంది, దోషంవల్ల శిక్ష పొందినవాళ్ళే విరోధివర్గంలో చేరి ఇతనిని అంతం పొందించారు. కొంత జాగరూకతఉంటే రాజుకు ఆపదలు వచ్చేవి కావు. ఈవిషయంలో ఉచ్ఛలుడు Julius Caesar ను అక్షరాలా సరిపోలుతాడు. ఈ నాటకవస్తువు రాజనీతికి సంబంధించినది. స్త్రీపురుషప్రేమకు అట్టే తావులేనిది. వివాహాంతరూపకాలకన్న విశేష రాజకీయ విషయ ప్రతిపాదకాలయిన నాటకాలు ఈ కాలములో కావాలి. నాటకరచనలో రెడ్డిగారు Post Ibsen విధానం అవలంబించక చాలావరకు ప్రాచీనమార్గంలోనే నడిపారు. సంభాషణ, పద్యాలు సమయోచితముగానే ఉన్నవి. ప్రతాపరెడ్డిగారు చరిత్రాత్మక రూపకాలు ఇంకా రచించడం వాంఛనీయం.

రా. సు.



## తెనుగు దుక్కి

వ్యాసముల సంపుటి : రూపాయి

ఖండవల్లి లక్ష్మీరంజనము

Osmania University:
Hyderabad (Dn)

గ్రంథకర్త తన ఉపన్యాసాలు కొన్నిటిని చేర్చి వ్యాససంపుటిగా తయారు చేశారు. ఈ వ్యాసాల్లో చర్చించినవిషయాలు (1) నన్నయనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు. (2) ఆధునిక కవిత్వము పాశ్చాత్య విజ్ఞానము. (3) భావకవిత్వము. (4) కవితాంజలి-జడకుచ్చులు.

చివర కొన్ని పద్యాలుకూడా వున్నాయి.

నవ్యసాహిత్యాన్ని చిన్నచూపుచూసే పెద్ద మనుష్యులనువాళ్ళధోరణేదో వాళ్ళదే కానిఎదటివాళ్ళ సమాధానాలు వినేటంత ఓర్పు లేదు. వారు గౌరవించిన సాంప్రదాయానికి ఏమాత్రం భిన్నంగావున్నా అది సాహిత్యం కాదనే వారివూహ. నవ్యసాహిత్యాన్ని ఆక్షేపిస్తూ వారు నోటికి వచ్చినట్లల్లా మాట్లాడటం చేతికి వచ్చినట్లల్లా రాయటం ప్రారంభించారు. విశాలదృష్టి కలవారికిది లక్ష్యం కాదు. తెనుగుదుక్కిలో వ్యాసాలు చదివితే నవ్యసాహిత్యాన్ని సంకుచితదృష్టితో విమర్శించే సనాతనులకు కొంతేనా కనువిప్పు కాకమానదు.

మొదటివ్యాసంలో నన్నయనాటిసాంఘిక రాజకీయవిషయాలను చర్చిస్తూ వ్యాసభారతానికి నన్నయభారతానికి భేదాలు చూపించి వాటికి కారణం ఆనాటి పరిస్థితులని రుజువుచేశారు. జైనమతవ్యాప్తిని అరికట్టి వైదికమతాన్ని వ్యాప్తిలోకి తీసుకురావాలనే ముఖ్యోద్దేశ్యంతో రాజరాజు నన్నయను భారతాంధ్రీకరణానికి ప్రోత్సహించాడని గ్రంథకర్తవూహ. ఈవిషయంలో అభిప్రాయభేదాలువున్నాయి. రాజరాజు సాహిత్యాభిలాషచేత నన్నయని ప్రోత్సహించాడని కొందరూ, తనపూర్వవంశీయులచరిత్ర కావటంచేత అని మరికొందరూ వాదిస్తారు. ఇవన్నీ సరిఅయిన కారణాలే కనక ఏకమయి భారత ఆంధ్రీకరణానికి తోడ్పడ్డాయని తోస్తుంది.

రెండోవ్యాసం "ఆధునికకవిత్వము- పాశ్చాత్య విజ్ఞానము." సనాతనవాదులు ఆధునికవాఙ్మయం త్వరలో నశిస్తుందని జాతకం చెపుతున్నారు. ఆధునికుల్లో అతివాదులు కొందరున్నారు. వారి సిద్ధాంతాలుకూడా ఈవ్యాసంలో చర్చించారు. రెండుపక్షాల్లోఅతివాదసిద్ధాంతాలను ఖండించారు. ఈవ్యాసంలో ఆధునికుల ఆదర్శాలు 'వేదుక, వేదన'

అని నిరూపించారు. నవ్యజ్ఞానోదయం పాశ్చాత్య సంపర్కంవల్ల కలిగిం దనినిరూపించటానికి ఇచ్చిన వుదాహరణాలు చాలా యుక్తంగా ఉన్నాయి. మూడోవ్యాసం 'భావకవిత్వం.' కవి అనుభవిస్తేనే కాని ఉన్నతకవిత్వానికి అవకాశం లేదనిసూచించే 'Milton' వాక్యం దృఢపరిచారు ('A poet must live the poem') నవ్యకవులవూహకూడా అదే. కవి చెప్పేవిషం అనుభవపూర్వకంగా వుంటేనే కవిత్వం ఇంపుగా వుంటుంది. అందుకనే కవికి ఆత్మానుభవం ముఖ్యలక్షణం. "ఉత్తమతరగతి కవి యొక్క లక్షణము లివి. అతడు ప్రణయవేదనల పాడును, సౌందర్యము నారాధించును, సత్యము నారాధించును" అని నిర్వచనంచేశారు నవ్యకవిని. ఈనిర్వచనం సమగ్రంగానే వుంది. నవ్యకవులు తమకవిత్వవాహినిని వివిధమార్గాల ప్రవింపచేస్తున్నారు. దేశభక్తి, సాంఘికసమస్యలు, ప్రకృతి సౌందర్యము, ప్రణయము మొదలయినఅంశాలన్నీ వీరికి వుద్రేకం కలిగించి అమృతవాక్కులను పలికిస్తున్నాయి. ఈఅంశాన్ని గ్రంథకర్తఈవ్యాసంలో విపులంగా చర్చించారు.

నాలుగోవ్యాసం రాయప్రోలు సుబ్బారావుగారి 'కవితాంజలి' 'జడకుచ్చులు' అనే గ్రంథాలమీద వ్యాఖ్యానం. విమర్శలు వ్యాఖ్యానాలు భాషాభివృద్ధికి చాలా వుపకరిస్తాయి. వ్యాఖ్యాత కవి అర్థాన్ని విస్పష్టపరుస్తాడు. ఈ రెండుగ్రంథాలను తరిచి వాటిలో కవిత్వపుసొంపు తెలియజేశారు ఈవ్యాసంవల్ల. ఇదేమాదిరి ఇతరఆధునికుల గ్రంథాలుకూడా విమర్శించి వ్యాఖ్యానం చేస్తే అవి చదివేనా సనాతనులు నవ్యసాహిత్యంలో స్వారస్యం గ్రహించగలుగుతా రేమో నని మాఆశ.

ఈవ్యాసాలన్నిటిలో భాష సరళంగానూ అలంకార పూరితంగానూ వుంది. వ్యావహారికంలో వుంటే ఇంకా బాగుండేదేమో ననిపిస్తుంది. సాహిత్యకవిషయాలను అనేకం చర్చిస్తూ నవ్యసాహిత్యతత్వాన్ని వ్యక్తపరచినందుకు నవ్యసాహిత్యాభిమాను లందరు గ్రంథకర్తను అభినందించాలి.

రా. సు.

## పాషాణి

ఊటుకూరి సత్యనారాయణరావు

క్రౌన్ అష్టావో 104 మూల్యం: 8 అణాలు.

సారస్వత చంద్రికా గ్రంథమాల; అర్లపాడు గంపలగూడెం పోష్టు; కృష్ణాజిల్లా.

తెలుగు నాటక ప్రదర్శనాలు చూడవలసిన అవసరం రోజురోజుకి తగ్గిపోతోంది. చూసిందే చూడటం బాధగా వుంటుంది. సామాన్యంగా ప్రదర్శించేనాటకాలు లెక్కకి ఏపదోవుంటాయి. ఆనాటకాలే అనటులే ప్రదర్శిస్తుంటే ఎన్నాళ్లు చూడగలం! కొత్తనాటకాలు రాకపోవటానికి కారణం ఏమయి వుంటుంది? లోపం గ్రంథకర్తలదా? నటులదా? ప్రేక్షకులదా? ఇందులో మూడు తెగల వారికి సమాన భాగమే వుంది.

ఏకాంతమందిరంలో కాక జనసామాన్యానికి ఆకర్షణీయంగా వుండే నాటకాలు రచించి నటులకు ఇవ్వకపోవటం గ్రంథకర్తలలోపం. కొత్తనాటకాల కోసం ప్రయత్నించి తగినకృషి చేసి ప్రదర్శించి ప్రజలలో మంచి అభిరుచులు కలిగించకపోవటం నాటకసమాజాలలోపం. రసవంతంగా వున్న నాటకాలని చూచి ఆనందించ లేకపోవటంప్రేక్షకుల లోపం.

'పాషాణి' అనేనాటకానికి డి. ఎల్. రాయినాటకం మాతృక అని పీఠికవల్ల తెలుస్తోంది. ఇది పురాణగాథలోంచి ఏరినఘట్టం. పాషాణి గౌతమునిభార్య. అహల్య భర్తవల్ల కామితము తీరక కపటవేషంలో వచ్చినఇంద్రుడికి లోబడుతుంది. చివరకి ఇహపరాలకి రెంటికి చెడుతుంది. ఈకథాభాగం రసవత్తరమయిన సన్నివేశాలతో చక్కగా నిర్వహించబడ్డది. పాత్రపోషణ మానవస్వభావానికి ఉచితంగా వుండి రసోత్పాదనకి తోడ్పడుతుంది. పరిశీలిస్తే అక్కడక్కడ కొన్నిమార్పులు చెయ్యటానికి అవకాశం వుంది. విశ్వామిత్రునిప్రశంస అసందర్భంగా వుంది. మొదటిరంగంలో గౌతము డెప్పుడో విశ్వామిత్రుణ్ణి గౌరవించాడని చిరంజీవి

ఒక సందర్భంలో అన్నాడు. కాని తరవాత రంగములో విశ్వామిత్రుడు గౌతమాశ్రమానికి అపరిచితు డని తేల్చారు. ఇది ఎలా సమన్వయం చేయటం? గౌతముడు తపశ్చర్యకు వెడుతూ భార్యకు సతీధర్మాన్ని బోధించి వెడతాడు. అహల్యతన ఉద్రేకాన్ని అనేకవిధాల తెలియచేసి సతీత్వం భంగపడకుండా కాపాడుకోటం దుర్ఘటమని స్పష్టంగా చెప్తుంది. గౌతముడు రాబోయేదాన్ని గ్రహించలేక ధర్మపన్నాలు బోధించి సెలవు పుచ్చుకుంటాడు (దేముడిమీద భారంవేసి). అటువంటి సందర్భంలో అహల్యచేత ఆవిషయాన్ని అంత స్పష్టంగా చెప్పించకుండా వుంటే బాగుండేది.

సంభోగవిషయాలను రంగంమీదికి తేకూడదు. ఇంద్రుడికీ అహల్యకీ పూర్తిగా ఒకరిహృదయం ఒకరికి వ్యక్తపడ్డాక కుటీరంలో దీపం చటుక్కున ఆరిపోతుంది. ఎందుకిది...

ఇంద్రుడిపాత్రపోషణ నాటకానికొస్తే కళంకం లేకపోయినా ఇంద్రత్వానికిమాత్రం కళంకం తెస్తోంది. ఇంద్రుడు పచ్చితాగుబోతు, వ్యభిచారి. అహల్యకు కృత్రిమప్రేమ చూపి వంచించి ఆమెను శిశుహత్యకు కూడా పురికొల్పుతాడు. అహల్య కన్నకొడుకునికూడా హత్యచేసుకోటానికి వెనుతీయలేదుట. ఇంత పిశాచత్వం అహల్యలో వున్నట్టు పురాణ ప్రసిద్ధం కాదు. ఇంద్రుడు నిజతృష్ణ యావత్తూ తీర్చుకొని దేవతా స్త్రీ కాదని ఆమెను పరాభవజ్వాలకి ఆహుతిచ్చి తనదారిని తాను నడిచాడు. ఇటువంటివి కలియుగంలో జరిగినా దారుణంగానే గోచరిస్తాయి.

ఇటువంటి ఘట్టాలని తొలిగిస్తే పాత్రలకి న్యాయం చేసినట్లవుతుంది. వివాదాలకి అవకాశం కలిగించే అంశాలకి ఈవిధంగా సందర్భం కలిగించటం ఉచితంగా తోచటం లేదు.

కథాభాగంఅల్లిక దూలదూరంగా వుంది. కథను త్వరితంగా నడిపించటానికి ఇలా చేశారు. మాధురి చిరంజీవులపాత్రలను నాటకానికి చాలాప్రధానం చేశారు. ఇది అవసరంగానే తోస్తుంది. మాధురీ చిరంజీవులగాథ అంతర్గాథగా వుంది నాటకంలో. మాధురి వేశ్య అయినా సంస్కారంవల్ల పతివ్రతా లక్షణాలని వెల్లడిస్తుంది. అహల్య దీనికి వ్యతిరేకం! గౌతముడు యోగి అయినా చిరంజీవికన్న ఎక్కువ గార్హస్థధర్మాన్ని నిర్వహిస్తాడు. ఈవ్యత్యాసాలని నిరూపించటానికే ఈఅంతర్గాథ సృష్టించినట్లు తోస్తుంది. చిరంజీవిప్రవర్తన అప్పుడప్పుడు నవ్వు తెప్పిస్తుంది.

నాటక ప్రదర్శనమనుస్సులో వుంచుకొని గ్రంథకర్త ఈకృతి రంగస్థలయోగ్యం చెయ్యడానికి ప్రయత్నించారు. అహల్య శిలగా మారటం తిరిగి శ్రీరామ పాదధూళి తగిలి స్త్రీగా మారటం—ఇటువంటిఘట్టాల్లో నటులయిబ్బందులను గ్రహించి సమర్థతతో గ్రంథం నిర్వహించారు. జనసామాన్యం మామూలుగా వూహించేటట్లు అహల్య అక్షరాలా 'శిల'గా మారకుండా "సతీత్వమును పోగొట్టుకొని ఆత్మఘాతినియై జీర్ణించి చైతన్యము కోలుపోయిం"దిట.

నాటకంలో వ్యావహారికభాష ఎక్కువగా లేదు. పద్యాలు అక్కడక్కడ వున్నా రసం చెడలేదు. కొద్దిమార్పులు చేస్తే ఈనాటకం ఉత్తమ శ్రేణిలోకి చేరుతుందని చెప్పవచ్చు ప్రదర్శనకుకూడా అనుకూలంగా వుండటంచేత ప్రజాదరణ పొందుతుందని అనిస్తాము. ఆడినట్టు వినికిడి.

రా. సు.

## పట్టాభిగారి సోషలిజం

16 + 35 పుటలు : 0-6-0

గోపీచంద్, సూతాశ్రమం, తెనాలి.

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి కాంగ్రెస చరిత్ర గ్రంథంలోనూ, 45 వ తూర్పు గోదావరి మండలసభలో వారి ఉపన్యాసంలోనూ కొన్ని

పంక్తులను ఖండన చేస్తూ వ్రాసిన చిన్న పుస్తకం. సోషలిజం సామ్యవాదం కాదనీ సోషలిజం అంటే ఏయిద్దరూ ఒకే అర్థం చెప్పడం లేదనీ గోపీచందు గారు అన్నారు. ఆంధ్రదేశంలో సోషలిష్టులు అనే వారు ఒక సమిష్టి సిద్ధాంతానికి వచ్చినట్టు ఇంకా కనబడదు. సీతారామయ్యగారు గాని "గాంధేయులు" గాని సోషలిష్టులు కారని ఈ పుస్తకం తేల్చింది. రచనలో మార్దవము చాలా తక్కువగా ఉన్న ఈ పుస్తకం వల్ల సరిఅయిన సోషలిజం ఏదో తేలలేదు. అయితే ఇటువంటి రచనల వల్ల మనస్సుకు కొంత ఉత్తేజన లాభం మాత్రం ఉంటుంది.



## శశి దూతము

విశ్వనాథ సత్యనారాయణ, బందరు.

26 పుటలు : వెల పావలా.

ఇది రసతరంగిణీ గ్రంథమాలకి అనుబంధంగా ప్రచురణమైన నవ్యకావ్యం. నాయికకు ప్రణయ కోపాలు వచ్చాయనీ, వాటిని తీర్చమనీ నాయకుడు చంద్రుణ్ణి దూతగా కోరతాడు. "ముగుదలు పూలు నీవు ఒక మొస్తరు కోమల జీవులందు బిట్టుగ నిది యొక్క పూవుల కుటుంబము మీర లోకశ్లోకశ్య కున్ మిగులగ స్నిగ్ధులౌదురును, మీరును మీరును నొక్కటౌట నీవగుదువు నాకు దూత్యమున కంగనకున్ మృదుకోప శీలకున్." అదీగాక —

"అవలులై హుతాపములై, యగ్నిత సోమత నాహితాగ్నులే నీవయి, దేవభోజ్యమగు నిన్నడుగంగ నాటయున్, నీవును జేసి పెట్టుటయు నిక్కము సిగ్గుచున్న దైవనున్ దేవర వగ్నిమూర్తివికదే! ఇది సైతము వాగ్నికర్మయే!"

శ్రీరామునికి హనుమంతుడు లాగా, నలునికి హంస లాగా, యక్షునికి మేఘంలాగా ఈ నాయకునికి చంద్రుడు సాయపడతాడు. ఇదే ఇతివృత్తం.

ఈ కావ్యం ఏవిధంగా చూసినా ఉత్తమశ్రేణిలో చేరుతుంది. భావాలూ, భావనలూ ఎంతో ఉన్నతంగానూ సున్నితంగానూ ఉన్నాయి. ఏఒక పద్యం కూడా నీరసంగా లేదు. కావ్యమంతా ఒకే వృత్తంలో (ఉత్పల, చంపకాలతో) ఉన్నా, విసుగు పుట్టించడం లేదు. సంబోధనలు చేయడంలో సత్యనారాయణ గారిది పెట్టినది పేరు. మచ్చుకి—

"అమృతము కూడుకట్టినదొరా!" "ప్రసన్నతా గుణఖనీ!" "సుషీమరోచిషా!"...

ఈ కావ్యంలో కూడా కవిలో పొంగే తెలుగుతనం కనబడక పోదు.

ఉత్తమశిల్పం, కావ్యమంతటా, ప్రతిపాదంలోను కనబడుతుంది.

మేఘసందేశం వంటి కావ్యం తెలుగులో దీనికి సాటిగా ఇంకొకటి లేదనుకుంటూ. శ్రీసత్యనారాయణ గారు వ్రాస్తూన్న రామాయణం కూడా రఘువంశం లాగ ఉత్తమ కావ్యశ్రేణిలో చేరుతుందని ఆశ.

శి. రా.



## సాహిత్యకల

14 + 154 పుటలు : వెల 0-8-0

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, కాకినాడ

ఈ విమర్శగ్రంథం సాహిత్యవిశారద సుబ్బయ్యశాస్త్రిగారు రచించటం చాలా ఆశ్చర్యంగా ఉంది! నిజంగా సాహిత్యవిశారదు లయినవారు ఇంత ఒంటెకంటి పుస్తకం రాయరు.

దీనికి పీఠిక ప్రభల లక్ష్మీనరసింహంగారు, ఆశీర్వాదం బ్రహ్మయ్యశాస్త్రులుగారు, విన్నపము గ్రంథకర్త స్వయంగానూ, అభిప్రాయములు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, జ. రామయ్యగారూ వ్రాశారు. ఈ పుస్తకానికి పడవ కున్నంత సరంజామా వుంది. ఆధునిక సాహిత్యతత్వం అసలే తెలియని ఇంతమంది చేత ఎందుకు ఇవన్నీ రాయించుకోటం! సాహిత్యకల 154 పుటలు. 14; 15 పుటలలో ముగించవలసినవిషం ఇంత పెంచారు. పుస్తకాకారంగా ప్రకటించి ఖ్యాతి సంపాదించవలె నన్న ఉబలాటం కాదుగద! శాస్త్రిగారి రచనలో నూటికి

తొంభయివంతులు ఇతరులవాక్యాలు, పద్యాలు, శ్లోకాలు - అట్టే సందర్భం లేకపోయినా -నింపు కోటంతో సరిపోయింది. చర్విత చర్వణముల మాట చెప్పనక్కరలేదు. వీలూ చాలూ లేని గ్రాంథిక భాషలో రాయటం Prose rythm దృష్టి లేకపోవటం; చదివితే చప్పగా వుండటం; పూజ్యులను దూషించటం - ఇవి ఈ పుస్తకంలో స్పష్టంగా కనపడే విషయాలు. ఇతరుల రచనలు ఉదాహరణలుగా చూపుతూ అసలు సందర్భాలు విడగొట్టారు; అపార్థాలు స్ఫురించేటట్టు చేశారు. నిజంగా సాహిత్య కళలో సమ్యగ్దర్శనము కలవారు ఇటువంటి సామాన్యగ్రంథం రాయరు.

నీతిబాధ ఎక్కువగా పట్టుకున్న వీరు స్మరించటానికూడా వీల్లేదని తామే సెలవిచ్చేమాటలు భావాలు వాక్యాలు కొన్ని కొన్ని ఎలారాని అచ్చువేయించగలిగారో! అపద్ధర్మం అండ చేసుకుంటారేమో! ఏదేనా అంటారు. సుబ్బయ్యశాస్త్రిగారు Ethics చదువుకోటం అవసరం. అవి ఇంగ్లీషులో వుండడంవల్ల చదవకూడదంటారేమో - ఇంగ్లీషువల్ల మనభావాలు సాహిత్యం పాడయిపోయింది అంటున్నారుగా! నీతిశబ్దానికి ప్రసిద్ధంగా రాజనీతి అనేఅర్థం, morality మాత్రం అనే వీరిఅభిప్రాయంలా కనఁబడుతుంది. ధర్మసూత్రాలు వీరులక్ష్యం చేస్తే సంఘంలో నీతికీ సాహిత్యంలో నీతికి చాలా తారతమ్యం వుంటుం దని అంగీకరించకపోరు.

ఈగ్రంథకర్త ఎక్కువ గంభీరంగా గౌరవం సంపాదించుకోటానికి తగినవిధంగా రాయటానికి మారుగా ,బోడిమొల బ్యూటి' 'బట్టలెస్ సౌందర్యము' తిలకించుట, 'ఫ్రంటుబ్యూటీ 'మాడ్నెస్సు కాని మేధస్సు కాదు' ఇటువంటి ప్రయోగాలు చేయటం ఏసాహిత్య విశారదుల సంబరంకోసమో! 'ఈ నవ్యసాహిత్యకవులు...... కొందరుత్తమకుల జాల చరితమును నీచముగా వర్ణించియున్నారు... ఈ అసభ్య భావకవులలో నొక్కరికిని సాహిత్య సారస్వతముయొక్క రీతి యెట్టిదో దానిని విరచించు మార్గమెద్దియో అవంతయు దెలియదు... నవ్య సాహిత్యకవులకు శబ్దానుశాసనముతో గాని, ఛందోనియమములతో గాని, కావ్యగుణములతో గాని, తుదకు పాపభీతితో గాని పనిలేదు. నోటికి వచ్చినట్లుచ్చరించుటయు, కలమునకు వచ్చినట్లు వ్రాయుటయు స్వభావ మయినట్లు స్పష్టమగుచున్నది... ఈనవ్యాసభ్య సాహిత్యమువారు ఇప్పుడు తమ మిడినుడికౌరవుసాంపు నాధారముగాకే కాని యొడుదొడుకుతో బ్రౌఢగ్రాంధి కాంధ్రకవితాధారేయుల దృణీకరించుచున్నారు...... తెలివి యొకింత లేనియెడ దృప్తుడై......వీరు కొంతకాలమునకు శాంతోద్రేకులు కాగల్గుదురు. ప్రస్తుతముమాత్రము పట్టపగ్గములు లేకున్నవి.''
ఎవరికి? నిజంగా?

కలికాలప్రభావంచేత నేడు ఆంధ్రసాహిత్యంలో దుర్నీతిపూరితాలు సంఘాపమానహేతుకాలుఅయిన అసభ్యకవితలు విరివిగా తలయెత్తుతున్నవట. ఇలా రాయటం కాకుండా వీరు ఈటె చేత పుచ్చుకొని Don Quixote వలె మరమ్మత్తు చెయ్యటానికి దేశంమీద పడతారేమో! నిరంతరం నీతినిగురించి ఘోషపెట్టేవాళ్లవిషయమై Psycho - analysts ఏమంటారో శాస్త్రిగారికి తెలిస్తే బాగుండును.

ఈ మహాగ్రంథం ఒక మహారాజుకు అంకితం కూడాను! పొట్టులో గింజల్లాగ ఈగ్రంథంలో ప్రాచీనసాహిత్యవిషయాల్లో కొన్నియథార్థాలు లేకపోలేదు. అయితే ప్రసిద్ధ మయినవాటినే పొగడటం, అందరూ అంగీకరించినవే ఆదరించటం, క్రొత్తఅందాలు చూపలేకపోవటం వీటివల్లఈపుస్తకానికి విలువ హెచ్చిం దనటం ఎలాగ? ఆధునిక విషయాలను రంధ్రాన్వేషణతత్పరత్వంతో దోషైక దృష్టితో చూచి రాయడంవల్ల విలువ అసలే లేదు. వినయం అనేది ఎవరికైనా ఉండదగినదే! విద్య అనేది వీరొక్కరే Copy right చేసుకొనే దనుకుంటాను. వర్తమానకాలం బాగా వుండలే దనటం అనాదినుంచి వస్తోంది—పరనిందతో పాటు. నాజూకుమట్టుకు వీరిప్రత్యేక హక్కని నాకే అనుమానం పుడుతున్నదే!

ఈ పుస్తకంవల్ల ఎంతవరకూ ఉపయోగం? ప్రతి పుస్తకం ఏమి వుపయోగం అని అడుగుతారుమీరు వీరి పుస్తకంవల్లమాత్రం చాలా వుపయోగం... కాదు కాదు ఏమో జరగవచ్చు.

రా. సు.

## శివరాత్రి

పద్యకావ్యం : అర్ధరూపాయి

జి. వి. కృష్ణారావు

కూచిపూడి, తెనాలి పోస్టు.

ఈ శివరాత్రి శివరాత్రి కాదు. శాక్యగౌతముడు సంసారం త్యజించి జగత్తుకు నిశ్శ్రేయసప్రాప్తి కలిగించడానికై బయలుదేరి వెళ్లిపోయినరాత్రి. శివంకరమైన రాత్రికాబట్టి శివరాత్రి అని దీనికి పేరు పెట్టాడు. ఈకావ్యభాగాలు మూడుయామినులు. శాక్యసింహుడు శయనించిన తర్వాత కనబడ్డ దృశ్యాలవల్ల క్రమంగా మనస్సుమారిపోయి

'అని చింతించినయాదట
జనపతి కక్ష్యాంతరములు చనిచని తుదకున్
తన యశోవ్యోత్తంసముపై
జనియె తెనుక నంధకార సాగర మెనయన్'

ఇందులో కథ చాలా స్వల్పం : మూడువాక్యాల్లో చెప్పవచ్చు. అయితే భావములూ సన్నివేశములూ చాల రమణీయములైన వున్నవి. పద్యములు చక్కగా నడిచినాయి. రీతి చాలా బాగున్నది.

అక్కడక్కడున్న లోపాలలో Poetic dictionకు ఉచితంకాని 'పరవా' 'హుషార్' 'శోకస్థుడు' 'సరదా' 'చెలోచెలో' మొదలైన ప్రయోగాలు షావుకార్లు కూలీలు మొదలైనవారి ప్రశంసలూ చెప్పవచ్చును.

సద్ధర్మం అవగాహన చేసుకొని ఈకావ్యంరాసినట్టు కనబడదు. కాని కావ్యదృష్టితో చూస్తే పరవా లేదు.

ఇది గోపీచంద్ గారికి అంకితం

శాక్యగౌతముడుగృహంవిడిచి బుద్ధత్వసంపాదనకై వెళ్లడాన్నిగురించి నోరినరసింహశాస్త్రిగారు విన్నిగ్మనం అనేపేరుతో కావ్యం అల్లారు. అది మహోదాత్తం.

శి. రా.

# ప్రతిభ ఆదాయ వ్యయములు

## ఆదాయము

### సభ్యుల చందాలు

| | |
|---|---|
| జమ్మలమడక మాధవరామ శర్మగారు | రు 2 |
| ఆంధ్రసేవాసమితి కార్యదర్శి | 2 |
| దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు | 4 |
| పరిమి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు | 2 |
| ఇంద్రకంటి వాసుదేవమూర్తిగారు | 2 |
| పెమ్మరాజు వెంకటరావుగారు | 2 |
| కందుకూరి అనంతంగారు | 2 |
| మల్లిమడుగుల జగన్నాధరావుగారు | 2 |
| దివాకర్ల లక్ష్మీనారాయణగారు | 4 |
| కృష్ణదేవరాయ భాషానిలయము | 2 |
| మహారాజావారి సంస్కృతకళాశాల | 2 |
| టి. రాములు హకీమ్‌గారు | 2 |
| పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | 2 |
| గోగులపాటి వెంకయ్యగారు | 4 |
| గారపాటి ఆంజనేయచౌదరిగారు | 2 |
| గూడూరి నమశ్శివాయగారు | 2 |
| తెలికిచర్ల కృష్ణమూర్తిగారు | 2 |
| యలవర్తి కోటయ్యగారు | 3 |
| ఆంధ్రక్రైస్తవ కళాశాల | 4 |
| కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు | 4 |
| మల్లంపల్లి నాగభూషణంగారు | 2 |
| కొత్తపల్లి లక్ష్మయ్యగారు | 2 |
| తుమ్మల సీతారామమూర్తిగారు | 2 |
| నందివాడ సుబ్బారాయడుగారు | 2 |
| చుండూరు శ్రీరాములుగారు | 4-8 |
| పొందలి వెంకటసుబ్రహ్మణ్య శర్మగారు | 2 |
| మాధవపెద్ది వెంకటరామయ్యగారు | 4 |
| రావూరు వెంకటసత్యనారాయణగారు | 2 |
| హరి రామలింగ శాస్త్రిగారు | 2 |
| బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు | 2 |
| పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రిగారు | 2 |
| గూడా కృష్ణమూర్తిగారు | 4-8 |
| పోలవరపు వీరయ్యగారు | 2 |
| వేలమూరి కృష్ణశాస్త్రిగారు | 2 |
| చేబ్రోలు సూరన్నగారు | 2 |
| కొడవటిగంటి కుటుంబరావుగారు | 2 |
| కర్రా సీతారామయ్యగారు | 2 |
| మహారాజావారి కళాశాల | 2 |
| తోలేటి కనకరాజుగారు | 2 |
| మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు | 2 |
| పిసపాటి వెంకటరమణయ్యగారు | 4 |
| ఇల్లిందల సీతారామారావుగారు | 4 |
| కోమాండూరి వెంకటాచారిగారు | 2 |
| క్రొవ్విడి సుబ్బారావుగారు | 2 |
| జై. పాలసుగారు | 2 |
| వి. తల్పశాయిగారు | 2 |
| వి. భాస్కరరావుగారు | 2 |
| వట్టికొండ రంగయ్యగారు | 4-8 |
| గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు | 2 |
| పొన్నపల్లి ఉమామహేశ్వరశర్మగారు | 2 |
| కుప్పా సూర్యనారాయణగారు | 2 |
| ఆర్ వి. సోమయాజులుగారు | 2 |
| పెనుమర్తి కామేశ్వరరావుగారు | 2 |
| పిలకా గణపతిశాస్త్రిగారు | 2 |
| మందలపర్తి ఉపేంద్రశర్మగారు | 2 |
| నందూరి శేషాచార్యులుగారు | 2 |
| ఓదుమళ్ళ కామేశ్వరరావుగారు | 2 |
| పి. రాజశేఖరంగారు | 2 |
| గోవిందరాజు దత్తాత్రేయశర్మగారు | 2 |
| గుళ్ళపల్లి శ్రీరాములు చౌదరిగారు | 2 |
| రంగావఝుల సత్యనారాయణగారు | 4 |
| జి. వి. రాఘవయ్యగారు | 2 |
| పి. బాలనాగుగారు | 2 |
| | 152-8 |

## విరాళములు

| | |
|---|---|
| డాక్టరు బుర్రాశేషగిరిరావుగారు | 20 |
| గురుభాగవతుల ధర్మారావుగారు | 20 |
| వేమూరి విశ్వనాధశర్మగారు | 10 |
| కొమాండూరు కృష్ణమాచార్యులుగారు | 10 |
| బొడ్డు బాపిరాజుగారు | 5 |
| మంత్రిప్రగడ సాంబశివరావుగారు | 5 |
| | 70 |
| మొత్తము | 222-8-0 |

## వ్యయము

| | |
|---|---|
| గ్రంథాలయ ముద్రాశాలకు | 188-0-0 |
| కాకితము (పేపరు) | 1-8-0 |
| తపాలాఖర్చు | 33-0-0 |
| మొత్తము | 222-8-0 |
| పత్రిక పెట్టినది మొదలు 31-3-38 వరకు అయిన వసూళ్లు | రు 850.8.0 |
| ఖర్చు | రు 1019-2-0 |
| కార్యదర్శికి బాకీ | రు 168-10-0 |

